# నేను రోజంతా కష్టపడే గృహిణిని
# నేను కోరి కట్టుకొనేది ఆప్కో చేనేతని



అవును — నిజమే!
నిద్రలేచింది మొదలు, రోజంతా శ్రమించే సీతాకోక చిలకల్లాంటి వనితలు మీరు — అలాంటి మీకు తేలికగా, హాయిగా ఉంటూ, పడుతున్న శ్రమని తెలీకుండా చేస్తాయి ఆప్కో చేనేత కాటన్ చీరెలు.

ఆప్కో — మహోన్నతమైన చేనేత చీరెలు దర్శనమిచ్చే ఏకైక సంగమ స్థలం.... ఆకర్షణీయమైన పోచంపల్లి, పెడన (బందర్), నారాయణ్‌పేట్, గుంటూరు, మాధవరం చీరెలు, కన్న కలలకు అద్దం పట్టే కలంకారీ, కరీంనగర్, ఉప్పాడ (కొత్తపల్లి), పొందూరు, బండారులంక చీరెలు, సుందరమైన రంగుల్లో సిద్దిపేట, గొల్లభామ, బంధనేత చీరెలు అందాన్ని మీకు బందీలుగా చేస్తాయి.

రోజువారీ వాడకానికి తేలికగా, మన్నికగా ఉంటాయి. సరికొత్త అందాల దూతలు... కళ్ళు చెదిరే సౌందర్యదాతలు — నాణ్యమైన, నాజూకైన ఆప్కో చేనేత చీరెలు.



**ఆప్కో**

*ముచ్చటైన రంగుల్లో మెరిసే మనోహరం*
*ముప్పై లక్షల చేనేత కళాకారుల శ్రమఫలం*

నేడే మీ సమీప ఆప్కో కేంద్రాన్ని సందర్శించండి — అందాల ఆప్కో చేనేతలను మీ స్వంతం చేసుకోండి

## మనలో మాట

పాఠకుల కోరికను మన్నించి "నవ్వు నాలుగందాల ఆరోగ్యం" శీర్షిక వేశాము. "కార్టూన్"లు కూడా ఉన్నత ప్రమాణాలున్నవి పంపమని వ్యంగ్య చిత్రకారులకు విజ్ఞప్తి. "కార్టూనిస్టులకు" పుట్టినిల్లయిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక- ఈ రంగంలో వచ్చిన ఎన్నెన్నో కొత్త పోకడలకు పెద్ద పీట వేసిందని యిక్కడ ప్రస్తావించటం స్వోత్కర్ష కాదనుకుంటున్నాము. ఇక ముందూ అదే ఉద్యమం మాది.

* * *

వినూత్న రచయితలకు విస్తృతమైన ప్రోత్సాహం కావాలంటారు. అత్త ఒక యింటి కోడలే అన్నట్లు - యివాళ్టి విఖ్యాత రచయితలంతా నిన్నటి వినూత్న రచయితలేగా - మళ్ళీ - "పెద్ద" రచయితలు కావాలంటారు. ఈ రెండు వర్గాలకి కూడా గీటురాయి ఒక్కటే. చక్కని రచనాశైలి - "మంచి" (అంటే సుమతీశతకం కాదు) యితివృత్తం. అటువంటి రచనలను మరోసారి తులనాత్మకంగా వైవిధ్యంఉట్టిపడేలా అందించి - మీ ప్రశంసల జడివానలో తడిసిపోవాలని ఉవ్విళ్ళూరుతున్నాము!

పాఠకులు, రచయితలు, ఏజెంట్లు, ప్రకటనకర్తలు వీళ్ళంతా పత్రికకి నాలుగు స్తంభాలు! ఎవరి అభిరుచి వారికున్నా అందరికీ కొన్ని "రుచులు" కామన్‌గా వుంటాయి - వాటిని మొదట వడ్డిస్తున్నామనే అనుకుంటున్నాము - తర్వాత "ప్రత్యేక రుచుల" పంపిణీ తప్పక జరుగుతుంది. ఆంధ్రసచిత్ర వారపత్రికను ఈమధ్య చూడటంలేదన్న వారందరికీ యీమధ్య చూడటం మొదలెట్టినవారు 'మనలో మాట''గా మరోసారి చూడటం మొదలుపెట్టమని చెప్పమని కోరుతూ - శలవ్

– సం.

## వీక్లీ పోస్ట్

### నిజం – కాదు

3-2-89 సంచికలో వి. ఐ. పి ట్రీట్‌మెంట్ కథలో "ఎపెండిసైటిస్ గనుక ఏ మామూలు మనిషికో అయివుంటే ఆసుపత్రికి వచ్చిన అరగంట లోపల ఆపరేషన్ జరిగి ఉండేది" అన్నారు

ఆదే సంచికలో మంత్రిగా రొస్తున్నారు కథలో - "అర్ధ రాత్రేంటయ్యా! పొద్దునే రండి" అంటాడు గుమ్మంలో కూచుని కునికిపాట్లు పడుతున్న వార్మ్‌బాయ్

మొదటిది "మరో ప్రపంచంలో" రెండవది జరుగుతున్న చరిత్ర

– కె రామారావ్, హైదరాబాద్

### ఉత్తరాలు

ఆంధ్రసచిత్ర వారపత్రికలోని శీర్షిక- ఉత్తరాలు

ఒక్కొక్కటి ఒకొక్క నిష్పక్షపాత- తీర్పులు గడచిన వారపు స్మృతులు తెలిపే- మైలురాళ్ళు.

ఉత్తరాల రచయిత- ఉత్తరాలు

బహుమతితో ఉత్తమ రచయితగా తీర్చి దిద్దుతున్నయి ఈ- ఉత్తరాలు

ఈ శీర్షికను తీర్చి దిద్దిన ఎడిటర్ గార్కి ఈ "చిన్ని" రచయిత- నీరాజనాలు.

– ఇ ఎస్ హరిబాబు, పాకాల

## విషయానుక్రమణిక

విడి ప్రతి వెలరు. 3.50






ముఖ చిత్రం :

ఈ అలంకరణ చూసి పోల్చుకోలేక పోతున్నారా? నా పేరు "అమల"

(కాజాస్)

వచ్చే సంచికలో

బాడ్మింటన్ యోధుడు ప్రకాశ్!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

సంపుటము 81 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 27

24-2-1989

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు

సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్ (1938 - 1972)

శ్రీ విభవ నామ సం
మాఘ బ చవితి


## పంజాబ్ సమస్యకంతం ఎప్పుడు?

ఆ రాష్ట్రం ఐదు నదుల అమృతధారలతో నిత్యం తడుస్తూ, 50 వేల చదరపు కిలో మీటర్ల వైశాల్యంలో కనీసం 40 వేల చదరపు కిలో మీటర్ల మేర సేద్యయుక్తమై బంగారు పంటలీను భూమి అనీ, బంగారుగుడి, అందులో అమృత సరస్సు వున్నాయిలాంటి తియ్యనిమాట లిప్పుడు ఏమి చెప్పగలం? నిత్య నరమేథం, ఆరని మారణ హోమం. యే పాపమూ ఎరుగని, యే నేరమూ చేయని సామాన్య జనావళికి ఆరని మంటలమధ్య రక్తసిక్త కాపురం అయిపోయిన పంజాబ్ రాష్ట్రంలోని కిరాతక, ఘాతుక హింసాకాండను ఆపడానికి సంవత్సరాలు తిరిగిపోతున్నా సాధ్యం కావడంలేదు! రెండు సైనికచర్యలుగాని, పారా మిలటరీ దళాల పటిమగాని లేదా పోలీసుల నిరంతర పోరాటంగాని అక్కడి టెర్రరిస్టుల ఆగడాలకు "కామా" కూడా పెట్టలేకపోతున్నాయి! చైనా, పాకిస్తాన్‌ల నుంచి ఆయుధాలు దిగుమతి అవుతున్నాయన్నారుకాని ఆ మార్గాలను సైతం యిన్ని సంవత్సరాలుగా మూసివేయలేని అసమర్థత కూడా మన ప్రభుత్వం మీద వున్నది! పంజాబ్ ప్రజలకు నెత్తురుకూడు తప్పించగల చర్యలు ఏమిటన్నది ప్రభుత్వానికి అంతుపట్టని దశలో రాష్ట్రపతి ఆర్ వెంకట్రామన్‌గారు తమ పార్లమెంటు ప్రసంగంలో యీ ప్రస్తావన తేవడం యీమధ్య దానిమానాన – దాన్ని వదిలివేసిన గవర్నమెంటు తిరిగి ఏదైనా చేయడానికి పూనుకుంటుందో అన్న 'ఆశ'కి దారితీసింది! అయితే రాష్ట్రపతి మాటలలో "ముందు మీరు హింస విడనాడండి చర్చలకు రండి అన్న పిలుపు ఆచరణసాధ్యంగా కనపడటంలేదు ప్రాణాలను లెక్కచేయక చంపటమో, చంపబడటమో సాగిస్తున్న కిరాతకముఠాల వెనుకనున్న హస్తమేమిటో, వారి లక్ష్యమేమిటో, వారి యీ రక్తపోరాటం వెనుక దాగివున్న బలమేమిటో ఆరాతీయకుండా – ఒకచెంప చర్చలకు దిగితే బాగుంటుంది అంటున్న కొన్ని ప్రతిపక్షాల మాటలను పట్టించుకోకుండా – పార్లమెంటులో గాని, లేదా టి వి తెరమీదగాని రాష్ట్రపతి యీ పిలుపునివ్వడంవల్ల అదనంగా ఒరిగేదీ, జరిగేది ఏమివుంటుంది కనుక? అతి తక్కువశాతం మంది మాత్రం బలపరిచే "ఖలిస్తాన్ వాదాన్ని" పట్టుకుని – రక్తపాతం చేస్తున్న టెర్రరిస్టులతో చర్చలకు ముందు అక్కడగల యితర మత, రాజకీయ ప్రతిపక్ష దళాల సమీకరణకు వారితో మాటామంతీకి గల మార్గాలను వినియోగించుకోకుండా – టెర్రరిజంపట్ల ఆందోళన, ఆవేదన వెలిబుచ్చడం దండగ దాన్ని అణచివేస్తామంటూ మరోసారి ఉద్ఘాటించటం కూడా విడ్డూరమేగాని విశేషం మాత్రం కాదు.

రాష్ట్రపతి మాటలలో "అక్కడి ప్రజలు టెర్రరిజం" అణచివేతకు, సమస్య పరిష్కారానికి దోహదించాలన్న ధ్వని – మామూలు మనిషికి మరింత నొప్పి కలిగించేదిగా వున్నది. ఒక చెంప తమ ప్రాణ మాన ధన వస్తు వాహనాలకు రక్షణ లేకుండా అల్లాడిపోతున్న ప్రజలను – ఏవిధంగా దోహదించమని అడుగుతారు? రాష్ట్రపతి అయినా, దేశ ప్రధానమంత్రి అయినా? "స్కోరు" చెప్పడం ఒక కార్యక్రమంలాగ రోజు టెర్రరిస్టుల చేతిలో హతమైనవారి సంఖ్య, వీర మరణంపొందిన పోలీసుల వివరం, దొరికిపోయిన లేదా మరణించిన "కిరాతకుల' అంకె చెప్పడం మన పత్రికలు, రేడియో టెలివిషన్‌లు ఎంతకాలంగా చేస్తున్నాయి? – ఇంకా ఎంతకాలం చేయనున్నాయి? ఏ సమస్య గాని తగాదాకాని సుదీర్ఘ కాలంగా అటూ తేలక, యిటూ తేలక కొనసాగితే – లోపం రెండువైపులా యింతో అంతో వుంటుందనే వాదు వున్నది దీన్ని గ్రహించి అయినా కేంద్రప్రభుత్వం పంజాబ్ సమస్య పరిష్కారానికి కొత్త ప్రయత్నాలు మొదలుపెట్టాలి ఇది యిలావుండగా పంజాబ్ సమస్య గురించి విలేఖరులు అడిగిన ప్రశ్నకు ప్రధానమంత్రి కొంచెం వేచి చూడమని కప్పదాటు సమాధానం యిచ్చారు. బహుశా హోంమంత్రిత్వ శాఖను మరొకరికి బదిలీచేసేదాకా అన్న అర్థం వుందేమో అందులో .

కొన్ని రోజుల క్రితం పంజాబ్‌లోని ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని చర్చావేదిక ఏర్పాటు చేయమని కోరాయి ఇప్పుడు నేషనల్‌ఫ్రంటు కూడా దేశాన్ని పరిపాలించాలని కలలుగంటున్న "ఫ్రంట్" కనుక – పంజాబ్ నరమేథాన్ని అంతం చేయటానికి తన ప్రణాళికతో తన వంతు ప్రయత్నంతో ముందుకురావాలి! తలలన్నీ ఏకమై యీ సమస్యను ఎటునుంచి మొదలుపెట్టి పరిష్కరించాలి? అన్నది దేశశ్రేయస్సు దృష్ట్యా – పంజాబ్‌లో వున్న సామాన్య రైతు భైతుల క్షేమందృష్ట్యా – వెంటనే చేయవలసినపని – మతం ప్రాతిపదికమీద – (భాష కేవలం ఒక సాకుగా) రెండు ముక్కలుగా – పంజాబ్ హర్యానాలుగా విడగొట్టబడిన తరువాత కూడా అక్కడి కక్షలు కావేషాలు తగ్గకపోడంలోని అంతరార్థం ఎక్కడుందో యిన్ని సంవత్సరాలైనా పసిగట్టని, మన రాజకీయ విజ్ఞత నెలా ప్రశంసించాలో అర్థంకావటం లేదు?! ఈ నేపథ్యంలో 'ఆగడాలు మానండి, చర్చలకు రండి లాంటి పిలుపులు – "సముద్రంలో అలలు తగ్గినవెనుక స్నానానికి పొండి' అని చెప్పే సలహాల వంటివే అవుతాయి! పంజాబ్‌లోని సోదరులంతా దేశప్రధాన స్రవంతిలో కలిసేటందుకు – కొత్త మార్గాల అన్వేషణ తక్షణావసరం పంజాబ్ సమస్యను పరిష్కరించడంలో పాలక ప్రతిపక్షాల మధ్య పొంతన కూడా అవసరం ●


ముఖ్య సంపాదకుడు: శివలెంక రాధాకృష్ణ | అడ్వయిజరీ సంపాదకుడు: వీరాజీ

ముద్రాపకుడు, ప్రచురణకర్త: శివలెంక నాగేశ్వరరావు

ఆంధ్రపత్రిక ప్రెస్; గాంధీనగరం, విజయవాడ 3. ఫోన్‌లు: 75667, 61247, 61248, 75569


తెలుగువారి నిరంతర సేవలో మాకిది 81వ సంవత్సరం



గ్రేట్ ఆల్ రౌండర్ భారత జట్టుకి వెన్నుముక అయిన కపిల్‌దేవ్ నిఖంజ్ వెస్ట్ యిండీజ్ జట్టుమీద ఎన్ని వికెట్‌లు తీసుకుంటాడోనన్న దానిమీద మన జట్టు విజయం ఆధారపడి వుంటుంది.

# విద్యార్థులలో అశాంతి ఎందుకు?

## – ప్రిన్సిపాల్స్ అంటున్న మాటలు

విద్యార్థి లోకం అంతులేని అశాంతితో కొట్టుమిట్టాడుతున్నదని చాలామంది అనుకుంటూ ఉంటారు కానీ, ప్రతి రోజూ పాఠాలు బోధించే అధ్యాపక వర్గానికి మాత్రం విద్యార్థుల్లో జనం అనుకొనే అంత అశాంతి కనబడదు విద్యార్థుల నిర్మల స్వభావం, పాఠ్యాంశాలను అవగాహన చేసుకోవాలనే తపన మాత్రమే అధ్యాపకులకు అనునిత్యం దర్శనమిస్తాయి.

అయితే, అప్పుడప్పుడు విద్యార్థులు చేసే అలజడులు అల్లరుల మాట ఏమిటి– అనే సందేహం కలగవచ్చు ఈ విధమైన అశాంతికి రాజకీయ, సాంఘిక పరిస్థితులే ముఖ్య కారణం

విద్యార్థుల్లో 5 నుంచి 10 శాతం వరకూ, కేవలం కాలక్షేపం కోసమే విద్యాలయాలకు వస్తున్నారు వీళ్ళకు చదువు మీద శ్రద్ధ సున్నా. ఈ వర్గంలో ధనికులూ, పేదలూ కూడా ఉంటారు వీళ్ళకి విద్యాలయాల్లో ప్రవేశం నిరాకరించగలిగితే, కేవలం విద్యార్జన కోసం వచ్చే 90–95 శాతం విద్యార్థులు నిరాటంకంగాతమ చదువులు కొనసాగించేటట్టు చేయవచ్చు నిరాసక్తులైన ఈ కొద్దిమందినీ విద్యాలయాల్లో చేర్చుకోకుండా ఉండటానికి నిర్దుష్టమయిన, నిర్దిష్టమైన మార్గదర్శక సూత్రం అత్యవసరం అలాగే విద్యార్జన యెడల ఆసక్తి కనబరచే బీద విద్యార్థులకు, పరీక్ష ఫీజుతో సహా పూర్తి ఆర్థిక సహాయం అవసరం బీదలకు సౌకర్యాలు తక్కువవడం వలన ఉన్నత శ్రేణి మార్కులు రాకపోవచ్చు అయినా వాళ్ళకి ప్రోత్సాహం యివ్వాలి అప్పుడప్పుడు పొడసూపుతున్న అశాంతికి ఆర్థిక వ్యత్యాసం ఒక కారణం

సమాజంలో పెరిగిపోతున్న ధనిక పేద వర్గాల మధ్య అంతరమే, విద్యాలయాల్లో విద్యార్థులపై ప్రభావం చూపి అశాంతికి దారి తీస్తోంది సామాజిక వ్యవస్థలో ,మార్పు వచ్చిననాడే, ఆర్థిక వ్యత్యాసాలు తొలిగిన నాడె ఇటువంటి అశాంతి కూడా తొలగిపోతుంది



ఇ. భాస్కరరావు

జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి డిగ్రీ కళాశాల, గుంటూరు

స్వాతంత్ర్య సమరంలో నాయకులు విద్యార్థుల్ని తమ ఆందోళనా కార్యక్రమాల్లో పావులుగా ఉపయోగించుకోవడంతో, విద్యార్థులపై రాజకీయాల ప్రభావం ప్రారంభమైంది. స్వాతంత్ర్యానంతరం అది వెర్రితలలు వేసింది ప్రతి రాజకీయ పార్టీ, విద్యారంగంలో తమ విద్యార్థి శాఖను నెలకొల్పుకొన్నది. సమ్మెలకు, ఆందోళనలకు విద్యార్థులను రాజకీయ పార్టీలు వినియోగించుకొంటున్నాయి రాజకీయ పార్టీల స్వరూప స్వభావాలను పాఠ్యాంశాల ద్వారా విద్యార్థులు తెలుసుకొనే అవకాశం ఇవ్వవచ్చు కానీ, ప్రత్యక్షంగా వాళ్ళు రాజకీయాల్లో ప్రవేశించడం వలన విద్యార్జనకు ఆటంకం ఏర్పడుతుంది చదువు పూర్తి అయిన తరవాత తమ అభీష్టాన్ని అనుసరించి, విద్యార్థులు పరిపూర్ణ పౌరులుగా తయారవుతారు. కాబట్టి, రాజకీయ కార్యకలాపాలలో ప్రత్యక్షంగా పాల్గొనవచ్చు

చిన్న సమస్యకు, పెద్ద సమస్యకూ విద్యా సంస్థల్లో సమ్మెకు పిలుపు యివ్వడం, పదిమంది వచ్చి గేట్లు మూసి విద్యా సంస్థల పని దినాలను నష్టపరచడం మొదలైన అనాలోచిత విధానాల వలన కొందరు విద్యార్థుల్లో అశాంతి బీజాలను నాటుతున్నారు.

**అన్ని రాజకీయ పార్టీలు కలిసి విజ్ఞతతో నిర్ణయాలు తీసుకుంటే విద్యార్థుల్లో నెలకొన్న అశాంతిని మటుమాయం చేయవచ్చు.** •

## "రాజకీయ, సాంఘిక పరిస్థితులే కారణం" అంటున్నారు జె. కె. సి. గుంటూరు ప్రిన్సిపాల్

# రేపటి పౌరులమీద నేటి చీకటి!

"1987–88లో విద్యుత్‌కోత ఫలితంగా పారిశ్రామికవేగం కొంత వెనుకంజవేసినప్పటికీ దరిమిలా పుంజుకుంది" ఈ మాటలు ఎవరో అన్నవికావు ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శాసనసభలో చేసిన ప్రసంగంలోని వాక్యమిది దరిమిలా పుంజుకున్నదో లేదో తెలియదు – లేదా పుంజుకుంటే యెంత పుంజుకున్నదో తెలియదుకాని గవర్నర్‌గారు – 1989 తొలి అసెంబ్లీ సమావేశాలలో యీ ఉపన్యాసం చేస్తున్నప్పుడు మాత్రం రాష్ట్రంలో తిరిగి విద్యుత్ నిర్దాక్షిణ్యపు కోత "రాజ్య"మేలుతున్నది –

"చిన్న పంచర్" పడి టైర్‌లో గాలిపోయినట్టు – అకస్మాత్తుగా యీ పవర్‌కట్ వల్ల రాష్ట్రంలో అన్ని రకాల "ప్రగతి కుంటువడిపోతున్నది పోయినేడాది జులైలో ఎత్తివేసిన విద్యుత్‌కోత నవంబర్ 28 నుంచే తిరిగి విధించవలసిరావటం మన గవర్నమెంట్ ఎన్నిరకాలుగా యీ చర్యను సమర్థించుకున్నా సబబైనపనికాదు! వర్షాలు కురిస్తే పంటలు పండే రోజులు పొయ్యాయ్ అనుకున్నాం పంట కాల్వలు, రిజర్వాయర్‌ల ద్వారా నిత్య నూతన పచ్చదనంతో విలసిల్లవలసిన రాష్ట్రం మనది – పోయినేడాది, గూనలతో, బానలతో వానలు గ్రుమ్మరించినా యీ దౌర్భాగ్యపు పవర్‌కట్ – రావటానికి కారణాలుగా యివాళ గవర్నమెంటు యేవేవో చెప్పవచ్చునుగాని ఫలితాలు మాత్రం దుర్భరంగా వున్నాయి!

ఇండ్లు కాలిపోతూంటే, నుయ్యి తవ్వుతున్నట్టు – రోగాలు ముదిరాక ఆసుపత్రి నిర్మాణానికి పునాదిరాయి వేసినట్టు – మన ప్రభుత్వం ఏటా ఏవో పథకాలు వల్లెవేయడం – మళ్ళీ ఎండాకాలం "దీపాలు ఆర్పేయడం" – యిది చాలా విచారించవలసిన దుస్థితి.

గవర్నర్ ప్రసంగం కేవలం రాష్ట్ర గవర్నమెంట్ రాసినదాన్ని "చిలుక పలుకులు"గా వప్పగించటమే కనుక అందులోని నిజానిజాలను గ్రహించి మనం నిగ్గదీయవలసింది, గవర్నర్‌ని కాదు – ఆమె పదేపదే "నా ప్రభుత్వం నా ప్రభుత్వం" అంటూ పేర్కొన్న రాష్ట్రప్రభుత్వాన్నే –

"రాష్ట్రంలో మొత్తం విద్యుదుత్పాదకశక్తి 3615 మెగావాట్లు, కేంద్రం యిచ్చేవాటా 438 మెగావాట్‌లు – వెరసి 4053 మెగావాట్‌లు" యిది వారందజేసిన లెక్క – అంచనాలు తీసి చూడగా రాష్ట్ర అవసరాలకు 16 8 అంటే సుమారు పదకొండు శాతం "కొరత" ఏర్పడుతున్నది. అయినా యీ ఏడాది కొత్తగా థర్మల్ కేంద్రాల "సామర్థ్యాన్ని" పెంచలేదని గవర్నర్‌గారి ప్రసంగమే చెపుతున్నది

కాకపోతే విజయవాడ థర్మల్ ప్లాంట్ రెండవదశ కూడా అందుకుంటే పరిస్థితి కొంత మెరుగవుతుంది! కాగా పోగా అంచనాల ప్రకారం అదనపు విద్యుత్ ఉత్పత్తి చేయగలిగినా మరో 516 మెగావాట్‌ల శక్తి మాత్రం వస్తుందట. అంటే "పవర్ కట్" యిక్కట్లను మనం అనుభవించవలసిందే నన్నమాట! అనేక జనాకర్షక పథకాలుపెట్టి – సంక్షేమ కార్యక్రమాలకు కోట్లకొలది వ్యయంతో – ప్రాజెక్టులను పథకాలను ప్రకటించి – వోట్ల వేటలో నిరంతరం మునిగిపోయే గవర్నమెంట్, విద్యుదుద్పాక థర్మల్‌గ్యాస్ ప్రాజెక్టులమీద ఎందుకని "పథకాలు" కేటాయింపులు చేయలేదు?

వెనకటికో గుర్రపు రౌతు దాని ముట్టిముందు కనపడేలా గడ్డి మూట వ్రేలాడకట్టి – పరిగెత్తించేవాడుట – అది పాపం! ఆ గడ్డి




అందుకోడంకోసం ఉరుకులు తీసేదిట – అలా ఎన్ని పరుగులు తీస్తేనేం గడ్డి మూట దానిముందునే వుండి అందకుండా పోయిందట – అట్లాగ వచ్చే దశాబ్దంలోను – వచ్చే శతాబ్దంలోను "స్వర్గం" చూపిస్తాం, పేదరికం తొలగిస్తాం అంటూ "పక్కా

ఎన్. జనార్ధన రెడ్డి



గృహాల పథకాలు" అంటూ, "యింటికో దీపం", "యింటికో పంపుసెట్టు" పథకాలలాంటివి ప్రకటించడం – నిరక్షరకుక్షులు అధిక సంఖ్యలో గల మన దేశంలో నలభైఏండ్లుగా సాగుతున్న "మోసం" ఇవాళ్టి దాహం తీరటానికి రేపటి బావి త్రవ్వకం" నీళ్ళు ఎట్లా అందుతాయి!!

రైతుల సంగతి చూసుకుంటాం వారికి యీ "కోత"పెట్టే "రంపపు కోత" లేకుండా చూస్తాం అన్న ధ్వని గవర్నర్ ప్రసంగంలో వున్నదికాని –

వాస్తవానికి అది రానున్న మాసాలలో ఎలా వుంటుందో? ఈ పవర్‌కట్‌కి ఏటా దొరికిపోతున్న అభాగ్య జనులు విద్యార్థులే. నేటి విద్యార్థులే రేపటి

"ప్రగతి మూటలు" అని గొప్పలు చెప్పుతూ – వాళ్ళు గ్రుడ్డి దీపాలదగ్గిర చదువుకునే దుస్థితిని తీసుకువచ్చారు రాత్రి 9 నుంచి 10 దాకా

దీపా లార్పేస్తున్నారు పుస్తకాల దగ్గర పిల్లలు కూర్చొని అక్కడే నిద్రపోతున్నారు దీపాలు వెలిగినా యిక వాళ్ళు పుస్తకాలు తెరవలేకపోతున్నారు!

ప్రాక్టికల్స్ చేసుకుంటూవుంటే 'చీకటి" చేసేస్తున్నారు – "దృశ్య", "శ్రవణ" విద్యాప్రక్రియలు పెట్టిన తొలి రాష్ట్రం లాంటి

సిగ్గులేని ప్రకటనలు చేస్తున్న గవర్నమెంటు యీ "పవర్"లేని ఆ "ప్రక్రియలు" మూగవి, గ్రుడ్డివీ అయిపోతున్నాయని గ్రహించలేదా?

పదో తరగతి పరీక్షలు మొదలుకొని, మార్చి నుంచి జులైదాకా అన్ని "తరగతుల" విద్యార్థులకి – ఎలిమెంటరీస్థాయి నుంచి – యూనివర్సిటీ 'లెవల్"

దాకా పరీక్షలు! పరీక్షలు!! – వస్తున్నాయ్? రేపటి పౌరులకోసం దయా ధర్మ భిక్షలుగావుండే జనాకర్షణ పథకాలు వదిలిపెట్టి విద్యుదుత్పాదక పథకాలను

అమలు చేయలేకపోయినారా? పోయినేడాది ఎండలు ముద.రటానికి ముందు ఎన్. టి. ఆర్. మనం "థర్మల్ విద్యుత్" ప్రాజెక్టులమీద ఆధారపడాలి – జలవిద్యుత్తును నమ్ముకుని

కూర్చోకూడదు" అంటూ పెద్దపెద్ద గంభీరమైన ప్రసంగాలు చేశారు కాని నవంబర్ 28 నుంచే నేటి పరిశ్రమలకి, రేపటి పౌరులకీ కూడా భవిష్యత్తును

అంధకారం చేసే "కోత" మొదలుపెట్టారు! – "కరెంటుగత ప్రాణమైపోయిన" ఆధునిక "జీవితం"లో అన్నిరకాల "అంధకార" కాలం ఒకటి

– మన ప్రభుత్వ అసమర్థతవల్ల స్థిరమైపోతున్నది! – ఎండాకాలం, వానాకాలం, శీతాకాలం లాగ "సుదీర్ఘ పవర్ కట్ కాలం" ఒకటి – ఏ

పంచాంగకర్త రాయడుకాని, మన ప్రజాస్వామ్య పరిపాలకులు మన నొసట రాస్తున్నారు!

పిటీ! పిటీ!!

# సంపూర్ణమైన పెరుగుదల కోసం రుచికరమైన ఫారెక్స్® మార్గం.

| మీ పాపాయి పొడవు, బరువు తనిఖీ చేసుకోండి* | మగ పిల్లలు | | ఆడ పిల్లలు | |
|---|---|---|---|---|
| | బరువు | పొడవు | బరువు | పొడవు |
| **3** నెలలు | **5.2** కిలోలు | 59.1 సెం.మీ. | **4.9** కిలోలు | 58.4 సెం.మీ. |
| **6** నెలలు | **6.7** కిలోలు | 64.7 సెం.మీ. | **6.1** కిలోలు | 63.7 సెం.మీ. |
| **9** నెలలు | **7.3** కిలోలు | 68.2 సెం.మీ. | **6.9** కిలోలు | 67.0 సెం.మీ. |
| **12** నెలలు | **8.4** కిలోలు | 73.9 సెం.మీ. | **7.8** కిలోలు | 72.5 సెం.మీ. |

* ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి ద్వారా విడుదల చేయబడినది.

ఇవి భారతీయపిల్లల కోసం సగటు బరువు, పొడవులు మాత్రమే. వీటితో సరిపోలకపోయినా, మీ పాపాయి పెరుగుదల మీ డాక్టరుకు సంతృప్తికరంగా వుంటే ఆందోళనపడే అవసరం లేదు.

**పిల్లల పెంపకం సంబంధంగా తీసుకోవలసిన శ్రద్ధను గూర్చి తెలిపే చిన్న రంగుల పుస్తకపు ఉచిత ప్రతి కోసం వీరికి వ్రాయండి:**
**గ్లిండియా లిమిటెడ్, (FPD/57),**
**డా. అనీ బెసెంట్ రోడ్,**
**వర్లీ, బొంబాయి-400 025.**




సంపూర్ణమైన వికాసం
మరియు పెరుగుదల కోసం
మీ పాపాయికి ఇవ్వండి

## ఫారెక్స్®

పెరుగుదల కోసం
రుచికరమైన విధానం

26/244 TEL

## తాజా కాలమ్




చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు - ఎమ్. జి. యార్ గారి మహిళామణులు యిప్పుడు అన్నా డి. ఎమ్. కె. ని చెరి సగం ఏలుకుంటామంటూ ఏకమైనారు. వారి పార్టీ కార్యాలయం ముందు దృశ్యం యిది.

# కాం।గెసు పార్టీ కార్యవర్గం అను "పుష్పక విమానం"

ఉన్న మంత్రులందర్నీ "అంఫట్" చేసి – వారం రోజుల్లో 23 మంది మంత్రులు గల కొత్త జాబితాను మాయమంత్రగాడు తన టోపీలో నుంచి కుందేలుపిల్లని తీసినట్లు – బయటపెట్టిన ఎన్. టి. రామారావును చూస్తే – జనార్ధనరెడ్డిగారికి ఎలా వుంటుందో మనం వూహించలేం! ఏ అధికారము, పదవీలేని "చాకిరీ" స్థానాలకు కూడా కాం।గెసు ప్రదేశ్ అధ్యక్షుడు ఒక చిన్న జాబితాను చెయ్యలేకపోయాడు. అన్ని "ముఠా"ల వారిని సంతృప్తి పరచడంకోసం – అందరూ సమావేశమైతే "వో చిన్న బహిరంగ సభ" అంతవుండే కాం।గెసు కార్యవర్గాన్ని తయారుచేశారు. అవును మరి? కులాలకి, మతాలకి, "ముఠాల"కి, "వర్గాల"కి, అస్మదీయులకు, తస్మదీయులకు అందరికీ ఏదో వొక "అలంకారం" మెడలో వెయ్యాలిగా. అందుకనే ప్రదేశ్ కాం।గెసుకి 6 మంది ఉపాధ్యక్షులు, 8 మంది ప్రధాన కార్యదర్శులు తయారైనారు –

ఎన్. జనార్ధనరెడ్డిగారి ఉపాధ్యక్షుల జాబితా చూస్తేనే తెలుస్తోంది మన కాం।గెసులో వున్న వేర్వేరు కుంపట్లు ఎన్నో – అయితే యిందులో వున్నవాళ్ళంతా "కప్పా విప్పా" సమర్థులు! కాం।గెసును మరోసారి వోడించకుండా ఏమైనా ప్రయత్నం తల్పుకుంటే చేయగలవాళ్ళే!

పిన్నమనేని కోటేశ్వరరావు, కె. రోశయ్య, సరోజినీ పుల్లారెడ్డి, డి. మునిస్వామి, శ్రీరాములు వగైరాలంతా అసలు అధ్యక్షులుగా వుండగల పెద్దలు కనుక ఉపాధ్యక్షులుగా నైనా పార్టీని కూడదీస్తారేమోనని, మామూలు కాం।గెసుజనం ఎదురుచూస్తున్నారు. రాష్ట్ర కాం।గెసు ఖజాంచీగా జి. ఎస్. రాజుగారు ముమ్ముందు "సమ్మతివర్గాల" ప్రతినిధిగా నిలబడతారని కూడా కాం।గెసువాదులు కొందరైనా ఆశపడతారు – మొత్తంమీద – "తలతల పెద్దల దండనాయకులువున్న కారణాన "తీన్ తేరా" అయిపోయిన ఆంధ్రప్రదేశ్ కాం।గెసు – యీ "ఎయిర్‌బస్"లో నైనా ఎగరగలిగితే వెరీగుడ్! మార్చి 3న కొత్త పి. సి. సి. కార్యవర్గ సమావేశం జరిగాకకాని "లోగుట్టు" బయటపడదు. ఇందులో ప్రత్యేక ఆహ్వానితులూ, ఆహ్వానితులు – అందరూ మహానుభావులే కనుక – రాష్ట్ర కాం।గెసు రథం ముందుకీ, ప్రక్కకీ, వెనక్కీ కూడా వెళ్ళగలదు – ఏమంటారు?

22-2-1989.



# నవ్వు నాలుగందాల ఆరోగ్యం

## మాష్టారికి నమస్కారం!



ఎప్పటిలాగా స్కూలుకు తయారయి వెళ్ళిన నేను స్కూలు గేట్లో అడుగు పెడుతూనే ఆగిపోయాను దక్షిణం వైపునున్న మాక్లాసు రూంలోంచి దెబ్బల చప్పుడు వినిపిస్తోంది అటు వెళ్ళాను ఏడోక్లాసు చదివే 'మధు' గాణ్ణి పట్టుకు చావ బాదుతున్నారు – తెలుగు మాష్టారు

ఆయన కొట్టే కొలదీ వెకిలిగా నవ్వుతున్నాడు 'మొండి వాడైన మధు ఆయన కొట్టేది – వాడు' పారం వొప్పజెప్పలేదని కాదు స్కూలెగ్గొట్టాడని అంతకంటేకాదు మరెందుకోనని అదేపనిగా చూడసాగాను

"వెధవా! దారిలో వచ్చేటప్పుడు నమస్తే చెప్పొద్దని ఎన్నిసార్లు చెప్పాలిరా నీకు!" అంటూ ఎడా పెడా వాయించసాగాడాయన " అలా ఈసారి గనుక చెప్పావంటే ఒళ్ళు చీరేస్తా జాగ్రత్త"

కిసుక్కున నవ్వాడు వాడు. ఇక కొట్టే ఓపిక లేక బెత్తం కింద పడేశాడాయన

గెడ కర్రకు పంచె, లాల్చీ కట్ట బెట్టినట్టు, సన్నగా రివటలా గాలేస్తే ఎగిరిపోయేట్టుంటాడాయన

విజిలేస్తూ ఇవతలి కొచ్చిన మధుగాడిని అందరం చుట్టుముట్టాం – భరించలేని సస్పెన్స్‌తో "ఒరే! మధూ! నమస్కారం పెట్టొద్దని ఎందుకంటున్నాడాయన? వద్దన్నా నువ్వెందుకు పెడుతున్నావు? కాస్త చెప్పి పుణ్యం కట్టుకోరా!" అని వాడిని వేడుకున్నాం

అలాగేనని అభయమిచ్చి, స్కూలు వదలగానే చేలగట్ల వెంబడి నడిపించాడు మమ్మల్ని ఒక మామిడి చెట్టు దగ్గర నిలబడమన్నాడు స్కూలునుంచి యింటికి పోతూ ఆ దారి వెంబడి సైకిలుపై వస్తున్నారు మా తెలుగు మాష్టారైన అవధానిగారు వర్షం పడటంతో ఆ నల్లరేగడి నేలంతా బంక బంకగా ఉంది సరిగ్గా ఆయనను బురదగుంట దగ్గరకు రానిచ్చి "నమస్తే సార్!" అంటూ ఎదురు వెళ్ళాడు మధు అంతే! కొత్తగా సైకిలు నేర్చుకున్న ఆయన చెయ్యెత్తబోయి బాలెన్స్ తప్పి 'దబ్' మంటూ బురదగుంటలో పడ్డారు

–పాట్నీడి చక్రరావు

★ ★ ★

## డ్యాన్స్! డ్యాన్స్!!

స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా మాకాలేజిలో ఫంక్షన్ నిర్వహించారు అయితే ఈ ఫంక్షన్ సందర్భంగా ముఖ్య అతిథులుగా జిల్లా కలెక్టర్– జిల్లా మంత్రి – ఇతర పెద్దలను ఆహ్వానిస్తున్నట్లుగా కరపత్రాలను విడుదల చేసారు ఆ కరపత్రాలలో నా పేరు కూడా ఇమిడివుంది– ఎందుకంటే నా 'బ్రేక్‌డాన్స్" కార్యక్రమం – అదే రోజువుంది కాబట్టి

ఆరోజు కాలేజి రంగుల కాగితాలతో ముస్తాబై వుంది సాయంత్రం ఆరు గంటలకల్లా జిల్లా కలెక్టర్ – మంత్రి స్టేజీ మీద ఆహ్వానితులై వున్నారు ఓ పావుగంట సేపు కాలేజ్ ప్రిన్సిపాల్ గారి ప్రసంగం ముగియగానే – జిల్లా కలెక్టర్– మంత్రి– ఇతర పెద్దల ప్రసంగాలు ముగిసే సరికి సుమారు పదిగంటలైంది తరువాత ఓ విద్యార్థి మైక్ దగ్గరకొచ్చి – ఇప్పుడు "మధు' బ్రేక్‌డాన్స్" – అనే పదం చెప్పనివ్వకుండానే చప్పట్లతో కాలేజ్ మారుమ్రోగిపోయింది

స్టేజీ మీదకు అడుగు పెట్టాను అప్పటి వరకు ప్రసంగాలను విని వేసారిన 'కుర్రకారు" క్రొత్త తరం కోసం ఎదురుచూస్తున్నట్లుగా – నా డాన్స్ కోసం ఎదురుచూస్తున్నారు నా కెదురుగా వున్న తెర మూయబడింది కొంచెం సమయం గడిచిందో లేదో – తెర పైకి లేవడం – మైక్ సౌండ్ పెరగటం– క్షణాల్లో జరిగిపోవటంతో ఉత్సాహంగా కళ్ళల్లో వొత్తులు పెట్టుకుని చూస్తున్నారు కుర్రాళ్ళు

ఓ అయిదు నిమిషాల సేపు ఆడాన్స్‌ని కళ్ళార్ప కుండా చూస్తున్నారు నా కొచ్చిన డాన్స్‌ని స్టేజీ మీద ప్రదర్శిస్తున్నానునేను అంతే ఒక్కసారిగా లైట్స్ ఆరిపోవటం– మైక్ సౌండ్ తగ్గి పోవడం జరిగిపోయాయి ఒక వేళ ఈ డాన్స్‌కి లైటింగ్స్ కూడా పెట్టారేమో ననుకుని – అలాగే స్టేజి మీద కాళ్ళు – చేతులు వంకర్లు తిప్పుతున్నాను ఒక్కసారిగా తెరకూడా పడిపోవటంతో వికటాట్టహాసంగా నవ్వుతున్న నవ్వులు అప్పుడు గాని నా చెవులకు తాకలేదు నేను స్టేజీ మీదకు వచ్చినప్పుడు చేసిన చప్పట్లకంటే– ఇంకా విపరీతంగా వున్నాయి ఆనవ్వులు అప్పుడు ఓ ఫ్రెండ్ నా దగ్గర కొచ్చి 'ప్యాంట్ చిరిగింది, స్టేజి దిగిపో అన్నాడు నా ప్యాంట్‌కేసి చూసుకునే సరికి మోకాళ్ళ నుండి – నడుం వరకు చిరిగిన ప్యాంట్ నన్ను వెక్కిరిస్తూ కనిపించే సరికి – ఆరోజు నుండి ఇప్పటి వరకు నేను ఎక్కడా ప్రదర్శన లివ్వటానికి ఒప్పుకోలేదు– ఓ పది రోజులు కాలేజిక్కూడా వెళ్ళలేదు

–బి. మధుసూదన్‌రావు







# మీరైతే ఏమనుకుంటారు?..

విశ్వనాథ గణపతి రావు

శారీరకంగా నేను అలసిపోయానో లేదో నాకు తెలియడం లేదుగాని, మానసికంగా పూర్తిగా అలసి, విసిగిపోయాను దానికి కారణం ఒక్కటే – అమ్మ ప్రవర్తన

అంతదూరం రైలులో వెళ్ళి, మరంతదూరం బస్సులో ప్రయాణించి, నాలుగుమైళ్ళు నడిచివెళ్ళి ఆ అమ్మాయిని చూసివచ్చాము కాని ఏం ప్రయోజనంవుంది? మనసంతా నలిగి విసిగిపోయింది

అసలు అమ్మ అలా ప్రవర్తించివుండకుండా వుంటే బాగుండేది ముద్దబంతిలా ముస్తాబై కూర్చున్న ఆ అమ్మాయిని చూసి నచ్చలేదంది ఇంత డబ్బు ఖర్చుచేసివస్తే యిలాంటి అమ్మాయినా చూపించేది? అంటూ మధ్యవర్తి తలమీద మద్దెలవాయించేసింది ఆయన ఏం చెపుతున్నా వినిపించుకుందికాదు అమ్మనుచూసి, తన ప్రవర్తనను, మొడుకుతనం నిండిన మాటలను నాన్న విని ఇబ్బందిగా ముఖంపెట్టారు అసహ్యించుకున్నారు అక్కడ మౌనంగా కూర్చోడానికి యిరుకుగా ఫీలయ్యారు కాని నోరువిప్పి అమ్మ ముందు తన అభిప్రాయాన్ని మాత్రం చెప్పలేకపోయారు అభిప్రాయాన్ని చెప్పలేకపోయినా, ఒకటిమాత్రం చేసారు నావైపు జాలిగా చూసి 'ఒరేయ్! రాంబాబూ! నీ కీ జన్మకు పెళ్ళవుతుందట్రా? అన్న భావం తన ముఖంలో కనబడేలా చేసారు

ఇంతకూ పిల్లనుచూసిన నన్ను పెళ్ళి చేసుకోబోయే నన్ను మా అమ్మగాని, నాన్నగారు గాని కనీసం పెళ్ళిపెద్దగాని "అమ్మాయి ఎలావుంది బాబూ? నీకు నచ్చిందా? అని అడిగిన పాపానపోలేదు

వాళ్ళు అడగకపోతే కనీసం నీవైనా చెప్పొచ్చుకదా? అని మీ రంటారేమో! తప్పకుండా మీతో చెపుతాను మీకేకాదు – తు చ తప్పకుండా ఇప్పటికి జరిగిన యిరవైనాలుగు (ఈవాల్టిది యింకా కలపలేదండోయ్!) సంబందాల గురించి అడిగే బేతాళుడి భుజంమీది శవం లాంటి మా ప్రక్కింటి అనుమాయమ్మ (మా వీధిలో ఆడాళ్ళంతా ఆమెను అనుమానం అమ్మ అంటారు)కు కూడా చెప్పాలి తప్పదు అని నేను అనుకుంటుండగానే అనుమాయమ్మ కాదుకాదు అనుమానంఅమ్మ రానేవచ్చింది వస్తూనే నా వైపు అనుమానంగా చూస్తూ ఏవబ్బాయ్! నీ కీ సంబంధంకూడా నచ్చలేదటగా! మీ అమ్మ చెప్పిందిలే! ఇంతకూ పిల్లెందుకు నచ్చలేదు? నల్లగావుంటుందా? నల్లగావున్నవాళ్ళు మనుషులుకారా? అంటూ నావైపు అదోలాచూసింది ఆ చూపులో నేనడిగిన ప్రశ్నలకు కావాలని అబద్ధంచెప్పావో నీకు ఈ జన్మలో నేకాకుండా ఇంకో వెయ్యి జన్మలవరకూ మీవాళ్ళకు ఎల్ల నచ్చదు నీకు పెళ్ళికాదు' అన్న బేతాళుడి బెదిరింపూవుంది (ఇక్కడ ఆడమనిషిని బేతాళుడితో పోలుస్తున్నానేమిటని కలవరపడకండి ఆడ వారిలో కూడా బేతాళుడి బాబులా కాదుకాదు – తాతలా ప్రశ్నలతో పీడించి, భుజంయెక్కి కూర్చునేవాళ్ళున్నారు)

అనుమాయమ్మ అవతలికెళ్ళిపోయింది

నేను గుండెనిండా గాలిపీల్చుకుని అలా వరండాలో వేసివున్న వాలుకుర్చిలో చెరబడి కళ్ళు మూసుకున్నాను

'ఇంతకూ పెళ్ళిచూపుల్లో ఎల్ల నీ కెలావుందో చెప్పనేలేదు' ఎవరో అడిగినట్లనిపించి ఉలిక్కిపడిలేచి చుట్టూ చూసాను నేను కాని ఎవరూ కనిపించలేదు మరి ఎవరుఅడిగారూ? మీరుగాని అడిగారా? అయితే చెపుతాను వినండి! ఆ అమ్మాయి "

ఇదేం చోద్యమమ్మ! పాతిక సంబంధాలు 'చూసినా రాంబాబు కళ్ళకి ఓ అమ్మాయి కూడా ఇంపుగా కనిపించలేదా?"

ఆఁ! ఇంపుగా కనిపిస్తేనే పెళ్ళామా? ఆ యింపుతనం మగాళ్ళలోనూ కనిపించాలిగా? మన రాంబాబు ఏమంత అందగాడని" అన్న మాటలు నా చెవినపడ్డాయి దానితో నా నోరు మూతపడిపోయింది

ఇంతలో గోడగడియారం రెండుగంటలుకొట్టి, వీధిలో అమ్మలక్కలందరూ మా వీధి అరుగుమీదకు చేరి వీధిలోవాళ్ళ విషయాలదగ్గరనుండి అమ్మ ఇందిరాగాంధీ విషయాలు, అన్న రామారావుగారి కబుర్లు, తమ్ముడు రాజీవ్‌గాంధీ సముద్రంలో తిమింగలాల వేటవరకూ చేటలో బియ్యంలా చెరిగి వదిలేసేసమయం అయ్యిందని తెలిపింది దానిలో ఈ రోజు కరెంట్ ఎఫైర్‌గా నాగురించేవచ్చింది

'ఇంతకూ రాంబాబుకి నచ్చనిది అమ్మాయా లేక వాళ్ళిచ్చే కట్నమా?"

ఆ మాటలు వినగానే నా వీపుమీద ఎవరో చెళ్ళున కొరడాతో కొట్టినట్లనిపించలేదుగాని 'ఫట్'మని కొత్తైవ్‌మీద జెల్ల కొట్టినట్లనిపించి తల దిమ్మెక్కిపోయింది దానికి కారణం నాకు కట్నం ఆశలేదు మా అమ్మకు వున్నా నేను పడనివ్వను మా నాన్నగారిదీ నా మాటేగనుక నా కోరికే నెరవేరుతుందన్న నమ్మకం నాకుంది అసలు మా

## మీ జి. కె. ఎంత? 7

(1) భారత జాతీయ కాంగ్రెస్ మూడవ మహిళా అధ్యక్షురాలు శ్రీమతి నెల్లిసేన్‌గుప్త అసలు పేరేమిటి?
(2) సుఒమి టసవాల్ట అనేది ఏ దేశపు అధికార నామము?
(3) 'లాండ్ ఆఫ్ కేక్స్' అని ఏ దేశాన్ని అంటారు?
(4) "గాంధీగారి అయిదవ కుమారుడ"ని ఎవరిని అంటారు?
(5) ఐక్యరాజ్య సమితి మొట్ట మొదటి ప్రధాన కార్యదర్శి ఎవరు?
(6) ప్రపంచంలో అత్యంత ఎత్తయిన పర్వత శిఖరాలు ఎవరెస్ట్, కె.టు, కాంచన జుంగా ఈ మూడింటిని అధిరోహించిన మొదటి వ్యక్తి ఎవరు?
(7) రష్యా ప్రయోగించిన స్పేస్‌షటిల్ పేరేమిటి?
(8) సముద్రంలో స్నానం చేస్తూ అదృశ్యమయిన ఆస్ట్రేలియా దేశపు ప్రధాన మంత్రి ఎవరు?
(9) మహాభారత్ టి. వి. సీరియల్‌లో 'యశోద' పాత్రధారి ఎవరు?
(10) కె. ఎల్. ఎమ్. విమాన సర్వీసు ఏ దేశానికి చెందినది?

(జవాబులు ఈ సంచికలో నే....)

—జై

నాన్నగారు నోరు విప్పితే ఈపాటికి ఏ విషయం తేలిపోయివుండేది ఈరోజు వీధిలో వాళ్ళమాటలు నాన్నగారితో చెప్పి అటో ఇటో తేల్చుకోవాలి

★ ★ ★

నా మాటలు వింటూనే మా నాన్నగారు నావైపు తలయెత్తి చూసారు నిర్లిప్తంగా!

"నాకు పెళ్ళిచేస్తారా లేదా అని నే నడగడంలేదు నాన్నగారూ! నన్నింకెప్పుడూ పెళ్ళిచూపులకి రమ్మని మాత్రం అడక్కండి! ప్లీజ్!"

"ఏం? ఎందుకనిరా?" వంటగదిలోంచి వస్తూ అడిగింది అమ్మ.

నేనేదో చెప్పబోయాను. కాని మా నాన్నగారు నన్ను ఊరుకోమన్నట్టు సౌజ్ఞచేసి ఆపారు. ఆపి ఆయన నోరువిప్పారు.

'అమ్మయ్య! నాన్నగారు నోరువిప్పారు. ఇక నా ప్రాబ్లమ్ సాల్వుఅయిపోతుంది. అసలు మా నాన్నగారిలాంటివాళ్ళు నోళ్ళు విప్పకే నాకు ఎదురైన పరిస్థితిలాంటి పరిస్థితులు అలా స్తబ్ధుగా వుండిపోతున్నాయి.

"వాడ్ని చెప్పనివ్వండి!" అంది మరలా అమ్మ.

"వాడు మాట్లాడుతుంది నాతో! నీతో కాదు. నీవు కాసేపు మాట్లాడకుండా వింటే విను. లేకపోతే వెళ్ళి నీ వంటపనిచూసుకో!" అన్నారు కోపంగా!

"అహ! ఇకపరవాలేదు. నాన్నగారు నోరు విప్పడమేకాకుండా కోపంకూడా రప్పించుకున్నారు. ఇక నా ప్రాబ్లమ్ తీరదేమోనన్న వీసమెత్తు అనుమానం కూడా నివృత్తి అయినట్లే!

అయితే ఏమిటండి, మీరనేది? వాడు పెళ్ళి చూపులకి రాకపోతే మీరూ నేనూ చూస్తే సరిపోతుందా?"

ఇప్పటివరకూ మనం చేసింది మాత్రం అంతకన్నా ఏముంది?. వాడ్ని బొమ్మలా కూర్చోబెట్టి మన మాటలు మనం మాట్లాడి తిరిగొచ్చేస్తున్నాం. ఏనాడైనా వాడి అభిప్రాయాన్ని అడిగిన పాపాన పోయామా? .."

"వాడ్ని అడిగే దేమిటి, పసివాడు....' మా అమ్మ ఖండించడానికి ప్రయత్నిస్తునే ఉంది.

'పసివాడు" అన్నమాట, ఈ సారి మా అమ్మే నా నెత్తి మీద మొట్టినట్టయి చేతితో తడుము కున్నాను అంతేకాదు "మూడో పెళ్ళి చేసుకోబోతున్న ముత్తయ్యకీ, నీకూ వయసులో తేడా కనిపించడం లేదు, రాంబాబూ!... ఆ ముత్తయ్య మూడో పెళ్ళి అనుకున్న మూడు రోజుల్లో చేసేసు కుంటున్నాడు నీకు మూడు పుష్కరాలు దాటినాకైనా ఒక్క పెళ్ళి జరుగుతుందో లేదో అన్న అనుమానంగా ఉంది; నాకు అన్న అనుమాయమ్మ మాటలు గుర్తొచ్చి నవ్వొచ్చింది, నాకు

జుట్టుపండి, పళ్ళు పట్లు వదిలేసే వయసు పచ్చినా తల్లిదండ్రులకు పిల్లలు పసివాళ్ళేనన్న మాట, నిజమని పించింది, అమ్మ మాట వినగానే!

అయితే మరి రాంబాబు పెళ్ళి అయ్యేదెలా అండి?' తన ప్రయత్నం తను చేస్తుంది మా అమ్మ

నీవు మాట్లాడకుండా ఉంటే అదే జరిగి పోతుంది

అంటే! "

మాట్లాడొద్దన్నానా?? "

మా అమ్మ నోరు ఇన్నాళ్ళకు మూయించారు నాన్నగారు ఇక నా పెళ్ళికి అడ్డేమి ఉంది అందుకే ముందు రోజు రైలు, బస్సే కాకుండా కాలినడకన కూడా ప్రయాణించి వెళ్ళి చూసిన ఆ పల్లెటూరు అమ్మాయిని పైసా కట్నం కూడా కోరకుండా పెళ్ళి చేసుకోడానికి అంగీకరించేసాను ఇప్పుడు నాకు చాలా గర్వమని పించింది వీధిలో వాళ్ళకు ముఖం చాటేసుకుని తిరిగే నేను ఇప్పుడు కాలరు

## నీనాగుప్తా గట్స్

చక్కటి పాపాయికి తల్లి అయింది నీనాగుప్తా. బుల్లి తెర మీద అగ్రశ్రేణి తారగా వాసికెక్కిన యీ నటికి పెళ్ళి అవలేదు. కుంతీదేవి అంటూ అందరూ అన్నారు. సూర్యుడి కొడుకు కర్ణుడు అని చెప్పిన 'కుంతి'కి నీనాకి పోలిక లేదు. నీనాగుప్తా తన బిడ్డ తండ్రి యెవరో ఛస్తే చెప్పనంది. సమాజమా? చట్టు బండలా? నా సొంత వ్యవహారాలు దానికి ఎందుకు?– నా బిడ్డని పెంచేది నేను. పోషించుకొనేది నేను.... కాలక్రమంలో అన్నీ మరిచిపోతుందీ సమాజం- పత్రికల వాళ్ళు గొడవ చేయకపోతేనంటూ నీనాగుప్తా ఒక విలేఖరికి చెప్పింది.



'యాత్ర' టి. వి. సీరియల్‌లో నీనాగుప్తా తన ప్రేమయాత్ర కూడా సాగించింది అంటారు కొందరు– అందులో ఆమె గర్భవతిగా అద్భుతంగా నటించింది. జీవనయాత్రలో కూడా నీనా డేరింగ్‌గాల్!

# మీరైతే ఏమనుకుంటారు?..

ఎగరేసుకుని, చెరగని జుట్టును పదే పదే సవరించుకుంటూ అందరి ముందూ దర్పంగా, ఠీవీగా నడవ సాగాను

★ ★ ★ ★ ★ ★

నా పెళ్ళయి పోయింది

పెళ్ళి రోజా, శశిరేఖ రూపంలో ఉన్న గటోద్గజ డిలా "అహ! నా పెళ్ళి యంట ' అంటూ సంబర పడిపోయాను కాని పెళ్ళయిన మూడో రోజు ఆ సంబర మంతా నీరుగారి పోయింది

నా పెళ్ళి ఓ మారు మూల పల్లెటూళ్ళో జరగడంతో మా వీధిలో నిలయ విద్వాంసులు (అమ్మలక్కలు) ఎవ్వరూ రాలేదు మేము మూడో రోజు ఇక్కడికి రాగానే వాళ్ళు మా చుట్టూ మూగి మూతులు కొరుక్కోవడం ప్రారంబించారు (అలా అని నా మూతీ ఎవరో ఒకరు కొరికి ఉంటారనుకునేరూ ' ఆ పని మాత్రం జరగ లేదు) అలా ఎందుకు కొరుక్కుంటున్నారో (కొందరు చెవులూ కొరికేసు కున్నారు) నాకు అర్థం కాలేదు అలా అని అర్థమవ్వ డానికి ఎంతో సెపు పట్టనివ్వ లేదు, వాళ్ళు

మద్యాహ్నం మామూలుగా వీది సమావేశంలో తేలి పోయించి

ఇన్ని సంబంధాలు చూసి ఇదేమిటమ్మ ఇలాంటి అమ్మాయిని చేసుకున్నాడు రాంబాబు'

ఎం' ఎలా ఉంటుందా అమ్మాయి? ఇంకా చూడని ఓ అమ్మలక్క ప్రశ్న.

'పొట్టిగా, నల్లగా, లావుగా ఎందుకులే అన్ని చెప్పటం తారు డ్రమ్ములా ఉంటుందంటే సరిపోదూ?

"ఇంకో విషయం తెలుసా నీకు! పైసా కట్నం తీసుకో లేదంట, అంత సుందరమైన అమ్మాయికీనూ

'అది నిజమని నమ్మేస్తున్నావా అనుమాయమ్మ!

'నేనంత తొందరగా నమ్మేస్తానంటే నీకు నమ్మకం కలిగిందా జలజమ్మ?'

'ఇంతకూ విషయ మేమిటట?

పిల్ల నచ్చలేదన్న నెపంతో ఈ పాతిక సంబందాలూ ఎందుకు చూసారను కున్నావ్? వాళ్ళు ఇచ్చే కట్నం నచ్చకే మొదట ఈ అమ్మాయి నచ్చలేదని చెప్పి మరలా పెళ్ళి కొప్పుకున్నా రనగానే ఏం జరిగి ఉంటుందో వేరే చెప్పాలా? వాళ్ళనుకున్న కట్నం సొమ్ము దండిగా ముట్టి ఉంటుంది పైకి మాత్రం పైసా పుచ్చుకో లేదన్న డాబులు

ఆ మాటలు వింటుండగానే నా ఒంటికి చీమ మిరపకారం అంటుకున్నట్టు మండిపో సాగింది ఆ మంటతో చివాలున లేచి బయటకు వెళ్ళి అరుగు మీద కూర్చున్న అమ్మలక్కల దగ్గర నించున్నాను

వాళ్ళలో కొందరు నేను రావడం చూసి నేనొచ్చిన తీరు చూసి నివ్వెర పోయారు అనుమాయమ్మయితే ముఖం చాటేసుకుంది

నేనిక ఊరుకో దలచ లేదు

మి రసలు మనుషులేనా? ఎపటి మనుషుల మనసుల గురించి, వాళ్ళు చేసే పనుల గురించి రంగు టద్దాల్లోంచి చూసి మాట్లాడ్డమే గాని మంచిగా అర్థం చేసుకునే మనసు మీలో ఒక్కళ్ళకు కూడా లేదా? "నల్లగా ఉన్న వాళ్ళు మనుషులు కారా?" అని సాగదీసి అడిగిన మీరే ఈ రోజు తారుడ్రమ్ము అని కొత్త పేరు పెడుతున్న మి గొప్పతనానికి, రెండు నాలుకల పామును గుర్తుకి రప్పిస్తున్నారు ఆ రోజు మీరు ఇక్కడ కూర్చునే, వాళ్ళు ఇస్తానన్న కట్నం సొమ్ము చాలక కాబోలు పిల్ల నచ్చలేదు, రాంబాబుకి' అన్నందుకె పైసా కూడా తీసుకోకుండా ఆ పిల్ల మెడలో తాళి కట్టాను దాని కిప్పుడు గూఢార్థం తీసి ఎక్కువ కట్నం ముట్టడం వల్ల పెళ్లి చేసుకున్నా నంటున్నారు చీ! చీ! మిలాంటి ఆడవాళ్ళే, స్త్రీ జాతి పతనానికి ముఖ్య కారకులు అది తెలియని మహిళా సంక్షేమ సంఘాలు మగవాళ్ళను దుమ్మెత్తి పోస్తూ ఉంటారు ఇంకెప్పుడూ ఇంకెవ్వరి గురించీ ఇలా మాట్లాడకండి ఈ రోజు నా భార్య అయింది రేపు మీ అమ్మాయో, మీ చెల్లాయో అయితే ఇప్పటి నా కోపానికి కారణం క్షుణ్ణంగా మీకు అర్థమవుతుంది' అంటూ నేను రివ్వున వెనుతిరిగాను

అప్పుడే!

వాళ్ళలో ఉన్న ఓ ముసలావిడ అన్న మాటలు విన్న నేను మరలా వెనుతిరిగి వాళ్ళ వైపు చూడలేక పడిపడిగా అడుగు లేస్తూ ఇంట్లోకి వచ్చేసాను

అప్పుడామె అన్న మాటలు!

చూడు బాబూ! నీ వన్న దానిలోనూ కొంత నిజం లేకపోలేదు కాని నువ్వన్నట్టు మా మాటలు వినే ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నా నన్నావు అంటే మేము అనుకోకపోతే చేసుకోవన్న మాట సరే ఆ విషయం వదిలేయ్! మీరు మనుషు లేనా అని అడిగావు! నీకు మనుషుల భాష కాకుండా మరో జీవుల భాష కూడా అర్థమవుతుందా? అర్థమయ్యేనా ఇప్పుడు అడగడాని కొచ్చావ్? పోని అదీ వదిలేయ్! ఆడవాళ్ళ వన్నాక ఎన్నో విషయాలు మాట్లాడు కుంటూ ఉంటాము వాటినే నీవు పట్టింపుగా తీసుకుని ఆ రోజు మనసు మార్చుకుని ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నా నంటున్నావు నీకు కట్నం సొమ్ము దండిగా ముట్టిందని అన్నందుకే ఇంత సీరియస్‌గా వచ్చి ఏవేవో అన్నావు బాగానే ఉంది రేపు మీ ఆవిడ బుద్ధి మంచిది కాదని మేము ఇక్కడే అంటామనుకో వదిలేస్తావా? ఏం మాట్లాడవ్? చెప్పవేమయ్యా?

అంతే!

ఇక నా నోటి వెంట మాట రాలేదు గాని నా గుండె మీద చెయ్యి వేసుకుని మనసులో మాత్రం అనుకున్నాను ఆశ్చర్యంగా హేట్ సాఫ్ టు అమ్మలక్కలూ!... అని

మరి మీరైతే ఏమను కుంటారు? ●

## తోకముడిచిన నసీరుద్దీన్‌షా



ప్రముఖ నటుడు నసీరుద్దీన్‌షా అగ్రనటుడు అమితాబ్ బచ్చన్‌తో పోటీపడి రహస్యంగా దెబ్బతీయాలను కున్నాడు గాని ఆ ఆశలు అడియాసలై తోక ముడవాల్సి వచ్చింది. దీనికి కారణం నసీరుద్దీన్‌షా నటించిన రెండు చిత్రాలు ఫ్లాప్ అవటమేనట. ఎంతో పేరు తెస్తాయనుకున్న హీరో హీరాలాల్, మాలామల్ చిత్రాలు దెబ్బతినటంతో 'షా' క్రుంగి పోయాడు. దానితో కళాత్మక చిత్రాలు, మిర్జా గాలీబ్ లాంటి టి. వి. సీరియల్స్ స్థాయికి దిగజారి పోవాల్సి వచ్చింది. దానితో అగ్ర నటులతో పోటీపడాలన్న నిర్ణయాన్ని విరమించుకున్నట్లేనంటున్నారు చాలా మంది. అయితే క్యారెక్టర్ ఏక్షన్‌లో అతనికి ఛాన్సులు ఎప్పుడు వుంటాయి కదా!

# ఫోటో వ్యాఖ్య పోటీ 8 ఫలితాలు

బహుమతి పొందిన వ్యాఖ్య

"నా జబ్బు మాత్రం చూడండి
మీ డబ్బు మాత్రం లేదండి!"

- జోలెం సత్యనారాయణ (చినఓగిరాల)

బహుమతిగా వీరికి రెండు మాసాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక పంపిస్తాము! సం.

---

"ఏం! వానరా, ప్రేమలో పడ్డావా!
నీ గుండె 'లబ్- డబ్' కు బదులు
"లవ్- లవ్' అని కొట్టుకుంటోంది?"

బి. మధుసూదనరావు (సత్తుపల్లి)

"కోతికి వైద్యం, చూసే వాళ్లందరికి అది ఒక చోద్యం".

వై. భాస్కరరావు (అనకాపల్లి)

"నా చేష్టలు గానీ వచ్చాయేంటి డాక్టర్?
ఎంత దారుణం! పేషెంట్లు దొరక లేదని నా మీద ప్రయోగాలు చేస్తావా??"

కె. సన్నీ (అనకాపల్లి)



లక్కీ పేర్లు :

పి. జగదీష్, వరంగల్ - ఎస్. సావిత్రి, బరంపురం- ఎస్. శ్రీనివాసమూర్తి, నెల్లూరు- డి. శేఖర్, అనంతపూర్- ఎ. ధనలక్ష్మి, పలాస- మురళి, వరంగల్- శ్రీహిత, నేలకొండపల్లి - రాజ్ శ్రీనివాస్, శ్రీకాకుళం- బచ్చు ఐశ్వర్యకుమార్, రాజమండ్రి- పి. జానకిరాం. గుంటూరు.




"శ్యామా"

అన్న అరుపు విని ఠక్కున చదువుతున్న పేపర్లోంచి తలెత్తింది శ్యామల.

భుజానికి ఎయిర్‌బాగ్ తగిలించుకుని మొహం సంతోషంతో నిండిపోగా నవ్వుతూ గుమ్మానికి ఆనుకుని నిలబడ్డ కాంతి కన్పించింది.

'హాయ్? అబ్బ' యిప్పుడా రావటం' అంటూ ఒక్క ఉదుటన లేచి, దాదాపు పరిగెడుతూ వచ్చి కాంతిని చుట్టేసింది శ్యామల

శ్యామల, కాంతి బాల్య స్నేహితులు కాకపోయినా యిద్దరి స్వభావాలు కలవటంతో తక్కువ కాలంలోనే "బెస్ట్ ఫ్రెండ్స్ అనే టైటిల్ సంపాదించేసారు

ముందర శ్యామలే తేరుకుని అంది- "ఏవిటే యింత కరక్టుగా రావాలా? కొంచెం ముందర వస్తే ఏం? అసలూ నీతో మాట్లాడకూడదు " బుంగమూతి పెట్టి అంటూ కాంతి చేతుల్లోంచి బ్యాగ్ అందుకుంది శ్యామల

'సర్లే, నీ నిష్ఠూరాలన్నీ పక్కన పెట్టు, పస్టు నీ బెటర్‌హాఫ్ ఫోటో బయట పెట్టు, అవునూ యిదేంటి యిల్లంతా యిలా ఉందీ .. యింకా ఎవరూ రాలేదా నేనే ఫస్టు దిగిన గెస్టునేమో అయినా నువ్విలా నిష్ఠూరాలాడ్డం సుతారమూ బావో లేదే

ఇంతకీ ఎంత పెట్టి కొంటున్నావో లెటర్‌లో రాయలేదే' ఓహ్ అమ్మాయిగారికి సిగ్గేమో' అక్కడే ఉన్న కుర్చీలో కూలబడుతూ నవ్వుతూ అంది కాంతి

చ, నువు మరీ' వాగుడు యింకా తగ్గలేదే నీకు" నిజంగానే సిగ్గు పడిపోతూ అంది శ్యామల 'సరె కానీ అమ్మా వాళ్ళంతా బాగున్నారా?"

బావున్నారు, కానీ అమ్మ తెగ బాదపడిపోతోందె నీ కట్నం వివరాలు తెలియనందుకు తనకి తెలియక పోవటంకన్నా చుట్టుపక్కల వాళ్ళకి చెప్పలేక పోతున్నందుకు మరీ బాధపడిపోతోందె శ్యామా అన్న కాంతి మాటలకి నవ్వకుండ ఉండలేక పోయింది శ్యామల

గల, గలా విన్పడిన యిద్దరి నవ్వులకీ వంటింట్లోంచి వచ్చేశారు శ్యామల తల్లి "నువ్వా కాంతీ, అంతా బావున్నారా? అడిగిందావిడ

బ్రహ్మాండంగా ఉన్నారాంటీ, అవునూ శ్యామూ సిగ్గుపడుతోంది కానీ కట్నం ఆదీ ఎంత? కాంతి మాటలకి అడ్డువస్తూ 'కాంతీ' అంటూ సీరియస్‌గా పిలుస్తూ నువు ముందు లోపలికి పద బ్యాగ్ బుజానికి తగిలించుకుంది

'ఊ తప్పదా' నీరసంగా లేచి లోపలికి నడుస్తూ ఆంటీ కొంచెం 'టీ' పెట్టివ్వరూ' దీని సుత్తి భరించాలి డ్రమెటిక్‌గా అని దారి తీసింది కాంతి.

'అమ్మా తొందరగా పెట్టవే లేకపోతే యీలోపల యిది నన్నే తాగేసినా ఆశ్చర్య పోనక్కర్లేదు" మరింత గట్టిగా అరిచి చెప్పింది శ్యామల. సీరియస్‌గా ఉన్న కూతురి మొహం కళగా ఉండటం చూసి నవ్వుకుంటూ లోపలికి దారి తీసింది సుందరమ్మ

రూమ్‌లొకొచ్చాక "ఆఁ యిపుడు సెటిలయ్యాం కదోయ్ చెప్పు వివరాలన్నీ . '

"ఆఁ ఏవున్నాయి అతను బాంక్‌లో వర్క్ చేస్తున్నాడు . '

"అబ్బ, ఆ విషయం రాశావుగా.. యింకా నయం అతను మొగపిల్లాడూ .. అంటూ మొదలెట్టేదు వెక్కిరింతగా అంది కాంతి.

శ్యామల చిఱు కోపంగా మొహం పెట్టింది

"చెప్పు, చెప్పు అంటావ్ చెప్పనీవే. అలా అయితే అమ్మనే అడుగు ఫో "

'ఆ ఆ. లేదులే చెప్పు మధ్యలో తగల్నులే.

తర్వాత ఒక్కడే కొడుకు, ఆస్తులు వగైరాలు లేవుట తల్లి, తండ్రి ప్లస్ అబ్బాయి అంతే'

ఓహ్... చిన్న కుటుంబమే చింతలేని కుటుంబం, బహుశా వాళ్ళలో ఒక్కళ్ళు ఫామ్లీ ప్లానింగ్ డిపార్ట్‌మెంట్‌లో పన్చేస్తుండుంటారు" అన్నేసి నాలిక్కరుచుకుని

"ఓహ్ అడ్డం తగల్నన్నాను కదూ' సారీ కానీ .. కానీ " నోటిమీద వేలుంచుకుంది కాంతి

"కట్నం పాతిక'

'ఆ చీపేసే' మాట్లాడనన్న కాంతి మళ్లీ నోరు వి...ంది.

"ఏవిటీ, పాతిక వందలు కాదు, పైసలు అంతకన్నాకాదు." వేలోయ్, వేలు అండర్‌స్టాండ్" కోపంగా అంది శ్యామల

"అవున్లే తెల్సు, నీకు తెలీదేమో మొన్న మన క్లాస్‌మేట్ సుమన మ్యారేజ్ అయింది కట్నం ముప్పై మూడు, వరుడు పాలబూత్‌లో పన్చేస్తున్నాడు. పోతే శైలూ వాళ్లాయనకి కట్నం ముప్పై ప్రింటింగ్ ప్రెస్‌లో వర్క్ చేస్తున్నాడు. మరి.. వాళ్లతో పోలిస్తే నువ్వెంతయినా అదృష్టవంతురాలివే కదా"

మౌనంగా ఊరుకుంది శ్యామల ఆమె మొహంలో విచార రేఖలు

"ఏయ్ మూడ్స్ ఆఫ్ చెయ్. యిటుచూడు... నీకు తెల్సా అదృష్టవంతుడికి యాక్సిడెంటయితే అంబులెన్స్ కిందే పడ్డాట్ట"

"చాల్లే యాక్సిడెంట్ అవటమే అదృష్టం అంటావ్ నువ్వు" నవ్వుతూ అంటూన్నా కూడా, శ్యామల కళ్లల్లో లీలగా నీళ్లు అది కాంతి దృష్టిని దాటిపోలేదు.

"ఏయ్ శ్యామా ఏంటే యిది నాకు తెల్సు నీ బాధ. కానీ ఏం చేస్తాం చెప్పు. అంతా మన చేతుల్లో లేదుకదా '

"ప్చ్... అది కాదు కాంతీ నీకు తెల్సుగా మాది మధ్యతరగతి సంసారం నా తర్వాత యిద్దరు తమ్ముళ్లూ, చెల్లెలూ ఉన్నారు అందర్నీ నిలబెట్టాల్సిన నాన్నగారు యిపుడే యిలా వంగిపోతే ఈ పందిరేం కావాలి? చెప్పు "

"సరే, కట్నం ఒక్కటేనా అంటె అదీ కాదు, పాతిక ప్లస్ నాకేదో నగలలిస్టు ప్లస్ అలకపాన్పు, లాంఛనాలు యిలా ఏవేవో నాకు భయంగా ఉందే కాంతీ..."

"ఛ, ఛ అలా అనకు యింకో రెండ్రోజుల్లో పెళ్లి చేసుకోబోతున్నావ్. చూడూ. చాలమందికన్నా నయం కదా అలా ఫీలవకు " సర్ది చెప్తోంది కాంతి

"అయినా మనకీ కష్టాలెన్నాళ్లే, కాలేజీ రోజుల్లో ఎన్నెన్నో అనుకుంటాం, తీరా సమయానికి దానిని ఆచరించ లేకపోతాం. ఏంటీ దుర్బలత్వం మనకి. నేనూ ఓ పోస్టు గ్రాడ్యుఏట్‌ని అవసరమైతే ఉద్యోగం చెయ్యగలిగే కెపాసిటీ ఉంది

అయినా ఏవిటీ దుస్థితి?

పెద్దవాళ్ల ప్రాధేయతలకో, లోకాచారానికో లొంగిపోవాల్సొస్తోందికదే " తన బాధని వెళ్ళ గక్కింది శ్యామల

వాతావరణం తేలిక పర్చటానికి లేని నవ్వు తెచ్చుకుంటూ-

"నువు సాధించాలనుకున్నది నీకు పుట్టబోయే పుత్రరత్నంతో సాధించవోయ్ " అంది కాంతి

శ్యామల మౌనంగా ఊరుకుంది ఇద్దరి మధ్య కొంతసేపు నిశ్శబ్దం ఆవరించింది. ఇద్దరి అంతరంగాల్లోనూ ఓ విధమైన నిర్లిప్తత

తర్వాత ఒక్కొక్కరే బంధువులు రావటం, యింట్లో సందడితో బాధని మరిచి మనుషుల్లో పడ్డారు

రెండ్రోజులూ రెండు నిమిషాల్లా గడిచిపోయాయి.

ఆ రోజే పెళ్లి వియ్యాల వారు తరలి వచ్చారు అందరూ విడిది ఏర్పాట్లలో మునిగి వున్నారు

పెళ్లికూతురి అలంకరణలో మనోహరంగా ఉంది శ్యామల

పెళ్లికుమారుడి తరఫువారు వచ్చి, మధ్య, మధ్యలో శ్యామల్ని పరికించి చూసి వెళ్తున్నారు

అందరికీ టిఫిన్స్ పట్టుకొచ్చారు

హఠాత్తుగా కల కలం. ఏవిటో అర్థం కాలేదు లోపలి వాళ్లకి. గబ, గబ బయటికి రాబోతున్న శ్యామల నాపుతూ-

"నువ్వుండు శ్యామూ, నేన్చూసొస్తా" అంటూ బయటికి వచ్చింది కాంతి. అక్కడ శ్యామల తండ్రి మొగపెళ్లి వారితో ఏదో బ్రతిమలాడుతున్న ధోరణిలో చెప్తున్నాడు. సందడిలో అది కాంతి చెవుల దాక చేరటంలేదు కానీ వాళ్లేదో గొడవ పడుతున్నట్టుగా మాత్రం అర్థం అవుతోంది.

దగ్గరగా వెళ్లిన కాంతి గొడవకి కారణం విని ఆశ్చర్యపోయింది తాను కూడ వాళ్లకి సర్ది చెప్పటానికి ప్రయత్నించింది కానీ ఆ సోకాల్డు 'మగ' పెళ్లివారు దేనికీ ఒప్పలేదు

వీరి బ్రతిమలాటలు వాళ్ళకి ఆటలాగ అన్పిస్తోంది

ఫ్రీగా సినిమా చూస్తున్నట్టుగా వీలయిపోతూ చూస్తున్నారు దయతో విచ్చేసిన బంధుమిత్రులు

మనిషి విలువ అతను సంపాదించే వాటిలో లేదుట సృష్టించే వాటిలో ఉంటుందిట

మరి ఆ 'మగ' పెళ్ళి పెద్ద అదే, మావగారు సృష్టిస్తున్న ఆ సీన్‌ని బట్టి ఆయన విలువ అర్థం అయిపోతోంది కదా!

'శుభాకర్' అదే శ్యామ భర్త ఉరఫ్ పెళ్ళి కొడుకు వైపు చూసింది కాంతి అతను ఈ గొడవతో ఎటువంటి సంబంధం లేనట్టుగా బుద్ధిగా బుద్ధుడికి ప్రతి రూపం లాగ కూర్చొనున్నాడు

మెల్లగ ఆయన దగ్గరకి నడిచి అతి మెల్లగ గొడవ విన్పించింది కాంతి

"చూడండీ - యిపుడు నేనేమయినా సమర్థించాననుకోండి యింక వీళ్ళ సూటీ, పోటీ మాటలకి తట్టుకోవటానికి నేను మిగల్ను. పెళ్ళయ్యాక పెళ్ళాం బెల్లం, తల్లి అల్లం అన్నారు కానీ మావాడికి పెళ్ళి కాక ముందరే పెళ్ళాం బెల్లం అయిపోయింది, అనీ, ఆ చెప్పటం మన్ని నోర్మూయమనే కదా, యింక దేనికీ మాట్లాడకండి అనీ, పరమ దాస ఆంజనేయులు అనీ, చెంచా అనీ యిలా నానా రకాలుగా అనేస్తారు యివన్నీ ప్రత్యక్షంగా అనుభవించిన మా కజిన్ బ్రదర్‌ని చూసినపుడే నిశ్చయించుకున్నా యిలా ఉండాలని దయచేసి అపార్థం చేసుకోవద్దండీ " అన్న అతని మాటలకి 'ఫర్వాలేదు , బుద్ధుడు, గయుడు కాదు అని అతనికిచ్చిన టైటిల్స్ వాపస్ తీసుకుంది కాంతి అయినా అతనిలోని పిరికి తనానికి మనసులోనే చిరాకు పడింది

అప్పటికి శ్యామల తండ్రి వాళ్ళకోరిక తీరుస్తానని మాటిచ్చాడు కాబోలు, అందరూ శాంతించారు

తిరిగివచ్చిన కాంతిని శ్యామల ఆత్రంగా అడిగింది ఏవిటి? ఏవంటున్నారు వాళ్ళు' అని

'చెప్పాలంటే నాకే నవ్వొస్తోంది వాళ్ళకు కాఫీ టిఫిన్స్ వద్దట"

'అయితే .?

'అయితే ఏముంది వాళ్ళకి యిడ్లీ వడ కావాలిట

# సహస్రాధిక చిత్రనటి మనోరమాజిందాబాద్!

వెయ్యి చిత్రాలలో నటించి ఎనలేని మన విజయాన్ని సాధించిన మనోరమ మన తెలుగు సినిమారంగంలో కూడ నటించారు ఏ పాత్రనైనా తన సహజ నటనతో జనాన్ని ఆకట్టుకుని సహస్ర హాస్య చిత్రాలను పూర్తి చేసుకొన్న నటి మనోరమ తమిళంలో కొత్తగా వెలువడిన పాట్టి సొల్లై తట్టాదే సినిమాలో తను ముఖ్య పాత్ర ధరించింది. అది 200 రోజులు బాక్స్ ఆఫీసు హిట్ అయింది వెనుకబడిన తమిళ చిత్రాలకు ఈ చిత్రం ఒక టానిక్ అయింది'

ప్రస్తుతం మనోరమ తమిళ టి. వి చిత్రాలలో కూడా ప్రవేశించారు ఇంత గొప్పగా పేరు తెచ్చుకున్న మనోరమకు నచ్చిన హీరో ఎవరంటే "నాయకుడు" కమలహాసన్ ఈమె కొద్ది రోజుల క్రితం విదేశీ యాత్ర చేశారు అదే ఆమె జీవితంలో మరపురాని పండగ అని అనుకుంటారు మనోరమ రాజకీయాలలో ప్రవేశం ఆమెకు యిష్టం లేదు

— శాంతి



మహా కరువున పడ్డట్టు ముందరే చెప్తే పోయేదిగా మాకు ఫలానా టిఫినే కావాలీ ఫలానా బ్రాండ్ కాఫీనే కావాలి అని మళ్ళా తర్వాత

అంటూ యింకా ఏదో చెప్పబోతున్న కాంతి నాపుతూ– అయితే యిపుడు వండిన ఉప్మా పూరీ ఏం చెయ్యాల్ట? అడిగింది–

"ఏం చెయ్యాలేంటే, తలకి పట్టించుకుని తలంటి పోసుకో వాళ్ళకేం పట్టింది ఆ విషయం" కోపంతో అక్కసుగ అందికాంతి

శ్యామల మౌనంగా ఊరుకుంది

మెల్లగ కాంతే అంది – అంకుల్ హోటల్‌కి ఆర్డరిచ్చారు యింకో పావుగంటలో టిఫిన్స్ రావచ్చు' అని

అప్పటి దాక ఉత్సాహంగా ఉన్న శ్యామల, కాంతీలు కొంచెం నిరాశచెందారు అని చెప్పక తప్పదు

శ్యామల చేత గౌరీ పూజ మొదలు పెట్టించాడు పురోహితుడు అప్పటిదాక జరిగినవి మర్చిపోయి భక్తితో, పూజ చేస్తోంది శ్యామల

స్నేహితులు ఒక్కక్కళ్లే వస్తున్నారు పరాచికాలాడుతున్నారు రవ్వంత సిగ్గుతో చిరుకోపంతో చూస్తోంది వారిని

అపుడే వికసించి సౌరభాలు విరజిమ్ముతున్న పద్మం మీద స్వచ్ఛమైన వాన చినుకులు పడుతుంటి అది చలిస్తున్న రీతిగా, అపుడపుడు చిరు కోపంగా, చిరుదరహాసంతో మోము ఎఱ్ఱని రంగు లోకి తిరుగుతూంటే చలిస్తూ వారి వైపు చూస్తోంది శ్యామల

అసలు సిసలయిన ఆడపడచులా

ఎంతో ప్లజంట్‌గా ఉన్న వాతావరణంలో హఠాత్తుగా వో గొంతు పెద్దగా విన్పించింది

రసవత్తరమైన కళాత్మకమైన సన్నివేశాన్ని రసహృదయులైన ప్రేక్షకులు హృదయంతో చూస్తుంటే మధ్యలో అప్పలమ్మ అరిచిన అరుపులా ఉందది

ఉలిక్కిపడ్డారందరూ బిత్తర పోయారు భీతహరిణిలా చూసింది శ్యామల

"మా వాళ్ళకిచ్చిన వాయనాల్లో నల్లగాజులు పెట్టారే? మీరు పెట్టాల్సింది ఎఱ్ఱవి"

ఆ అనడంలో అమ్మయ్య ఎలాగోలా ఓ తప్పు పట్టేశా అన్నట్టుగా ఉంది

"అయ్యో, మాకు తెలీవండీ మీరు ఎఱ్ఱవి పెడతారని అయితే యిపుడే తెప్పిస్తా ఉండండి' శ్యామల తల్లి కంఠంలో హడావుడి అభ్యర్థన

"అఁహ ఏమీ అక్కర్లా యిపుడు తెచ్చినా ఒకటి తేకపోయినా ఒక్కటి" విసురుగా అందావిడ

'అయ్యో మీరలా అంటే ఎలాగండీ వాయనాల్లో గాజులు తీస్కోపోతే మాకు మనసు బావుండదు

"మీ మనసు గురించి చూస్తే మాకు బావుండదు'

ఇలా ఆ డైలాగులకి ఓ అంతం లేకుండ సాగుతూనే ఉంది.

ఇంతలో గబ, గబ ఒకావిడ లేచి అందరి దగ్గర గాజులు కలక్టు చేసి తెచ్చి అక్కడ పెట్టేసింది.

శ్యామలకు దిద్దిన కాటుక కన్నీరుతో కల్సి తెల్లని చెంపల్ని నల్లగా చేసేసింది అప్పటి దాక సిగ్గుతో చలించిన నయన ద్వయం నీటి బరువుకు కిందకి వాలింది

చాల సేపు సర్ది చెప్పాక కొత్తగా తెచ్చిన గాజులు స్వీకరించి వదిలారు వాళ్ళు

ముహూర్తం దగ్గర పడింది

ముత్తైదువలు తలంబ్రాల పళ్ళాలు, దీపాలు చెరో పక్కా పట్టుకుని వస్తూండగా చేతిలో కొబ్బరికాయతో పందిరి లోకి అడుగు పెట్టింది శ్యామల

మద్యలోనే ఒకావిడ నుంచుని మహ సీరియస్‌గా అందుకుంది – ఏవిటీ పసుపు తక్కువయినట్టుందే తలంబ్రాల్లో అంటూ

మళ్ళా సర్ప్రైజ్ విజిట్ లాగ కాబోయే అత్తగారు వచ్చి పరీక్షించితే గానీ కదల్లేదు అవి దాంతో పాటు పెళ్ళికుమార్తె కూడ

ఇలా అన్నిటికీ తప్పులు పట్టడం తప్పని పంచటం లేదు ఆలస్యం చేయటం అమానుషం అని



అసలే అన్పించటం లేదు. 'బిడియం' అనే పదం అసలు వాళ్ళ నిఘంటువులో నే ఉన్నట్టు లేదు.

"మాంగల్యం తంతునానేన' బ్రాహ్మణుడు పెద్దగా చదువుతున్న మంత్రాల మధ్య. సంబరంగవాయిస్తున్న భజంత్రీల మధ్య మాంగల్య ధారణ జరిగిపోయింది.

అందరి మొహాల్లో ఓ విధమైన రిలీఫ్.

"యిదేవిటీ విస్తళ్ళు వేసి యింత సేపయినా ఒక్కళ్ళూ రారేం. యిదిగో ఏవిటీ ఆలస్యం. నువ్వు సక్రమంగా పిల్చేవా' గాభరాగా ప్రశ్నించాడు భార్యని పెళ్ళి కూతురి తండ్రి.

అయ్యో బొట్టు పెట్టి పేరు. పేరున పిలిచానండీ ఏవిటీ కనుక్కుంటాం పదండి. గాభరాగ కుంకం భరిణ అందుకుంటూ కదిలారు విడిది వైపు వారు

ఎంతో కల. కల లాడుతూ ఉండాల్సిన పెళ్ళివారు మొహాలు గంటు పెట్టుకుని ఓ మూల కూర్చున్నారు

అప్పటి దాక బొమ్మలతో ఆడుకుని ఎందుకో కోపం వచ్చిన పసిపాప బొమ్మల్ని నలుమూలలా విసిరేసినట్టుగా పడున్నారు 'మగ' పెళ్ళివారు

కారణం ఏవిటి? ఏవిటి?

చాలాసేపు బ్రతిమలాడాక తెలియ చేసారు

మీరు మంగళ సూత్రాలను ముహూర్తానికి తరువాత కొబ్బరికాయ మీదుంచి తాకించాలి

కొబ్బరికాయ మీదయితే ఉంచారు కానీ ముహూర్తానికి ముందరె ముత్తైదువలకి తాకించేసారు

మాకున్నది ఒక్కతే' అన్ని ముచ్చట్లు వాడితో నే' అది విని అందరూ స్టన్ అయిపోయారు

పిడుగు పడితే కొన్ని మైళ్ళ దూరంలో ఉండే నీరు కూడ హరించి పోతుందిట.

అటువంటి పిడుగులు ఓ పది పడ్డట్టు అక్కడున్న వారి రక్తం కూడ యింకి పోవటం మొదలెట్టింది మొహాలన్నీ పాలిపోయాయి

జరుగుతున్న దాన్ని ఆపి ఏం చెయ్యాలన్నా చెయ్యొచ్చు జరగబోయేదాన్ని సర్దుకోవ. మ్ము సవరించచ్చు

కానీ భూత కాలంలో పనిని యిపుడు సరిదిద్దుకోవటం జరిగే పనేనా'

ఇదే విషయం రెండు గంటల ముందర చెప్పి ఉంటే'

పక్కనే ఉన్నారే '

వాళ్ళూ ఆ సూత్రాలను తాకిన వారేనే'

మరి యిప్పుడెందుకు తెల్సినట్టు లేపం'

యిపుడెందుకు ఈ అర్ధంలేని కోపం'

ఇది ఎక్కడయినా జరిగే పనేనా'

వారి వంక తేరి పార చూసింది కాంతి కళ్ళు ఎఱ్ఱబారాయి పిడికిళ్ళు బిగుసుకున్నాయి విసురుగా ఏదో అనబోయిన కాంతి చెయ్యి పట్టుకుని ఆపింది శ్యామల తల్లి

చిరాగ్గా అక్కడ్నుంచి కదిలింది కాంతి

అటు మొగ పెళ్ళి వారి భోజనాలు కాకుండ ఎవరూ విస్తళ్ళ ముందర కూర్చోవటం లేదు

యిక్కడ వీళ్ళు లేవటం లేదు.

ఆశ్చర్యం'

మొగ పెళ్ళి వారి మొహాలలో జరిగిపోయిన పని పట్ల అసంతృప్తితో పాటు ఓ విధమైన ఫీలింగ్'

బాగ పరీక్షించి చూస్తే తెలుస్తుంది

అది అది మరేం కాదు తృప్తి

మగ పెళ్ళి వారిగ జులుం బాగానే చెలాయించాం అన్ని పెత్తనాలు బాగ జరిపాం.

సాధ్యమయినంత వరకు పీడించుకు తిన్నాం

నానా అగ చాట్లు పెట్టాం ఆ పెట్టేదేదో బాగా ఆచారాలతో నే ముడి పెట్టాంలే! వీళ్ళ దుంప తెంచొ దిలి పెట్టాం!

అమ్మయ్య. యిప్పుడేం చేస్తారో చూడాలి అన్నట్టుగా!

ప్రపంచ బాక్సింగ్ పోటీల్లో ఒకళ్ళనొకళ్ళు చచ్చేట్టు బాదుకుంటూంటే. ఎవరు మట్టి కరుస్తారా అని అత్యంత క్యూరియాసిటీతో ఊపిరి బిగపట్టి చూసే ప్రేక్షక మహాశయుల్లాగా. గోతి కింద నక్కల్లాగ చూస్తున్నారు

అదే వాళ్ళ కళ్ళల్లో కన్పడుతున్న తృప్తితో కూడుకున్న క్యూరియాసిటీ

శాడిజం'

దాదాపు రెండ గంటలు బ్రతిమలాడించుకుని భోజనానికి తరలి వచ్చారు 'మగ' పెళ్ళి వారు

విందు అయిపోయింది

అప్పగింతలయ్యాయి

శ్యామలని పట్టుకుని కుమిలి, కుమిలి ఏడ్చారు తలి దండ్రులు

భోరున ఏడ్చారు చెల్లెళ్ళు, తమ్ముళ్ళు

వాళ్ళ వదనాలలో నిస్సహాయత, భయం

గదిలో బట్టలు సర్దుకుంటున్న శ్యామల్ని ఏడుస్తూ చుట్టేసింది కాంతి

"ఏవిటీ? ఎందు కేడుస్తున్నావ్? ఏవిటీ ?"

శ్యామల కంఠంలో ఓ విధమైన మార్పు' ఆశ్చర్యంగా శ్యామల మొహంలోకి చూసింది కాంతి

శ్యామల శ్యామల శ్యామలలాగ లేదు'

ఆ మృదుత్వం లేదు'

కంఠంలో ఆ మార్దవం లేదు'

మనిషిలో దయ కన్పడ్డం లేదు'

మమత లేదు. అనురాగం లేదు. ఆనందం లేదు'

ఆశ్చర్యపోయింది కాంతి

కొన్ని గంటల్లోనే యిదేం మార్పు' యిది ఎలా సంభవం? శ్యామల రాయయిపోయిందా'

ఏవిటే అలా చూస్తున్నావ్. నాలో ఏం వింత ఉంది

ఓ హో, నేను ఏడవటం లేదు అనా ఎందుకేడవాలే ఏడుపెందుకు? యిక నించి చూడు ఏం చేస్తానో నా ప్రతాపం ఎలా చూపిస్తానో' ఎలా ఏడిపించుకు తింటానో వాళ్ళని'

వాళ్ళకెలాగు ఒక్కడే కొడుకు ఆ ముసలాయన రిటైరయిపోయాడు యింక నా దగ్గరకి రాక ఎక్కడికి పోతారే వాళ్ళు' అంతే కదా నా దగ్గరకే కదా రానీ రానీ చూపిస్తా ఈ శ్యామల అంటే ఏవిటో ఆ హ హ

శ్యామల అలా సున్నితత్వం ఏకోశానా ఎరుగని యడారిలో చెట్టు లాగా అంటూనే ఉంది

నెత్తి మీద పిడుగు పడ్డట్టు తెల్లబోయి, నీరుగారి పోతూ, వణికి పోతూ నిల్చుండి పోయారు ఆ మాట విని అప్పుడే లోపలికి రాబోతున్న శ్యామల అత్తవారు

అంతే కదా మరి'

మానవతా రక్షతి రక్షితః

అందుకే

ఆగండి మీరూ ఆలోచించండి ●

## పొగ త్రాగితే తప్పు!

క్యాన్సర్ వల్ల సంభవించే మరణాలను తగ్గించాలంటే ధూమపానం దురలవాటును పూర్తిగా మాన్పించడానికి, అత్యాధునిక పరీక్షా ప్రక్రియలను మరింతగా అందుబాటులోకి తీసుకు రావాలి.

అయిదు ప్రధాన అమెరికన్ నగరాలలో జరిపిన ప్రజాభిప్రాయ సేకరణ ఆధారంగా అమెరికా జాతీయ క్యాన్సర్ సలహా సంఘం ఈ నివేదికను విడుదల చేసింది. అమెరికా అధ్యక్షుడు నియమించే ఈ సంఘం జాతీయ క్యాన్సర్ సంస్థకు సలహా లిస్తుంది.

క్యాన్సర్ వ్యాధివల్ల అమెరికాలో 2000 సంవత్సరంలో 576,000 మరణాలు సంభవిస్తాయని అంచనా వేసినట్టు జాతీయ క్యాన్సర్ సంస్థ డైరెక్టర్ డాక్టర్ శామ్యూల్ బ్రాడర్ తెలిపారు ప్రస్తుతం క్యాన్సర్ వ్యాధి వల్ల సంభవించే మరణాలలో సుమారు మూడవ వంతు ధూమపానం వల్ల ఏర్పడుతున్నట్టు ఆయన చెప్పారు

"ఇదివరలో మహిళలలో మరణాలకు 'బ్రెస్ట్ క్యాన్సర్' వ్యాధి ప్రధాన కారణంగా వుండగా ఇప్పుడు ఊపిరితిత్తుల క్యాన్సర్ దానిని అధిగమించడం ఒక విచారకరమైన వాస్తవ మని డాక్టర్ బ్రాడర్ పేర్కొన్నారు పురుషులలో క్యాన్సర్ సంబంధిత మరణాలలో 35 శాతానికి ఊపిరితిత్తుల క్యాన్సర్ బాధ్యత వహిస్తున్నదని కూడా ఆయన వివరించారు అందుకే పొగాకుని 'డ్రగ్'గా ఒక మాదక విషద్రవ్యంగా పరిగణించాలంటున్నారు ●

సీరియల్

# సూపర్ గర్ల్

వింజమూరి విజయ శాంభవి

(గత సంచిక తరువాయి)

ఎప్పుడైతే తలుపు తెరుచుకుందో 'చురుగ్గా కదిలింది కార్తి వెళ్ళి పడింది ఓ మూల అక్కడ కనబడింది ఆమెకి కావలసిన మిరప్పొడి సీసా. సూట్‌కేస్‌ని క్రింద పడేసి రెండు గుప్పెళ్ళ నిండా తీసుకుందా కారప్పొడిని

ఒక్కసారిగా వెలుగులో నుండి లోపలికి వచ్చిన సంజయ్‌కి వెంటనే కార్తి గాని ఆమె చేసే పని గానీ కనబడలేదు

'ఎక్కడది? తన అనుచరుడితో అంటూ రెండు అడుగులు ముందుకి వేశాడు రెండు చేతులూ చాపి

అంతే కసిగా విసురుగా విసిరింది ఆమె తన గుప్పెళ్ళలోని కారప్పొడిని ఆ ఇద్దరి కళ్ళల్లోకి

ఒక్క క్షణం పాటు తమ కళ్ళల్లో పడిన ఆ పదార్థం ఏమిటో ఆ ఇద్దరికీ అర్థం గాలేదు బాధ తెలిసిన మరుక్షణం అర్థమై పోయింది ఇద్దరికీ కళ్ళల్లో గాజు పెంకుల పొడి కూరినట్టుగా కెవ్వుమన్నారు ఇద్దరూ చిందులు త్రొక్కసాగారు దయ్యం పట్టినట్టు

అప్పుడు మూల నక్కిన కార్తి ఇవతలికి వచ్చింది సూట్‌కేస్ తీసుకుని అంతే ఆ సూట్‌కేస్ నెత్తి కసిగా అక్కసుగా ఎడాపెడా బాదేసింది ఆ ఇద్దర్నీ ఓ రెండు నిముషాల పాటు అసలే కళ్ళు బయంకరమైన బాధతో మండుతున్నాయి పులి మీద పుట్రలా పడుతున్న ఈ దెబ్బలక ఓర్చుకోలేక పొయ్యారు సంజయ్ అతని మిత్రుడూ క్రింద చతికిలబడి వెర్రిగా అరవడం ప్రారంబించారు ఆ ఇద్దరూ

ఆ సమయం చాలు కార్తికి బయటికి పరుగెత్తి తలుపు గడియ పెట్టి ఇంత క్రితం తను వచ్చిన దారి వెంబడి కాకుండా ఆ ఇంటి వెనక నుండి ప్రారంభమయిన ఓ ఇరుకు సందులోకి పరుగెత్తింది వేగంగా

ఆమె ఎప్పుడైతే ఆ ఇంటిని వదిలిందో ఆ మరుక్షణం వచ్చి పడ్డాడు కర్రలూ కటార్లూ పట్టుకున్న దాదాపు పది మంది మనుషులతో వినాయకం అతడి ప్రక్కన పిడుగు వున్నాడు

"లోపలుంది లోపలి కెళ్ళింది వెళ్ళి తలుపేసుకుంది చెప్పాడు పిడుగు

తలుపు లోపల గడియ పెట్టబడిందా, లేక బయట పెట్టబడిందా అన్న విషయాన్ని పట్టించుకోలేదు ఎవరూ! ఒక్క ఉదుటున తలుపులు విరగ్గొట్టుకుని మరీ లోపలికి ప్రవేశించిన వాళ్ళు అక్కడ కనిపించిన సంజయ్‌ని అతని మిత్రుణ్ణి చూసి రెచ్చిపొయ్యారు ఒక్క ఉదుటున దాడి చేశారు ఆ ఇద్దరి మీదకి

పులిపోయి భూతం పట్టుకున్నట్టు కనుగ్రుడ్లనే పెరికేసుకోవాలన్నంత బయంకరమైన బాధని అనుభవిస్తున్న సంజయ్ అనుకోని ఈ దాడికి తట్టుకోలేకపొయ్యాడు అదే మామూలు పరిస్థితుల్లో అయితే రాక్షసుడి లాంటి అతడికి అంత మందినీ ఎదుర్కోవడం ఒక లెక్కలోని విషయం ఏమీ కాదు కానీ, ఇప్పటి పరిస్థితి వేరు రెండే రెండు నిముషాల్లో స్పృహ పోయింది, బలమైన దెబ్బలు తగలడంతో సంజయ్‌కి ప్రక్కనున్న వాడికి ఈడ్చి వూరవతల పారేయించాడు వినాయకం ఆ ఇద్దర్నీ

రమేష్ వంట వాడైన వినాయకం రమేష్ భయంకరంగా హత్య చెయ్యబడటం చూసి పూర్తిగా బెదిరిపొయ్యాడు ఆ తరువాత పోలీసులు సాక్ష్యాలంటూ స్టేట్‌మెంట్లంటూ స్టేషన్‌ల చుట్టూ కోర్టుల చుట్టూ తిప్పుతారని భయపడి ఈ హత్య విషయం బయటికి పొక్కక ముందే పారిపొయ్యి వచ్చాడు

కానీ, అతడు రమేష్‌ని హత్య చేసిన దుర్మార్గులు సాక్ష్యం మిగలకుండా తననీ హత్య చెయ్యడం కోసం వెదుక్కుంటూ వస్తారని భయపడ్డాడు అందుకే స్వగ్రామం చేరుకుని కూడా తన ఇంట్లో వుంతకుండా బంధువుల ఇంట్లో దాక్కుని పిడుగుని తన ఇంటి దగ్గర కాపలా పెట్టాడు

తరువాత పిడుగు పరుగెత్తుకుంటూ వచ్చి ఓ అందమైన అమ్మాయి తన ఇంటి తలుపు తాళం పగలగొట్టి మరీ ఇంట్లోకి ప్రవేశించిందనగానే ఆమెను శత్రువులు (రమేష్ హంతకులు) తాలూకూ మనిషిగా అనుమానించాడు వినాయకం ఆమెని బెదిరించి తరిమేయాలన్న ఉద్దేశ్యంతో తన బంధు బలగంతో తీరా అక్కడికి వచ్చాక బలిష్టులైన ఇద్దరు యువకుల్ని చూసి వాళ్ళే రమేష్‌ని హత్య చేసిన వ్యక్తులుగా దృఢపరచుకున్నాడు

అయితే వాళ్ళని గట్టిగా బెదరగొట్టేస్తే మళ్ళీ తన జోలికి రారన్న ఉద్దేశ్యంతో సంజయ్‌ని అతని మిత్రుణ్ణీ స్పృహ తప్పేలా చావు దెబ్బలు కొట్టి ఊరవతలికి ఈడ్చేసి ఇక వాళ్ళు మళ్ళీ తన జోలికి రారని తృప్తిపడ్డ వినాయకం తన మేనల్లుడి సలహాని అనుసరించి ఎందుకైనా మంచిదని ఆ వూరు వదిలేసి కొంత కాలం పాటు తల దాచుకోవడానికి ఎక్కడో దూరంగా నెల్లూర్లో వున్న తన చెల్లెలి ఇంటికి బయలుదేరాడు

* * * *

సంజయ్‌ని అతని అనుచరుడ్ని చావగొట్టి చెవులు మూయించి వినాయకం ఇంట్లో నుండి బయట పడిన కార్తి సందుగొందుల్లో నడుస్తూ వూరి చివరికి చేరుకుంది అక్కడి నుండి పొలాలు ప్రారంభమవుతాయి కార్తి అక్కడ నిలబడి ఒక్క క్షణం ఆలోచించింది

ఎలా తను ఇక్కడి నుండి బయట పడటం? ఆ దుర్మార్గులు మళ్ళీ వెంటబడే లోగా సురక్షితమైన ప్రదేశానికి చేరుకోవాలి ఒక్కసారి తన దుస్తుల వైపు చూసుకుంది కార్తి

తనని గుర్తు పట్టి వుంటారా వాళ్ళు?

ఆమెకి పోలీసు స్టేషన్ దగ్గిర తన చేతిలోని సూట్‌కేస్‌ని లాక్కుని పారిపోవడానికి ప్రయత్నించిన వ్యక్తి జ్ఞాపకానికి వచ్చాడు చప్పున అయితే శత్రువులు తన ప్రయత్నాన్ని పసిగట్టి వెంటబడ్డారన్న మాట? ఇలా ఆలోచిస్తూ పొలాల గట్ల వెంబడి చక చక నడవసాగింది కార్తి మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూస్తూ అలా దాదాపు గంట పాటు అడ్డదారిలో నడుస్తూ వచ్చి రోడ్డెక్కి తలెత్తి చూసిందామె యదాలాపంగా

అంతే! అక్కడ కనబడిన దృశ్యం చూసి సర్ప పంప్పలా ఆగిపోయింది అక్కడ

అంతకుముందు తను ప్రయాణిస్తూన్న బస్‌ని

**జరిగిన కథ – 7:** రాణికి సహాయంచేయాలని కంకణంకట్టుకున్న కార్తిని సోఫియాముఠా వెంబడిస్తుంటుంది. రమేష్ యింట్లో మరిచిపోయిన సూట్‌కేస్‌ను వంటవాడు వినాయకం తీసుకొని పరారీఅవుతాడు. కార్తి పోలీస్‌స్టేషన్‌లో సూట్‌కేస్ అప్పగిస్తానని చెప్పి బయల్దేరుతుంది. కార్తిని కిడ్నాప్‌చేసే పనిని రెడ్ సూట్‌వాలాకు అప్పగిస్తాడు సంగమేశ్వరరావు. దొరికిన అడ్రసు తీసుకొనీ వినాయకం వుండే వూరికి పయనమవుతుంది కార్తి. కార్తిని వెంబడించివచ్చిన సంజయ్ కార్తిని వినాయకం గదిలో చూస్తాడు. చైతన్యను మట్టుపెట్టను వచ్చిన ఆగంతకులు చైతన్య చేతిలో చిక్కారు.

వెంబడిస్తూ హఠాత్తుగా టైర్ బరస్ట్ కావటంతో ఆగిపోయిన శత్రువుల తాలూకు జీపు కనిపించింది. దాన్ని చూసి నిశ్చేష్టురాలైంది కార్తి. ఆమెకి ఒక్కక్షణం పాటు ఏం చెయ్యాలో తోచలేదు. ఆ జీపుని ఆనుకుని నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు ముగ్గురు వ్యక్తులు. వారి మాటలు ఆమెకి స్పష్టంగా వినిపించసాగాయి.

ఒకడు అంటున్నాడు.....

ఆ పిల్ల దగ్గరి నుండి సంజయ్‌గాడు ఆ సూట్‌కేస్ చిక్కించుకోగలడన్న నమ్మకం నీకుందా? ఆ తరువాత దాన్ని మనం ఆ బాస్టర్డ్ దగ్గర్నుండి కొట్టేయగలనూ?"

చేతిలో చావు దెబ్బలు తిన్న స్టుపిడ్ కదూ?

అప్పుడే గ్రహించింది తెలివైన కార్తి... ఈ సూట్‌కేస్‌ని చేజిక్కించుకోవడం కోసం రెండు ముఠాలు ప్రయత్నిస్తున్నాయన్న మాట?

హఠాత్తుగా ఆమెకి గుర్తు వచ్చింది... రాత్రి తన ముందే జీపులోని శత్రువులు నిర్దాక్షిణ్యంగా స్కూటర్ మీద వ్యక్తుల్ని జీపుతో గుద్దేసి హత్య చెయ్యడం. ఆ దృశ్యం గుర్తు రాగానే కార్తి గుండెలు



"డెఫినిట్లీ" అన్నాడు ఇంకొడు. జీపులోకి చూపించాడు వాడు తన చేతిని... అప్పుడే గమనించింది కార్తి జీపులో స్పృహ కోల్పోయి పడి వున్న ఓ వ్యక్తిని.

"వీడ్ని చావ చితకతన్ని పడేశాం. వీడి మాటలే నిజమైతే సంజయ్‌గాడి వెంట విక్కీగాడొక్కడే వున్నది. ఆ ఇద్దర్నీ ఎదుర్కోవటం మన ముగ్గురికీ చాలా ఈజీ...." అన్నాడు హుషారుగా.

"సంజయ్ గాడ్ని చాలా తక్కువగా అంచనా వేస్తున్నాం మనం. అంతేగాదు...ఆ పిల్ల సైతం తక్కువదేం గాదు...." మొహం ఆదుముకున్నాడు వాడు.

అప్పుడే వాడ్ని గుర్తు పట్టేసింది కార్తి. వాడు తన సూట్‌కేస్ లాక్కుపోవడానికి ప్రయత్నించి తన

ఝల్లుమన్నాయి భయంతో. వెంట వెంటనే అర్థమైపోయింది ఆమెకి జరిగినది జరుగుతున్నది ఏమిటో.

సంజయ్ ముఠా అనబడే జీపులోని వ్యక్తులూ... రాత్రి స్కూటర్ మీద పారిపోబోతూ హత్య చెయ్యబడిన వ్యక్తులూ ఇద్దరూ ఒకరికొకరు శత్రువులు. రాత్రి సూట్‌కేస్ కోసం తన వెంటబడిన వారు సంజయ్, అతని మనుషులు. తను వారికి స్లిప్ ఇచ్చి రాణి ఇంటి దగ్గరికి చేరుకునేసరికి రాణి హత్య చెయ్యబడింది. ఆ దృశ్యాన్ని చూసి తను ఆ ఇంట్లో నుండి బయటపడిన తరువాత... ఆ సందులో నుండే ఆ ఇద్దరు వ్యక్తులు పరుగెత్తుకు వచ్చి సంజయ్ బృందం చేత హత్య చెయ్యబడ్డారు. అంటే... రాణిని హత్య చేసింది వాళ్ళే అయి వుండాలి. తను రాణి ఇంట్లో అడుగు పెట్టడానికి కొద్ది నిముషాల ముందే ఆ హత్య జరిగిందనడానికి సాక్ష్యం... ఇంకా గడ్డ కట్టని రక్తం.

అంతకుముందో పావు గంట నుండి తనని వెంబడిస్తున్న సంజయ్ బృందానికి రాణిని హత్య చేసే అవకాశం లేదు. దీన్ని బట్టి ఆలోచిస్తే రాణికి ఈ రెండు ముఠాల వ్యక్తులూ శత్రువులు. ఈ ఇద్దరూ ఆమె దగ్గరున్న ఈ సూట్‌కేస్ కోసం ప్రయత్నిస్తున్నారు. ఇద్దరూ ఆమె దగ్గర్నుండి [illegible] సంబంధించిన రహస్యం రాబట్టలేకపొయ్యారు. ఆఖరి క్షణాల్లో విసిగిపొయ్యి... శత్రువులకి సైతం ఈ రహస్యం దక్కడానికి వీలు వుండకూడదన్న కసితో రాణిని చంపేశారు రెండో గ్యాంగ్‌కి చెందిన ఈ వ్యక్తులు.

కానీ, తరువాత రాణి తనకి చేసిన హెచ్చరికను గుర్తించి ఈ రహస్యాన్ని ఆమె ఎవరికో అప్పగించిందని వారు గ్రహించారు. రాత్రి వాళ్ళు తనని గుర్తించలేదో... లేక గుర్తించీ తను రాణి శవాన్ని చూసి అల్లరి చేస్తానని భయపడ్డారో... లేక తన దగ్గరున్న సూట్‌కేస్‌లో రాణి రహస్యం వుందన్న సంగతి గ్రహించలేదో, తెలీదు గాని ఆ రహస్యం తన దగ్గర వున్న విషయం ఇప్పటికి గ్రహించగలిగిన వీళ్ళు తన వెంటబడ్డారు. దానిలో భాగమే.... వినాయకం తాలూకు సూట్‌కేస్‌ని ఇంత క్రితం... ఎదురుగా కనబడే ఆ చచ్చు ముచ్చు వెధవ కొట్టుకుపోవాలని ప్రయత్నించడం.

తన దగ్గర్నుండి సంజయ్‌గాడి బృందం ఈ సూట్‌కేస్‌ని చేజిక్కించుకుంటే వాడి దగ్గర్నుండి దాన్ని తన్నుకుపోవాలని ఈ వెధవల ప్రయత్నం. తాడి దన్నే వాడు ఒకడైతే వాడి తలను తన్నే వాడు ఒకడు. ఈ వెధవలందరికీ తను ఈ వూరు ఎందుకు వచ్చిందన్న విషయం గురించి తెలుసో లేదో గాని... వారి ధ్యేయం ఈ సూట్‌కేస్‌ని చేజిక్కించుకోవడమే.

ఇలా ఆలోచిస్తున్న కార్తి... అంత గొప్ప



## కార్తీక్ పాట!

కమలహాసన్, భాగ్యరాజా, టి. రాజేందర్‌లలాగే హీరో కార్తీక్ (మురళి) కూడా స్వయంగా పాడేస్తున్నాడు. "స్వయం మర్యాదై" అనే తమిళ చిత్రంలో ఈయన గానం ఉంది.

రహస్యం ఈ సూట్‌కేస్‌లో ఏముందబ్బా?" అనుకుందే గాని... నిజంగా అందులో వున్న ఆ రహస్యాన్ని గురించి ఆమెకే తెలిసి వుంటే తక్షణం ఆ సూట్‌కేస్‌ని పెట్రోల్ పోసి తగలబెట్టి వుండేదే.

**రాణి శత్రువులు... కాదు... కాదు... ఇప్పుడు రాణి పోయింది. ఆమె ఈ బాధ్యతని తనకి అప్పగించింది.... కాబట్టి వీళ్ళు ప్రస్తుతం తనకి శత్రువులు. తన శత్రువులు ఒకళ్ళు కారు... ఇద్దరు... రెండు ముఠాలు, తన నుండి ఈ సూట్‌కేస్‌ని చేజిక్కించు కోవాలని చూస్తు న్నాయి.**

ఈ ఆలోచన... విషయం గుర్తు రావడంతో భయంతో ఝల్లుమన్నాయి. కార్తి గుండెలు రాక్షసుల్లాంటి ఈ దుర్మార్గుల బారిన పడకుండా రాణి చెప్పిన వ్యక్తికి ఈ రహస్యాన్ని అందజెయ్యగలదా తను? గంట క్రితం తను వినాయకం ఇంట్లో వున్నప్పుడు బయట తలుపు తడుతూ సంజయ్‌గాడు అన్న మాటలు గుర్తు తెచ్చుకుంది కార్తి.

"అమ్మో...." ఆమె చేయి గుండెల మీదికి వెళ్ళింది.

ఆ భయంతో పాటు అంతలోనే ఆమెకి రోషం వచ్చింది... మొండి ధైర్యం ఆమెలో ప్రవేశించింది అదే కార్తిలోని గొప్పతనం. అందరు ఆడపిల్లల్లా కాదామె. ఏ విషయానికైనా ఆమె భయపడడం



## 'కార్తి' సాహసం

మీరు కూడా యువతిగా వున్నప్పుడు - లేదా యిప్పుడు యువతిగా వుండి ఏదైనా సాహసం చేశారా? అది ఫలించిందా? అటువంటిదివుంటే మీ ప్యాస్‌పోర్టు సైజు ఫొటోతో 15, 20 లైన్లలో రాసి పంపండి! –ప్రచురణ యోగ్యమైతే వేస్తాం. –సంపాదకుడు



అంటూ జరిగితే వెంటనే దానికి మించిన మొండితనం ధైర్యం కోపం రోషం ఆమెలో చోటు చేసుకుని ఆమెని తన ధ్యేయం వైపు నడిపిస్తాయి ఇప్పుడూ అదే జరిగింది తన పట్ల ఎంతో నమ్మకంతో రాణి ఈ సహాయాన్ని అర్థించింది

ప్రాణాలు కోల్పోయే సమయంలో కూడా అదే నమ్మకంతో మరోసారి తనని హెచ్చరించింది నమ్మకద్రోహం చెయ్యకూడదు తను హత్య చెయ్యబడిన రాణి ఆత్మ అంటూ వుంటే తనని నమక్ హరాం అనుకోకూడదు ఎంతటి విషమ పరిస్థితుల్లో చిక్కుకున్నా సరే ఎన్ని కష్టాల్ని ఎదుర్కొని అయినా సరే ఈ సూట్‌కేస్‌ని రాణి చెప్పిన ఆ వ్యక్తికి అందిస్తుంది తను

ఇలా ఆలోచిస్తున్న కార్తి తను శత్రువులకి అతి సమీపంలోనే నిలబడి ఆలోచనల్లో మునిగిపోయిందన్న విషయాన్ని మర్చిపోయింది హఠాత్తుగా ఆమె తెలివి తెచ్చుకుని వెనుదిరిగింది

అమ్మో ఇంకేమయినా వుందా ఈ రాక్షసుల కళ్ళ బడితే ఆమె ఎంత వేగంగా వెనుదిరిగిందో అంత అల్లరిగా చప్పుడు చేశాయి ఆమె కాలి పట్టాలు.... ఉలిక్కి పడింది కార్తి.

ఆ చప్పుడుకి యధాలాపంగా తల తిప్పి చూశారు ఆ ముగ్గురూ. వెంటనే అరిచాడు వారి చేతిలో వాపు దెబ్బలు తిన్న కొండముచ్చు.

"అదుగో! ఆడదిదే. దాని చేతిలో ఆ రెడ్ సూట్‌కేస్‌ని చూడండి. నేను చెప్పలేదా.... ఇది సాధారణమైన ఆడపిల్ల కాదు. సంజయ్‌గాడి కళ్ళల్లో కారం గొట్టి తప్పించుకుని పారిపోయి వస్తోంది. పట్టుకోండి. కాళ్ళు విరిచి. గుడ్లు పీకి ఆ సూట్‌కేస్‌ని లాక్కోండి!....." అంటూ.

వెంటనే చలనం వచ్చింది మిగతా ఇద్దరిలో. ఒక్కసారిగా ముగ్గురూ కార్తి మీదకి లంఘించారు.

తను వారి చేతికి చిక్కిపోవటం ఖాయమని అర్థమైపోయింది పారిపోతున్న కార్తికి. మరుక్షణం నీరసం ఆవహించింది ఆమెను. ఇంతలోనే హఠాత్తుగా ఆమె కాలి జోడు మడత పడింది. తూలి ముందుకి పడిపోయింది కార్తి. ఇక తనని ఆ దుర్మార్గుల బారి నుండి ఆ బ్రహ్మదేవుడు కూడా రక్షించలేడని అర్థమైపోయిందామెకి. వెంటనే ఆమె లేచి పారిపొయ్యే ప్రయత్నం చెయ్యకుండా గట్టిగా కళ్ళు మూసుకుంది.

* * * *

"నా పేరు వినోద్..." అని చెప్పాడు ఒకడు.

"నా పేరుదా రామన్..." అన్నాడింకొకడు అరవ యాసతో

అతడు తమిళియన్ అని గ్రహించాడు చైతన్య.

"ఎవరు మీరు? ఎవరు పంపారు నన్ను హత్య చెయ్యమని మిమ్మల్ని..." అడిగాడు.

"మా బాస్ దా పంపినాడప్పా...." అని చెప్పాడు రామన్.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయిత లందరికీ సూచనలు

★ రంగు ఛాయాచిత్రాలు, వ్యాసాలు, ఫీచర్‌లు పంపే వారు కాబినెట్ సైజుకి తక్కువ సైజు బొమ్మలు పంపకూడదు. ఫోటో వెనుక దాని వివరం— వారి పేరు కూడా వ్రాయడం మరిచిపోకూడదు.

★ నలుపు తెలుపు ఫోటోలలో 'వ్యాఖ్య'కు పనికొచ్చేవి వుంటే — వాటిని వ్యాఖ్య పోటీకి వాడుకుంటాం— తగినన్ని తపాలా బిళ్లలంటించిన స్వంత చిరునామా గల కవరు జతచేయవలెనన్నది షరా మామూలే!



★ కథలు కార్టూన్‌లు పేరుకు పోయి వున్నందు వల్ల— పరిశీలనలో కొంత జాగు సహజం.

★ నవలలు పంపించేవారు— ఆధునిక యితివృత్తం, ఉద్వేగ ఉత్కంఠ భరితమైన శైలి ఉండేలా చూడాలి'— పరిశీలనకు 3, 4 నెలలు పట్టవచ్చును.

★ కాంపోజిషన్‌లు కాని వ్యాసాలు, ఫీచర్‌లు, బొమ్మల కథలు, కొత్తరకం రచనలు వీటికి ప్రథమ తాంబూలం అయితే స్వంత చిరునామా గల స్టాంపులున్న కవరు షరా మర్చిపోతే అవి త్రిప్పి పంపలేము.

★ మారుతున్న ముస్తాబు వస్తున్న మార్పులు గమనించి మీరంతా వీక్లీకి సహకరించాలని— పాఠకుల అభిరుచిని ప్రమాణాన్ని తులనాత్మకంగా చూసుకొని రచయితలు మాతో సహకరిస్తారని ఆశ—

—సంపాదకుడు.

## బచ్చన్ ప్రతీకారం

ఫిల్మోత్సవం ప్రారంభం రోజున ఢిల్లీలోనే వున్న అమితాబ్ బచ్చన్‌కు ఆహ్వానం అందలేదు. దీనికి కారణం ఆయన గ్లామర్ దెబ్బ తినడమేనట.

'సారీ! సీట్లేవీ ఖాళీ లేవు' అని ఫిల్మోత్సవ్ డైరెక్టరేట్ నుంచి సమాధానం వచ్చిందట. పాపం చేసేది లేక టి. వి. లోనే ఆ కార్యక్రమాన్ని తిలకించారట.

ఆహ్వానం రాలేదన్న కోపంతో కాబోలు తాను నటించిన గంగా- జమున- సరస్వతి చిత్రాన్ని ప్రదర్శించే థియేటర్ను ఫిల్మోత్సవ్ డైరెక్టరేట్ అద్దెకు తీసుకోకుండా చూసి పరోక్షంగా వారిపై కక్ష తీర్చుకున్నారు.

ఈ ఉత్సవంలో ప్రధాన చిత్రాన్ని ప్రదర్శించేందుకు షీలా థియేటర్‌ను అద్దెకివ్వమని ఆ థియేటర్ యజమానిని సమాచార శాఖ కోరిందట. ఇచ్చేందుకు సిద్ధపడిన ఆ థియేటర్ యజమానిని 'భవిష్యత్తులో తన సినిమా లేవీ ప్రదర్శనకు యిచ్చేది లేదని' అమితాబ్ బచ్చన్ భయపెట్టారట.

అంతే... ఆ యజమాని ఆదరాబాదరా ఫిల్మోత్సవ్ డైరెక్టరేట్‌ను కలిసి ఈ విషయం విన్నవించగా "సరే ఆ ఫ్లాప్ సినిమానే (గంగ- జమున- సరస్వతి) ప్రదర్శించుకోండ"ని వారు సెల విచ్చారట!

## సూపర్ గర్ల్

'ఎవరు మీ బాస్?' ఎందుకతడికి నా మీద అంత కక్ష? ఎక్కడ వుంటాడు అతడు?"

"మా బాస్ పేరు కబీర్ ." అన్నాడు వినోద్.

ఆ పేరు వినగానే చైతన్య కనుబొమ్మలు ముడివడ్డాయి. ఈ పేరు ఎక్కడో విన్నట్టు లేదే?

'ఎక్కడ వుంటాడతను?

సమాధానం చెప్పడానికి ఓ క్షణం తటపటాయించారు వాళ్ళు

"ప్రొసీడ్" హెచ్చరించాడు చైతన్య

సమాధానం చెప్పబోయారు వాళ్ళునోరు తెరిచి . ఇంతలో నాయర్ వచ్చి చెప్పాడు

"సార్ మీ కోసం ఎవరో కుర్రాడు వచ్చాడు. ఈ చీటీ మీకు ఇవ్వమని చెప్పి వెళ్ళిపొయ్యాడు. చాలా అర్జంటట....." అంటూ ఇచ్చాడు.

చైతన్య దాన్ని అందుకుని చదివాడు. నాలుగు వాక్యాలు వ్రాసి వున్నాయి అందులో....

**"మీరు అభిమానించే కార్తి భయంకర మైన ఓ ప్రమాదంలో చిక్కుకో బోతుంది. దాన్ని గురించిన వివరాలు తెలుసు కోవాలంటే నెహ్రూ జూలాజికల్ పార్కులోకి రండి వెంటనే. ఆలస్యం చేస్తే నేను మళ్ళీ మీకు దొరకను...**

### ఇట్లు "మీ కార్తి శ్రేయోభిలాషి"

చప్పున తలెత్తుతూ అడిగాడు చైతన్య ఎవరి స్లిప్ తెచ్చింది?" "ఎవరో పదేళ్ళ కుర్రాడు • ఇచ్చి పరుగెత్తుకెళ్ళాడు..

చైతన్య ఆలోచనలో పడ్డాడు.

నిజమేనా ఈ విషయం? ఈ చీటీ పంపిన వ్యక్తికి ఈ విషయం ఎలా తెలుసు? ఎలాంటి ప్రమాదంలో ఇరుక్కోబోతూంది కార్తి?

ఒక్కక్షణం అనుమానం వచ్చింది చైతన్యకి... ఇది తన శత్రువుల ప్లాన్ కాదు గదా? అని. కానీ, అంతలోనే అతను వెంటనే పార్కుకి బయలుదేరదలచుకున్నాడు. అడ్వంచర్స్ అంటె ఇష్టపడే కార్తి ఏదో అడ్వంచర్ చేసి ఏదో ప్రమాదం నెత్తికి తెచ్చుకోలేదు గదా? అన్న అనుమానం అతనిలో ప్రవేశించింది

ఈ ఆలోచన రావడం ఆలస్యం... వెంటనే పార్కు దగ్గరికి బయలుదేరాడతను. వినోద్‌ని రామన్‌ని ఓ రూమ్‌లో పడేసి తాళం బిగించి తాళం తన దగ్గర భద్రపరచుకున్నాడు. రివాల్వర్‌ని సిద్ధం చేసుకుని నాయర్‌ని హెచ్చరించి గబగబా బయటికి వచ్చి తన స్కూటర్ మీద పార్కు దగ్గరికి బయలుదేరాడు కార్తి శ్రేయోభిలాషిని కలుసుకోవటం కోసం చైతన్య

అతను హఠాత్తుగా అలా బయలుదేరటం ఎదుట మేడలోని ఆ యువతి చూసింది ఆలోచనతొ ఆమె కనుబొమలు ముడివడ్డాయి చక చక తన ఆల్సేషియన్ డాగ్‌తొ మేడ దిగి వచ్చి తన ఫియట్‌లో ఆ కుక్కతొ తనే డ్రైవ్ చేసుకుంటూ బయలుదేరింది అతని వెనకనే

చైతన్య ఏ క్షణంలో అయితే ఇల్లు వదిలాడొ

నాయర్ పెరట్లో వున్న కూరగాయల పాదుల దగ్గరికి ప్లాస్టిక్ బాస్కెట్ తీసుకుని బయలుదేరాడు.. కూరగాయల కోసం. వెళుతూ ఇంటి తలుపు ముందుకి లాక్కుని వెళ్లాడు.

అంత వరకూ ఆ ఇంటి పరిసరాల్లో తారట్లాడుతున్న ఓ శాల్తీ గబగబ పరుగెత్తుకు వచ్చి ఆ ఇంట్లో దూరింది చైతన్య వినోద్, రామన్‌లని దాచిన ఆ రూమ్‌ని అతితేలిగ్గా గుర్తు పట్టిన ఆ శాల్తీ ఒక్క క్షణం మాత్రం ఆలోచించి ఆ తరువాత ఆ ఇల్లు ఆ ఇంట్లోని ప్రతీ అంగుళమూ తనకి చిరపరిచితమైనదేనన్నట్టు కిచెన్‌లోకి పరుగెత్తి కిచెన్‌లో నుండి వున్న తలుపుల్ని తెరుచుకుని అక్కడున్న మరో గదిలోకి ప్రవేశించింది అది స్టోర్ రూమ్ అక్కడ ఓ అలమరాలో వెదికి .. ఓ దబ్బనం తీసుకుని మళ్ళీ ఆ తలుపుల్ని మూసి వేసి పరుగెత్తుకు వచ్చి బంధితులు వున్న ఆ గది తాళం ఆ దబ్బనంతో తీసి పడేసి లోపలికి వచ్చి పడిన ఆ శాల్తీని చూసి . .

"అమ్మయ్య వచ్చావా?" సంతోషంగా అన్నారు ఆ ఇద్దరూ ఇప్పుడు రామన్ మాటల్లో ఇందాకటి అలవయాస లేదు

గబగబా వారిని బంధించి వున్న తాళ్ళని విప్పుతూ... "వెంటనే పారిపోండి" అంది ఆ శాల్తీ.

క్షణం ఆలస్యం చెయ్యకుండా పారిపొయ్యారు ఆ ఇద్దరూ. ఆ తరువాత యధాప్రకారం ఆ రూమ్ తలుపులకి తాళం తగిలించి ఆ ఇంట్లో నుండి బయటపడిందా శాల్తీ.

ఇదేమీ తెలీని నాయర్ మరో రెండు నిముషాల తరువాత కూరగాయలతో వచ్చి కిచెన్‌లో కూని రాగంతో తన పనిలో మునిగిపొయ్యాడు.

ఆ సమయంలో అక్కడ చైతన్య....

**(ఇంకా ఉంది)**

# కాలిఫ్లవర్‌తో మసాలాకూర

**మీ** పత్రిక పుణ్యమా అని నన్ను నేను పరిచయము చేసుకోదలుచుకున్నాను నాకు వంటవచ్చు నేను నలభీమ పాకం పేరు నిలబెట్టాలని ఈ క్రింది వంటకం పంపుచున్నాను

కావలసిన వస్తువులు –1/4 కేజీ కాలిఫ్లవర్, 1/4 కేజి టొమాటాలు, పెద్ద సైజు ఉల్లిపాయలు నాలుగు, 1/4 కేజి ఆలుగడ్డ, కేరట్ దుంపలు 4,



మసాలాకు అవసరమైన లవంగాలు 4, యాలుకలు 4, ధనియాలు ఒక టేబుల్ స్పూన్, గసాలు రెండు టేబుల్ స్పూన్, వెల్లుల్లిపాయ రేకులు 4, చిన్న అల్లము ముక్క, చిన్న పచ్చి కొబ్బరి ముక్క, లేక ఎండు కొబ్బరి ముక్క అయిన, కొత్తిమీర, కరివేపాకు, పొదీనా ఇవి అన్నీ కొంచెముగా పక్కన పెట్టుకోవాలి

తయారు చేయు విదానము – టొమాటాలు,

## నలభీమపాకం

నలభీమపాకం




కాలిఫ్లవర్, ఆలుగడ్డలు, ఉల్లిపాయలు, కేరట్‌లు కడిగి, తరిగి ప్రక్కన పెట్టుకోవాలి ఒక గిన్నె తీసికొని నూనె తగినంత వేసి తాలింపు గింజలను వేసి పొదీనా, కరివేపాకు, కొత్తిమీర, పచ్చి మిరపకాయలు అన్నీ వేసి తరువాత తరిగి ఉంచుకొనిన ముక్కలు కూడా తాలింపులో వేయాలి దోరగా వేగిన తరువాత రెండు చిన్న గ్లాసుల నీరు పోయాలి తరువాత లవంగాలు, చక్క, ధనియాలు, గసాలు, అల్లము, వెల్లుల్లి, కొబ్బరి వగైరాలు మెత్తగా నూరి ఉడికే కూరలో వేయాలి ఉడికేటప్పుడు కారం, తగినంత ఉప్పు, చిటికెడు పసుపు వేసి మసాల వాసన వచ్చే మేరకు ఉడికించాలి ఇది చాలా రుచిగా ఉంటుంది ఈ కూర భోజనంలోకే కాక పూరీ కూరకు కూడా ఉపయోగించవచ్చు

పి. నరసింహారావు,
ఖమ్మం

కూపన్

ఆంధ్రసచిత్రవారపత్రిక

మగవంటలు – నల"భీమపాకం" శీర్షికకి –

ఈ కూపన్ తప్పక జత చేయాలి -----

పేరు ..........................................

చిరునామా ..........................................

ఫోటో వున్నదా? ..........................................

లేదా? ..........................................



పెద్ద కథ

# పార్వతీ కళ్యాణం

## చిత్రపు హనుమంతరావ్

(గత సంచిక తరువాయి)

రోజులు గడచి పోతున్నాయి రామచంద్రమూర్తిలో చాలా మార్పు వచ్చింది అతని మాటల్లో ఉత్సాహం లేదు బట్టలమీద శ్రద్ధలేదు తిండిమీద ధ్యాసలేదు గెడ్డం పెరిగిపోయింది ఇరవై నాలుగ్గంటలూ అతడి ఆలోచనలు చెల్లెలి గురించే చెల్లెలి విషయం పిన తండ్రికి తెలిస్తే ఏమంటాడు? రోజూ 'బాంకి'కి ఫోనుచేస పార్వతి వచ్చిందేమోనని వాకబు చేస్తున్నాడు అల్లుడి కోసం ఫోను చేస్తున్నాడు సాయంత్రాలు కూతురు వచ్చిందేమోనని వాళ్ళింటికి వెడుతున్నాడు అతడి బాధలో పాలు పంచుకొనే వాళ్ళే లేక పోయెరు కూతురు వుంటే అతడి బాధలో పాలు పంచుకునేది కొందరు 'రామచంద్రమూర్తి చెల్లెలు లేచిపోయింది' అంటే మరి కొందరు 'ఏం చేస్తుంది ముప్పయ్యేళ్ళొస్తున్నా పెళ్ళి పెటాకులూ లేవు అన్నగారికి పెళ్ళి చేసే యోచనేలేదు' అంటున్నారు ఇక మీనాక్షి రోజూ క్రమం తప్పకుండా ఆడబడుచుని తిట్టిపోస్తోంది అంతటితో ఆగక రామచంద్రమూర్తి వంశాన్నీ తిట్టిపోస్తోంది అడిగిన వాళ్ళకీ, అడగని వాళ్ళకీ' మా ఆడబడుచు లేచిపోయిందని నోరింత చేసుకుని చెబుతోంది!

* * * * * * *

రామచంద్రమూర్తి ఆఫీసు చేరిన కొద్ది సేపటికే సురేంద్ర ఫోను చేసి చెప్పేడు- పొద్దున్న తాము వచ్చినట్లు కూతురు వచ్చిందంటే మూర్తికి ప్రాణం లేచి వచ్చింది ఆఫీసుకి మధ్యాహ్నం సెలవుపెట్టి కూతురింటికి వెళ్ళేడు సుధ తండ్రిని చూసి ఆశ్చర్యపోయింది గెడ్డం పెరిగింది చాలా చిక్కిపోయేడు కళ్ళులో పలిక పోయేయి కళ్ళల్లో జీవం లేదు సుధ ఆదుర్దానిండిన స్వరంతో అంది

'ఏవిటి నాన్నా ఈ కొద్ది రోజుల్లో ఇంత చిక్కిపోయేవు ఆరోగ్యం బావుండడం లేదా? డాక్టరు దగ్గరకు వెళ్ళేవా? మందులు తీసుకుంటున్నావా '

రామచంద్రమూర్తి విరక్తిగా నవ్వాడు

'నా జబ్బుకి ఏ డాక్టరూ మందివ్వలేడు తల్లి ఈ జబ్బు శారీరకమైంది కాదు మనోవ్యధకి మందేవిటి?

సుధ ఆశ్చర్యపోతూ

'మనో వ్యధా ఎందుకు? అంది'

'మీ అత్త '

'అత్తకేమయింది? '

'మీ అత్త ఇల్లు విడిచి వెళ్ళిపోయింది నువ్వు వెళ్ళిన నాలుగైదు రోజులకి ఆపీసుకి వెళ్ళిన మనిషి తిరిగి రాలేదు బ్యాంకిలో అడిగితే సెలవుపెట్టిందన్నారు వూరెడుతున్నానని వెంకటలక్ష్మికి చెప్పిందట నాకు అర్థం కావడంలేదు పార్వతి వూరు వెళ్ళడమేమిటి? ఎందుకు వెళ్ళింది? కట్టుబట్టల్తో వెళ్ళాల్సిన అవసరమేమొచ్చింది? అసలు వూరు వెళ్ళిందా? ఏ ఆపదా రాలేదుకద ఏ అఘాయిత్యమూ చెయ్యలేదు కదా నా భయమల్లా అది ఏ విపత్కర పరిస్థితిలో చిక్కుకుందోనని

సుద మాట్లాడలేదు తండ్రివైపు చూస్తూ ఉండిపోయింది

'నేను దానికోసం బెంగపెట్టుకుంటే, మీ అమ్మ అది లేచిపోయిందని నలుగురికీ చెప్పుకుని ఆనందిస్తోంది నేనెప్పుడూ నా స్వార్థమే చూసుకున్నాను ఇల్లు కొడుకుల చదువు కూతురి పెళ్ళి దానికి పెళ్ళి చేసి పంపిద్దామనుకోలేదు అది విరక్తితో వెళ్ళిపోయిందేమో? ఏ అఘాయిత్యమైనా చేసిందేమో? దానికి ఏ ఆపదైనా వచ్చిందేమో? '

సుధ నిట్టూరుస్తూ

'అత్త ఆత్మహత్య చేసుకునేంతటి బలహీనురాలు కాదు ఆపద వచ్చిందని ఎందుకనుకుంటావు తనను తాను రక్షించుకోగల శక్తి అత్తకి వుంది ' అంది

'అంతేనంటావా సుదా' అది క్షేమంగా ఉందంటావా చాలమ్మా చాలు అదెక్కడ వున్నా క్షేమంగా వుంటే అంతే చాలు అది ఇంట్లో వున్నంత కాలమూ దానివిలువ తెలిసిందికాదు ఇప్పుడు క్షణ క్షణమూ అదే గుర్తుకొస్తోంది నా కోసం నా సంసారం కోసం పిచ్చిపిల్ల ఎంతగా తాపత్రయపడింది? దాని మనసెంత మంచిది? ఎప్పుడూ మన సుఖం కోసమే పాటుపడింది '

సుధ ఆలోచిస్తూ అంది

'అత్త పెళ్ళి చేసుకుందేమో?

రామచంద్రమూర్తి ఆశ్చర్యపోతూ 'పెళ్ళా అన్నాడు

'ఏం నాన్నా అంతగా ఆశ్చర్య పోతున్నావు అత్త పెళ్ళి చేసుకోకూడదా? '

'కాదమ్మా నా ఆశ్చర్యం అందుకు కాదు తనంతట తానే పెళ్ళి చేసుకుందంటే ఆశ్చర్యంగా వుంది '

'అత్త పెళ్ళి చేసుకుని వచ్చిందనుకో నువ్వు మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తావా? అమ్మ అత్తని నానా మాటలూ అనకుండా అదుపులో పెట్టగలవా '

'పార్వతి పెళ్ళి చెయ్యడం నా బాధ్యత నా బాధ్యత విస్మరించి నా స్వార్థం నేను చూసుకున్నాను ఎన్నోసార్లు దానికి పెళ్ళి చెయ్యాలని ప్రయత్నించేను మీ అమ్మ పడనిచ్చింది కాదు పెద్దన్నయ్యని మెడిసిన్, చిన్నన్నయ్యని ఇంజనీరింగ్ చదివిస్తున్నానంటే, నీకు పాతికవేలిచ్చి ఇంజనీరు భర్తని తెచ్చేనంటే అది నా ప్రయోజకత్వం కాదు పార్వతి ఆసరాలేకపోతే నీ అన్నలిద్దరూ గుమాస్తాలుగానే ఉండేవారు నీకూ ఓ గుమాస్తా భర్తనే తేగలిగేవాడ్ని ఇల్లు ఎలాకట్టేననుకుంటున్నావు పొలం అమ్మేసి కట్టేను అది నోరెత్తలేదు అయినా మీ అమ్మకి తృప్తిలేదు పెళ్ళి కాకుండా అది జీవితాంతమూ మా పంచనే ఉండాలనుకుంటుంది పెళ్ళయితే దాని జీతం అందదని భయం ఇప్పుడు అన్నయ్యల చదువంటోంది ఆ తర్వాత కోడళ్ళు రావాలంటుంది చెల్లెలికి పెళ్ళయిందంటే సంతోషించని అన్న ఉంటాడా? పైకి కన్పించకపోయినా నా గుండెల్లో దానికి ఉన్నతమైన స్థానం ఉంది నేను కోరుకునేది అది సుఖంగా ఉండటం నేను మీనాక్షి భర్తనే కాదు పార్వతికి అన్నయ్యని కూడా నువ్వన్నట్లు అది పెళ్ళి చేసుకుంటే మనసారా ఆశీర్వదిస్తాను మీ అమ్మని

అదుపులో పెట్టడమే కాదు, దాన్ని నోరెత్తనివ్వను

సుధ తేలిగ్గా నిట్టూర్చి అత్త పెళ్లయిందంటే నీలో ఎలాంటి మార్పు వస్తుందో ననుకున్నాను అత్త పెళ్లి నీకు సంతోషాన్ని కల్గిస్తుందని తెలిసేక నేనెందుకు దాయాలి? అత్త పెళ్లి ఎంతో వైభవంగా పది రోజుల క్రిందటే జరిగింది నాన్నా

రామచంద్రమూర్తి తెల్లబోయాడు.

'నీకెలా తెలుసు ?

'నేనూ మీ అల్లుడుగారూ పెళ్లికి హాజరయ్యాం కాబట్టి అన్నయ్యలిద్దరూ వచ్చేరు అన్నయ్యలూ, మీ అల్లుడూ ఎంతో హడావుడి చేసేరు

రామచంద్రమూర్తి నిశ్చేష్టుడయ్యేడు తన చెల్లెలి పెళ్లి తనకు తెలియకుండానే జరిగింది పైగా అది గుళ్లో పెళ్లి కాదు 'రిజిష్టరు మ్యారేజి కాదు తన ఎల్లలూ, అల్లుడూ దగ్గరుండి జరిపించేరు

'పెళ్లి ఎంతో వైభవంగా జరిగింది నాన్నా చిన్న తాతయ్య చిన్న బామ్మ కన్యాదానం చేసేరు '

పిన తండ్రి అన్నమాట నిలబెట్టుకున్నాడు అన్నగారి కూతురిపెళ్లి తనే చేసేడు మరి తను తల్లికిచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయేడు

'నువ్వూ అమ్మా పెళ్లికి రాకపోవడం లోటే నాన్నా అయితే పరిస్థితులలా వచ్చేయి నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెబుతాను '

'చెప్పమ్మా '

'చెల్లెలి పెళ్లి జరగడం నీకు సంతోషమే కానీ మరిఅమ్మ? అత్త పెళ్లి జరగడం అమ్మకి సుతరామూ ఇష్టం వుండదని మా అందరి అభిప్రాయమూ అమ్మ అడ్డుపడుతుందని మీకు తెలియనివ్వలేదు

నిజమే మీనాక్షికి తెలిస్తే పెళ్లి జరిగేది కాదేమో' రామచంద్రమూర్తి అన్నాడు

నిజమేనమ్మా మీ అమ్మకి తెలిస్తే పెళ్లి జరగనిచ్చేది కాదేమో' పార్వతిని చూసి పదిహేను రోజులైంది పార్వతిని, పార్వతి భర్తని చూడాలని ఆతృతగా ఉంది వాళ్ల ఇల్లు మీకు తెలుసామ్మా వెళ్లి చూస్తాను '

పెళ్లవగానే వాళ్లూ ఉత్తరదేశం చూడ్డానికి వెళ్లారు మేము దక్షిణాదికి వెళ్లేం మామయ్యగారి సెలవు ఇవాళ్టి వరకే ఉంది అత్తయ్యని రేపటి వరకూ ఉండమనుకో రేపొద్దున్న ఈ వూరు చేరుకుంటారు

'ఏ రైల్లో వస్తారమ్మా స్టేషనుకి వెడతాను '

'నాకూ తెలీదు నాన్నా అయినా నువ్వు స్టేషనుకి వెళ్లడం బాగుండదేమో నిన్ను చూసి వాళ్లిద్దరూ కంగారు పడవచ్చు సాయంత్రం వాళ్లిద్దరూ మా ఇంటికి ఎలాగూ భోజనానికి వస్తారు నువ్వూ అమ్మా కూడా రండి నేను చెప్పిన విషయం గుర్తుంచికదా అమ్మని

ఆ విషయంలో నీకే బెంగా అక్కర్లేదు మా బాపగారెలా ఉంటారమ్మా? నా చెల్లెలికి తగ్గట్టుంటారా?'

'ఆతృత ఎందుకు నాన్నా. రేపు సాయంత్రం చూస్తావుగా?

రామచంద్రమూర్తి చెల్లెలి భర్తని వూహిస్తూ ఉండిపోయేడు

'అత్త మా అందరికీ దేవత అత్తారింట్లో కూడా ఎంతో మంచి పేరు తెచ్చుకుంది వాళ్లందరికీ అత్తంటే ఎంతో ఇష్టం నా యింట్లో అత్తకి ఏ మాత్రం అవమానం జరిగినా ఆయన సహించరు నేనూ సహించను అదే అయిన పక్షంలో మేమిద్దరం మీకు శాశ్వతంగా దూరమవుతాం '

'నేను హామీ ఇస్తున్నాను కదమ్మా మీ అమ్మని నోరెత్తనివ్వను

రామచంద్రమూర్తి బయల్దేరబోతూంటే సురేంద్ర వచ్చేడు తిరిగి కూర్చుండి పోయేడు కొంత సేపు వాళ్లు చూసివచ్చిన ప్రదేశాల గురించి కబుర్లయ్యేయి

రామచంద్రమూర్తి ఇల్లు చేరేసరికి రాత్రి ఏసమిదైంది

మీనాక్షి గొణుగింది

'మీకది రోజువారి కార్యక్రమమైపోయింది తప్పిపోయిన వాళ్లని వెదకడంలో అర్థముంది కానీ వానికోసం వెదకడంలో అర్థంలేదు

'ఎవరిని

'అదే లేచిపోయిన ముం .

మీనాక్షి మాటలు పూర్తి కాలేదు రామచంద్రమూర్తి కుడి చెయ్యివచ్చి మీనాక్షి ఎడం చెంపని బలంగా తాకింది. మీనాక్షికి కళ్లు బైర్లు కమ్మాయి కొద్ది క్షణాలు ఏం జరిగిందో అర్థం కాలేదు తీరా తెలిసేక నిర్ఘాంత పోయింది తనంటే బయపడే భర్తకి అంత ధైర్యం ఎలా వచ్చింది? మాటలు కూడదీసుకుని అంది

'తాగొచ్చేరా నన్ను కొడతారా ఎంత ధైర్యం '

'నోరుముయ్యి పిచ్చి పిచ్చిగా వాగేవంటే బెల్టుతీసి ఉతికేస్తాను సహనాన్ని చేతకానితనం అనుకోకు అమ్మాయీ వాళ్లూ వూరు నుండి వచ్చేరు అల్లుడు ఫోను చేస్తే వాళ్లింటికి వెళ్లి వస్తున్నాను ఒ శుభవార్త తెలిసింది నా చెల్లెలి



పెళ్ళయింది. ఎంతో వైభవంగా జరిగిందట... నీకెలా తెలిసిందని ఆశ్చర్యపోకు.... మన రక్తం పంచుకు పుట్టిన సుధే చెప్పింది.... పెళ్ళికి మన పిల్లలు ముగ్గురూ, అల్లుడూ హాజరయ్యేరు. దాని పెళ్ళి గుళ్ళో జరగలేదు. 'రిజిస్ట్రారు' ఆఫీసులో జరగలేదు. శాస్త్రోక్తంగా జరిగింది. చిన్నాన్నా పిన్నీ కన్యాదానం చేసేరు.... చెల్లెలు మీద నేను చూపించలేని ప్రేమాభిమానాలు నా పిల్లలూ, అల్లుడూ చూపించేరు. మనం ఎప్పుడూ స్వార్థాన్నే చూసుకున్నాం... దానికి పెళ్ళి చేసి పంపాల్సింది పోయి దాని సంపాదన దోచుకున్నాం. నువ్వు దానిచేత ఇంటి చాకిరీ చేయించేవు. దానికి పెళ్ళయితే నీకు కష్టమే మరి... జీతం బత్తెంలేని పనిమనిషుండదు. పైగా సుధ ఏమందో తెలుసా? అత్తకి పెళ్ళయితే డబ్బు ఇవ్వదని అమ్మ భయం.. అన్నయ్యల చదువయ్యే వరకూ అత్తకి పెళ్ళి కానివ్వదు....' అంది అందుకే పెళ్ళి విషయం మనకి తెలీకుండా జాగ్రత్త పడ్డారు.'

మీనాక్షికి పిల్లలమీద ఎంతో కోపం వచ్చింది. కన్న తల్లికంటే అది ఎక్కువైందా? అది ఏ తలమాసినవాడ్ని చేసుకుంటే.

'తగుదు మమ్మా' అంటూ హాజరయ్యేరు! సుధ- నిన్నగాక మొన్న పెళ్ళయింది. అప్పుడే తనకి పాఠాలు చెప్పేంత ఎదిగింది.

రామచంద్రమూర్తి ఎంతో సంతోషంతో సుగుణమ్మకి చెప్పేడు.

'ఎంత శుభవార్త చెప్పావు. కాస్త ఆలస్యమైనా దానికో సంసారం ఏర్పడింది. అది ఎవరిని చేసుకున్నా సుఖంగా వుంటే చాలు' అన్నదావిడ.

ఆ రాత్రి రామచంద్రమూర్తికి చాలాసేపటి వరకూ నిద్రపట్టింది కాదు. అతడి కళ్ళ ముందు చెల్లెలే మెదిలింది. తను పుట్టిన చాలా కాలానికి పదిహేనేళ్ళకి పుట్టింది. తల్లీ, తండ్రి ఎంతో ముద్దు చేసేవారు. దానికి పధ్నాలుగేళ్ళొచ్చేసరికి తండ్రి పోయేడు. మరో రెండేళ్ళకే తల్లి పోయింది. దాని ముద్దూ మురిపెమూ వాళ్ళతోనే పోయేయి. తల్లికి మాట ఇచ్చేడు. 'చెల్లెలికి ఏ లోటూ రానివ్వనని మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తా'నని తనిచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయేడు. కొంత వరకూ అదే తన సంసార బాధ్యత తీసుకుంది.

* * * * * * *

రామచంద్రమూర్తి ఆఫీసుకి వెళుతూ భార్యతో అన్నాడు:

'సాయంత్రం మనిద్దర్ని అమ్మాయి భోజనానికి రమ్మంది. నేను ఆఫీసు నుండి తిన్నగా వెళతాను... నువ్వు ఏ నాలుగింటికో 'ఆటో' చేసుకునిరా...'

రెండడుగులు వేసి–,

'పార్వతీ, భర్తా కూడా వస్తారు. పెద్దరికం నిలబెట్టుకుని దాన్ని ఆశీర్వదిస్తే మంచిది. అక్కడ ఏ రభసైనా చేద్దామనుకున్నావో నీ కన్న కూతురే నిన్ను బయటకు నెట్టేస్తుందని మర్చిపోకు...' అన్నాడు.

మీనాక్షి సమాధానం చెప్పలేదు.

ఆ మధ్యాహ్నం మీనాక్షికి మేనమామ దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది. సువర్చల పెళ్ళి విషయంలో తామెంత బెంగపెట్టుకున్నదీ జాలిగొలిపేలా రాసేరు. సురేంద్ర పిన తండ్రి రాజశేఖరం గురించి రాస్తూ, 'మీ ఆయనా సురేంద్రా చెబితే' అతను ఒప్పుకుంటాడన్న నమ్మకం నాకుంది' అంటూ రాసేరు. రాజశేఖరం ఇష్టపడితే ఇంకేం కావాలి? సువర్చల బూరెల బుట్టలో పడ్డట్టే! రాజశేఖరం ఆరడుగుల అందగాడు. బ్యాంకిలో ఆఫీసరు. సొంత ఇల్లు కట్టుకున్నాడు. ఇంట్లో కలర్ టి. వి., ఫ్రిజ్ డబుల్‌కాట్బు వాటి మీద ఫోమ్ బెడ్స్... ఒకటేమిటి సమస్తమూ ఉన్నాయి. సుధ పెళ్ళిలో సువర్చల కోసం ప్రయత్నించేరు. అప్పట్లో పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదన్నాడు. ఇప్పుడు సుధనీ, సురేంద్రనీ చూసేక అతడిలో మార్పు వచ్చి ఉండచ్చు. వచ్చే వుంటుంది ఈ సంబంధం కుదరాలంటే భర్త సహకారం కావాలి. కూతురి సహకారం, అల్లుడి సహకారం కావాలి. పార్వతి ఎవరిని చేసుకుంటే తనకేల? భర్తతో మంచిగానే ఉండాలని నిశ్చయించుకుంది. పార్వతి పెళ్ళికి ఎంతో సంతోషించినట్లు నటించి ఆశీర్వదించాలనుకుంది!

ఆటో దిగిన తల్లిని చూస్తూనే తల్లి తండ్రుల మధ్య గొడవ జరిగిందని సుధ గ్రహించింది. అయినా అడగలేదు.

'ఎలా వున్నావే తల్లీ... ఏవి పూళ్ళు చూసేరు....' అంటూ అడిగింది మీనాక్షి సుధ చెబుతూండగానే రామచంద్రమూర్తి వచ్చేడు. చేతుల్లో వున్న చేతి సంచీ 'ఎటాచీ కేసూ' బల్ల మీద పెట్టేడు.

మీనాక్షి గబగబా వెళ్ళి 'ఫ్రిజ్' లోంచి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది.

సుధ కాఫీ ఫలహారాలు తేడానికి వెళ్ళింది. మీనాక్షి ప్రసన్నవదనంతో మేనమామ ఉత్తరం చూపించింది. రామచంద్రమూర్తి ఆశ్చర్యంతో 'రాజశేఖరాన్ని సుధ పెళ్ళిలోనే అడిగేంకదా.... పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం లేదన్నాడుకద...' అన్నాడు.

'అప్పుడు చేసుకోనన్నాడు... ఇప్పుడు చేసుకుంటానంటాడేమో? అంతగా పెళ్ళీ పెటాకులూ లేకుండా ఉండిపోదామనుకునేవాడు ఇల్లెందుకు కట్టుకుంటాడు? ఇంట్లో సమస్తమూ ఎందుకు అమర్చుకుంటాడు? సువర్చల సుఖపడుతుంది. అల్లుడూ మీరూ చెబితే కాదనడు....'

'అన్నలూ, వదినలూ– అక్కలూ బావలూ ఎంతగా చెప్పినా విన్నాడుకాదు... అలాంటిది మా యిద్దరివల్ల ఏమవుతుంది? అయినా నీ మాట లెందుకు కాదనాలి? నేనూ, అల్లుడూ చెబుతాం.... ఎవరికెవరు రాసిపెట్టి ఉన్నారో...'

సుధ కాఫీ ఫలహారాలు తెచ్చి తండ్రికిచ్చింది. అవి తీసుకుని గుమ్మం వైపు కూర్చుండి పోయేడు. సుధా, మీనాక్షి కబుర్లలో పడ్డారు. వాళ్ళ మాటలో పార్వతి ప్రసక్తి లేదు. రామచంద్రమూర్తి తనకేం పట్టనట్లు గుమ్మంవైపు దృష్టిని సారించి కూర్చున్నాడు. సురేంద్ర వచ్చేడు. భార్యతో లోపలికి వెళ్ళేడు. బట్టలు మార్చుకుని వచ్చి మామగారి పక్కన కూర్చున్నాడు.

(ఇంకా ఉంది)






# మీ అభిమాన తార ఇల్లు ఇదే




పటిష్ఠమయిన
అందమయిన
కట్టడాలకు
వాడేది

**ప్రియా**
**సిమెంట్**






సిమెంట్
రంగంలో
రారాజు



**ప్రియా**
**సిమెంట్**



**Priyadarshini Cement Ltd.**

MAADS/89/IEL

Rajbhavan Road, HYDERABAD - 500 482

సీరియల్

# మైథిలి

కుందుర్తి ఇందిరా దేవి



(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ – 4:** కన్నకూతురు మున్నీ మాటలతో తల్లడిల్లిన మైథిలి కళ్ళముందు గతం కదలాడుతుంది. తన కాబోయే భర్త మోహన్ బంధువులమ్మాయితో సన్నిహితంగా వుండటం ఆమె సహించలేకపోతుంది. శారదాంబ కొడుకు రజనీకాంత్ మైథిలి వివాహం అయిందని తెలిసి అవాక్కవుతాడు. పుట్టినరోజు పండుగనాడు త్రాగివచ్చిన మోహన్ మైథిలిని బలవంతంగా అనుభవిస్తాడు. ఆషాఢమాసం వంకతో పుట్టింటికి వెళ్ళిన మైథిలి నెలరోజుల తర్వాత అత్తారింటికి తిరిగివచ్చేసింది. భర్తతో పిక్నిక్ వెళ్ళిన మైథిలికి మనస్తాపమే మిగిలింది.

సాయంత్రం నీరెండ కిటికీలో నుండి జారి మైథిలి పీరకుచ్చెళ్ళ మీద జీరాడుతోంది అంతకు ముందే త్రాగి పెట్టిన గ్లాసు మీద ఈగ ఒకటి ఎగురోతోంది టేబిల్ మీద ఉన్న రేడియోలో నుండి మలయాళం పాటలు వస్తున్నాయి

మైథిలీ ఎవరో వచ్చారు చూడు పెరట్లో మొక్కలకి నీళ్ళు పోస్తున్న సుగుణ కేకేసింది

బైట మాటలు వినిపిస్తున్నాయి భర్త షర్టులకి బటన్స్ కుడుతున్న మైథిలి లేచేలోపే అతను లోపలికి వచ్చేశాడు

రజనీ మైథిలి సంభ్రమంగా లేవబోయింది

అతను వారిస్తూ కుర్చీ లాక్కుని కూర్చున్నాడు

ఎప్పుడు వచ్చావు అంది

వారం రోజులైంది

ఇప్పటికి చూడాలనిపించిందా చిరుకోపంగా అంది

మీ ఇంట్లో అభ్యంతరం లేకపోతే రోజూ వస్తాను వారం రోజులనాడే వద్దామంటే అమ్మ ఆపేసింది రహస్యం చెబుతున్నట్టుగా అన్నాడు

మైథిలి ముఖం ఎర్రబడింది

అమ్మ లడ్లు చేసింది విడిలేదుకదా నన్నె యిచ్చిరమ్మంది నవ్వాడతను

ఆ నవ్వు ఎంత స్వచ్ఛంగా ఉంది ఎంత హుందాగా ఉంది

ఉలిక్కిపడి రజనీకాంత్ యిచ్చిన పాకెట్ అందుకొని చకచకా విప్పి తిననా అంది

అందుకేగా తెచ్చాను ఆపేక్షగా అన్నాడు

ఇంద ఒకటి తీసుకో అని రజనీకాంత్ కివ్వబోయింది

నేను చాలానే తిన్నాను వద్దు తిరస్కరిస్తున్నా వినకుండా ఎన్ని తిన్నా నా చేత్తో యిస్తే మళ్ళీ తినే వాడివిగా అనడంతో తీసుకున్నాడు

సూది షర్టుకి గుచ్చి ఆ బట్టలు టేబిల్ మీద పడేసి విశ్రాంతిగా వెనక్కి వాలి లడ్డు కొరుకుతూ 'అత్తయ్యా, మామయ్యా బావున్నారా అంది

ఆ

అమ్మ, నాన్న మురళి

డబుల్ క్షేమం

ఈజీచైర్లో వాలిన మైథిలి పొట్ట ఎత్తుగా కనబడుతుంటే సిగ్గుపడి లేవబోయింది

వద్దు మధూ అలాగే పడుకో నేనేమన్నా క్రొత్తవాడినా అతను మందలించాడు

మైథిలి పొడుగాటి జడ క్రింద వ్రేలాడుతోంది

రజనీకాంత్ ముఖంలో లీలగా కదిలిపోయిన విషాద రేఖని ఆమె గమనించలేదు

లోపలికి వచ్చిన సుగుణ అరె ప్లేటయినా యివ్వకుండా అలా పెట్టెయ్యడమేనా అంది కేకలేస్తూ

పోనిండి అత్తయ్యా అతనికేం ఏడు మల్లెపువ్వు లెత్తున మర్యాదలు చెయ్యక్కర్లేదు కొట్టి పారేసింది

కోడలి ముఖంలో వెల్లువలా పొంగే సంతోషం సుగుణ మనసులో ఎక్కడో తాకింది

అయిదు నిముషాల తర్వాత ఆవిడ కాఫీ తెచ్చి అతనికిచ్చి తనూ కూలబడింది వగరుస్తూ

మీకు చాలా శ్రమ యిస్తున్నాను రజనీకాంత్ నొచ్చుకున్నాడు

శ్రమేమిటి బాబూ సుగుణకి ముచ్చటవేసింది అతన్ని చూస్తే

"ఇవిగో అత్తయ్యా. మా శారదత్తయ్య పంపింది' అంటూ రెండు లడ్లు తీసుకుని మిగతావి ఆవిడకి అందించింది.

ఆవిడ ఒకటితిని 'నేను వెళ్ళి పప్పు రుబ్బాలి. మీరు మాట్లాడుకోండి" అని లేచింది.

రజని ఖంగారుగా లేస్తూ 'సారీ. మీకు పనిటైమ్ అనుకుంటాను" అన్నాడు.

ఆవిడ తెల్లబోయింది ముందు. ఆ తర్వాత నవ్వుతూ 'మీ మైథిలి చేత పప్పురుబ్బించడమే ఇంకానయం అంది

దర్జాగా పడుకున్న మైథిలి "బామ్మగారు కాబోతున్న ఆనందంలే అది. కూర్చో. నేను పనీపాటా లేకుండా యిలాకూర్చుని కాలక్షేపం చెయ్యడమే" అంది

సుగుణ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

తదేకంగా చూస్తున్న రజనీకాంత్‌కి మైథిలి కళ్ళెగరేస్తూ లడ్డు తింటూ ఉంటే నవ్వు వచ్చింది

"ఇంకా పసితనం అయినా పోని నువ్వు ఇంకో పాపకి తల్లివవుతున్నావంటే

మైథిలి సిగ్గుగా నవ్వింది

అప్పుడే మోహన్ వచ్చాడు మైథిలి లేచి భర్తని పరిచయం చేసింది .

'హలో గ్లాడ్ టు సీయూ మోహన్ కరచాలనం చేశాడు

చేతులు కలుపుకుని విష్ చేసుకుంటున్న ఇద్దర్నీ మైథిలి కళ్ళు విప్పార్చుకుని చూసింది

పచ్చగా, చార్మింగ్‌గా ఉండే మోహన్ పూలరంగడిలా ఉన్నాడు

చామన చాయగా ఉండే రజనీకాంత్, చదువు- సంస్కారం వెల్లివిరిస్తుంటే రాముడు మంచి బాలుడు సుమా అనేలా ఉన్నాడు

ఇరవై ఏళ్ళ రజనీకాంత్, ఇరవైమూడేళ్ళ మోహన్ తమాషా అనిపించింది మైథిలికి

అయిదు నిముషాలు కూర్చుని ఎక్స్‌క్యూజ్‌మి స్నానం చేసి వస్తాను అని వెళ్ళిపోయాడు

హుషారైన వాడు కామెంట్ చేశాడు రజని

టవల్స్ తీసుకుని బాత్ రూమ్‌కి వెళుతున్న మోహన్ని చూసి వెళ్ళు మధూ నేను కూర్చుంటాలే అన్నాడు

నేనిప్పుడు ఏడు మల్లెపువ్వు లెత్తు అని చెప్పానుగా అని ఈజీ ఛెయిర్లో కూర్చుని టేబిల్ మీద పెట్టిన లడ్డు కొరుకుతూ మళ్ళీ గుండీలు కుట్ట సాగింది

హఠాత్తుగా అక్కడి వాతావరణం మారిపోయినట్టు నిశ్శబ్దం అలుముకుంది రజనీకాంత్ కర్చీఫ్ తీసి చెమట తుడుచుకుంటుంటే మైథిలి 'ఫాన్ వెయ్యి రజనీ' అంది.

అతను లేచి టేబిల్ ఫ్యాన్ వేస్తూ "క్రొత్తదా" అన్నాడు

అవును ఆషాడ పట్టీ క్రింద మావారు అడిగి మరీ పుచ్చుకున్నారు



అప్పుడే లోపలికి వస్తున్న మోహన్ ఆ మాటలు విన్నాడు.

రజనీ ఖంగారు పడి "పైసా కట్నం లేకుండా చేసుకున్నాడు. ఇంత చిరుకానుక అడిగాడని చెప్పుతావేం. నిజంగా మీ ఆడవాళ్ళు.... అన్నాడు

మోహన్ భార్యని చూసి ఈల వేసి పక్క గదిలోకి వెళ్ళిపోయాడు.

మైథిలి కుట్టటం ఆపేసి "రజనీ నువ్వు "

రజని చెయ్యెత్తి వారిస్తూ, ఎడం చెయ్యి గుండెల మీద వేసుకుని బ్రతికాను అన్నట్టు చూశాడు.

"మైథిలీ" మోహన్ పిలిచాడు.

మైథిలి భద్రమన్నట్టు ఆ గది వైపు ఓ సారి చూసి మళ్ళీ కుట్టుకోసాగింది.

"మైథిలీ కాఫీ....."

ఆమె కుట్టుకుంటూ ఆ గది వైపు చూస్తోందే తప్ప కదలడం లేదు. ఆ రోజు యుద్ధం అయింతర్వాత మైథిలి అతనికి భోజనం పెట్టటం కానీ, బట్టలందించటం కానీ, చివరికి కాఫీ ఇవ్వటం కూడా మానేసింది.

ఇదేమీ తెలియని రజనీ వెళ్ళమని సైగ చేస్తుంటే 'ప్చ్' అని నాలుక చప్పరించి కూర్చున్న చోటు నుండి అంగుళమైనా కదల్లేదు.

"అబ్బబ్బా, మైథిలీ...." మోహన్ కేకలు వేస్తున్నాడు. "నా పైజమా, లాల్చీ ఏవి ఎక్కడ పెట్టావు?"

రజని చప్పున లేచి మైథిలి చేతిలో బట్టలు లాక్కుని కుర్చీలో పడేశాడు.

మైథిలి బుంగమూతి పెట్టి లేచింది గుమ్మంలో నిలబడిన మోహన్ చూశాడులా ఉంది మీ మైథిలితో నేను కాబట్టి ఎలాగో మేనేజ్ చేస్తున్నాను. ఇంకోళ్ళయితే ఎప్పుడో సన్యాసం పుచ్చుకునే వాడు" అని నవ్వాడు.

మైథిలి వెనక్కి తిరిగి "ఆయన నాటకాలు వేస్తారు అందుకూ ఆ హడావిడి" అంది ద్వంద్వార్థంగా

రజని మనసు బాధగా మూలిగింది మెరుపు తీగెలా తిరిగే మైథిలి ఎలా అయిపోయింది

గదిలో నుండి మోహన్ నవ్వు వదులుతుంటే చిన్నగా వినిపిస్తున్న మైథిలి గొంతు అతను గాఢంగా నిట్టూర్చాడు

బైటికి వచ్చిన మైథిలి రజనీకి ముఖం కూడా చూపకుండా వంట గదిలోకి వెళ్ళిపోయింది వెనకే మోహన్ కూడా వెళ్ళాడు

ఈ లడ్లెక్కడివోయ్

మైథిలి సమాధానం చెప్పలేదు

మా శారదత్తయ్య పంపించిందా నేను తినచ్చా

అబ్బ నోరంతా తియ్యగా ఉంది కారంగా ఏదన్నా పెట్టు కాఫీ ఎలా తాగను

ప్రొద్దుటి కూర ఉన్నట్టుందిగా రెండు ముక్కలు తినేదా

ఇప్పుడు కాఫీ ఇవ్వు ఎక్కడకే అలా పారిపోతావు రెండు నిముషాలయినా నా ఎదురుగా నిలబడలేవా? అసలు ఎప్పుడూ ఎందుకలా ముభావంగా 'ఉంటావు?

శ్రీకృష్ణుడికి కొంపలో ఉన్న అష్ట భార్యలు చాలే్లదని ఇంకో పదహారు వేల మంది భామలను కట్టుకున్నాట్ట ఆయనకి మాత్రం పూజలు పునస్కారాలున్ను. మేం ఎవరితోనైనా సర్దాగా మాట్లాడితే తిట్లూ దీవెనలు '

అరే ఒక్క నిముషం నిలబడవే మైథిలీ నేనేమీ శ్రీకృష్ణుణ్ని కాదులే ఏదో కృష్ణమోహన్ అని పేరు పెట్టారు కదాని

విసురుగా బైటికి వచ్చింది మైథిలి ఆ వెనకే తాపీగా ఈల వేస్తూ మోహన్ వచ్చాడు

మైథిలి ముఖంలో ఎటువంటి భావం లేదు

రజనీకాంత్ విస్తుపోయాడు చేతిలో ఉన్న పుస్తకం పేజలు తిరగేస్తున్నా అతని మనసు, చెవులు వాళ్ళ సంభాషణలు ఆలకిస్తూనే ఉన్నాయి ఎంతసేపు మోహన్ కంఠమే తప్ప, మైథిలి కంఠం అసలు వినిపించలేదు

జవాబు కూడా చెప్పని స్టేజికి వచ్చిందంటే ఆ అమాయకప్పిల్ల ఎంత బాధపడి ఉండాలి

సారీ మిస్టర్ రజనీకాంత్ నాకు నాటకం రిహార్సిల్స్ ఉన్నాయి వస్తాను క్షమాపణలు చెప్పి వెళ్ళిపోయాడు

ప్రేమలేఖలు చదువుతున్నావా మైథిలి అతని చేతిలోని పుస్తకం చూస్తూ అడిగింది

ఊహూ! చూస్తున్నాను

ఆ ప్రేమలేఖలు చదువుతుంటే చలం నాకే రాశాడు అనిపిస్తోంది

రజనీకాంత్ నవ్వాడు ఇక నేనూ వస్తాను '

కూర్చో రజనీ మైథిలి అభ్యర్థనగా చూస్తూ వెనక్కి వాలింది 'ఇది వరకు ఎన్ని కబుర్లు చెప్పేవాడివి అంత మౌనంగా ఎలా ఉండగలుగుతున్నావు రజని అంది

అప్పుడంటే చిన్నదానివి పైగా యిప్పుడు నువ్వు

ఊ! ఆ రోజు మూడు సంవత్సరాలే ఈ రోజూ మూడు సంవత్సరాలే తేడా నీకూ నాకూ "

రజనీకాంత్ నవ్వాడు మాట మారుస్తూ మీ ఆయన నాటకాలు కూడా వేస్తాడా ' అన్నాడు

స్టేజీ మీదే కాదు జీవితంలో కూడా

నీ మాటలు నాకు అర్థం కావట్లేదు "

కావాలని నేనూ అనుకోవటం లేదు '

నువ్వు నా కన్నా చిన్నదానివి ఇంత పెద్ద పెద్ద మాటలు మాట్లాడటం ఎప్పుడు నేర్చుకున్నావు ఆశ్చర్యంగా అన్నాడు

పెళ్ళయిన అమ్మాయిలకి పెద్దరికం వస్తుంది నీలాంటి వాడు పెళ్ళయినా వొట్టి ముద్ద పప్పే ' నవ్వింది .

రజనీ కూడా నవ్వేడు మైథిలి అతన్ని అప్పుడప్పుడు 'ముద్దపప్పు' అని వెక్కిరించటం మామూలే

ఎంత పెద్ద విందు భోజనాల్లో కూడా ముద్దపప్పు తప్పకుండా ఉంటుంది తెలుసా" రజని నవ్వుతూ అన్నాడు

మైథిలి అందంగా నవ్వింది దానికా ప్రత్యేకత ఉంది కాబట్టే నీకాపేరు పెట్టాను

ఇద్దరూ నవ్వుకున్నారు

అస్తమిస్తున్న సూర్యుని ఆఖరి కిరణం ఒకటి రజనీ మీద ఏటవాలుగా పడుతోంది ఫాను గాలికి నుదుటిమీదకి జారిన క్రాఫ్ సన్నగా కదులుతోంది

మైథిలి గాఢంగా నిట్టూర్చింది ఆ నిట్టూర్పుకి తలెత్తిన రజని మైథిలి వైపు చూసి కనుబొమ్మలు

# క్రీడారంగం క్విజ్ (6)

(1) మహిళల టెస్ట్ క్రికెట్‌లో ఒక ఇన్నింగ్స్‌లో అత్యధిక వ్యక్తిగత స్కోరు ఎవరు సాధించారు?

(2) బంతి ఉపయోగించి ఆడే ఆటల్లో (బాల్ గేమ్స్) అత్యంత వేగమైన ఆట ఏది?

(3) ఒలింపిక్స్‌లో వాలీబాల్ ఎప్పుడు ప్రవేశపెట్టబడింది?

(4) ప్రస్తుతం జరుగుతున్న ఆస్ట్రేలియా, వెస్టిండీస్ సిరీస్‌లో వాల్ష్ మెర్వ్ హ్యూజ్‌లకు 'హ్యాట్రిక్'లు లభించాయి. వారిలో మెర్వ్ హ్యూజ్ ఎవరెవరిని అవుట్ చేశాడు?

(5) 'ఆల్ రౌండ్‌వ్యూ' అనే పుస్తకం రచించినదెవరు?

(6) వన్డే క్రికెట్ పోటీలో "అబ్‌స్ట్రక్టింగ్ ది ఫీల్డ్" అవుటయిన బ్యాట్స్‌మన్ ఎవరు?

(7) "ప్రొఫెషనల్ టెన్నిస్ టైటిల్" గెలిచిన మొట్ట మొదటి రష్యన్ మహిళ ఎవరు?

(8) ఫస్ట్ క్లాస్ క్రికెట్ మ్యాచ్‌లో ఇద్దరు బ్యాట్స్‌మెన్‌లు ఒకే ఇన్నింగ్స్‌లో ట్రిపుల్ సెంచరీ సాధించి ప్రపంచ రికార్డు సృష్టించారు? వారిద్దరెవరు?

(9) ఈ సంవత్సరం ఆస్ట్రేలియన్ ఓపెన్‌లో డబుల్స్ టైటిల్ స్త్రీల విభాగంలో ఎవరికి లభించింది?

(10) 'బాడీలైన్' అనే క్రికెట్ టి. వి. సీరియల్‌లో 'డాన్ బ్రాడ్‌మన్' పాత్రధారి ఎవరు?

(జవాబులు ఈ సంచికలోనే . .)

—జై

# శ్రీదేవి రేటు 30 లక్షలా!



హిందీ చలన చిత్ర రంగంలో కేవలం అలంకార ప్రాయమేననుకొన్న మహిళా శకం ముగిసింది. నేడు ఆ రంగంలో అన్ని విషయాల్లోనూ పురుషుల కంటే మహిళాధిక్యతే ఎక్కువగా చోటు చేసుకుంటున్నది. (ఇది కొత్తేమీ కాదు.... 1960 ప్రాంతంలో మీనాకుమారి, మధుబాల, నర్గీస్, నూతన్ వంటి నటీమణులు చిత్రరంగాన్ని ఏకి నారనే చెప్పాలి.)

నేటి మేటి అగ్రనటిగా వెలుగొందుతున్న శ్రీదేవి విషయానికొస్తే ఆమె హీరోల కంటే కూడా ఎక్కువ మొత్తాన్ని... అంటే ఒక్క చిత్రానికి 30 లక్షల రూపాయలు... డిమాండు చేస్తున్నదట. కాని బాక్సాఫీస్ విజయం పొందుతున్న అనేక చిత్రాల భారం పూర్తిగా డింపుల్ కపాడియా భుజస్కంధాల పైనే వుందంటున్నారు అనేక మంది.

ఇటీవల అనేక చిత్రాలు ఫ్లాప్ అయి యిమేజ్ కోల్పోతున్న అమితాబ్‌బచ్చన్ తన స్థానాన్ని పదిలం చేసుకొనేందుకు నానా తంటాలు పడుతున్నాడు. ఆ ప్రయత్నంలో భాగంగానే రమేష్‌సిప్పీ నిర్మించే 'రామ్‌కి సీతా'– శ్యామ్‌కి గీతా చిత్రంలో శ్రీదేవిని బుక్ చేయించాడట

'అమితాబ్ చిత్రంలో హీరోయిన్‌కు అంత ప్రాముఖ్యం వుండదని, ఆ విధంగా నిరుపయోగంగా వుండే పాత్రలు నాకిష్టం లేదని, అందుకే అమితాబ్‌తో కలిసి నటించేది లేదని' యిటీవల బహిరంగంగా ప్రకటించిన శ్రీదేవిని కాళ్లావేళ్లా బడి ఒప్పించాడట అమితాబ్. అమితాబ్ మీద



సానుభూతో... ఏమో కాని తన రేటును 21 లక్షలకు తగ్గించుకుని మరీ ఒప్పుకున్నదట శ్రీదేవి. నిజానికి ఆ రేటు తగ్గించుకోవటానికి కారణం బచ్చన్ భవిష్యత్‌ను తీర్చి దిద్దాలన్న తాపత్రయమేనట. (గతంలో రాజేష్‌ఖన్నాను ఆదుకొనేందుకు హేమమాలిని "ప్రేమ్‌నగర్" చిత్రాన్ని ఒప్పుకున్నట్టు....!)

శ్రీదేవిని బుక్ చేసే ముందు నిర్మాతలు 10 లక్షల



రూపాయలు యిస్తామని డింపుల్‌ను అడిగారట. కాని అమ్మె 11 లక్షలు కోరిందట. చివరికి అదృష్టం శ్రీదేవినే వరించింది.

'నాగిన్' చిత్రం విజయవంతమయి శ్రీదేవికి మంచి పేరు రావటంతో ఆ చిత్ర నిర్మాత హర్మేష్ మల్హోత్రా 'నిగాహెన్' చిత్రాన్ని తలపెట్టారట. నాగిన్‌లో హీరో రిషికపూర్ కంటే ఎక్కువే గుంజుతున్నప్పటికీ శ్రీదేవినే నిర్మాత బుక్ చేసి రిషి బదులు సన్నీడియోల్‌ను ఎంపిక చేశారట.

అగ్రనటులైన ధర్మేంద్ర, శత్రుఘ్నసిన్హా (రు. 25 లక్షలు), జితేంద్ర (20 లక్షలు), సన్నీడియోల్ (రు. 18 లక్షలు) లు శ్రీదేవి రేటును అధిగమించలేక వెనుకబడే వున్నారట.

తెలుగు చిత్రరంగం నుంచి శ్రీదేవితో పాటే వెళ్ళిన జయప్రద, ఆఖరికి డింపుల్‌కపాడియాలు కూడా కేవలం 18 లక్షలు రూపాయలే పుచ్చుకుంటున్నారట. మరి శ్రీదేవికెందుకో యింత రేటు.... అంటే... అది అంతే.... నంటున్నారు సినీ ప్రముఖులు.

ఏదేమైనా పురుషాధిక్యత గల ఈ హిందీ చలనచిత్ర పరిశ్రమలో మహిళల అధిక్యత కొనసాగదంటున్నది మీనాక్షిశేషాద్రి!

– తిలక్

ముడివేశాడు

"ఈ రోజు నువ్విలా వచ్చినందుకు నాకెంత సంతోషంగా ఉందో తెలుసా రజనీ. ఈ మధ్యకాలంలో ఎప్పుడూ ఇంత ఆనందం కలగలేదు ఎందుకూ అంటే ఏం చెప్పను? ఎలా చెప్పను?

ఏదో దిగులు రజనీ. దాన్ని ఎదుర్కోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. పెళ్ళి కాక ముందు ఎంత హాయిగా ఉండేదాన్ని. దిగులంటే ఎలా ఉంటుందో తెలిసేది కాదు. అమ్మకాని అమ్మ చేతిలో అపురూపంగా, గారంగా పెరిగాను. తమ్ముడితో చిన్నపిల్లలా ఆడాను. నాన్న దగ్గర భయభక్తులతో తిరిగాను. కానీ యిప్పుడు కీకారణ్యంలో చిక్కుకు పోయిన....."

"మైథిలీ"

కిటికీ గుండా శూన్యంలోకి చూస్తూ ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్టు మాట్లాడుతున్న మైథిలి ఉలికి పడి ఈ లోకంలోకి వచ్చింది.

మైథిలీ. బి బోల్డ్. లేనిపోని ఆలోచనలు చేసి ఆరోగ్యం పాడు చేసుకోకు. అసలు మైథిలీ

రజనీ" మైథిలీ మధ్యలో నే కట్ చేసింది

నన్ను మధూ అని పిలిచేది ఇద్దరే రజనీ అమ్మా నువ్వు. ఇప్పుడు క్రొత్త సంబోధన చేస్తున్నావేమిటి" అంది.

రజనీకాంత్ నవ్వేస్తూ లేచాడు.

"వస్తాను మధూ" అని చేతులు తుడుచుకుంటూ వచ్చిన సుగుణమ్మ గారికి చెప్పి బైటికి వచ్చాడు. మైథిలి గుమ్మంలో నిలబడి "సెలవులకి వచ్చినప్పుడు ఒక్కసారైనా కనిపించి వెళ్ళు" అంది.

"ఓ.కే." అని రజనీకాంత్ వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోతున్న అతడిని చూసి ఆమె మనసులో అనుకుంది "భయకంపితమైన చీకటి ముంగిలిలో ఉదయించే సుప్రభాత కిరణం లాంటి నీ చెలిమి కోసం జీవితాంతం యిలా నిరీక్షిస్తూనే ఉంటాను నేస్తం."

* * * *

ఉదయం వేళ!

మైథిలి తులసి కోట ముందు ముగ్గు వేస్తున్నది వంటగది గుమ్మంలో నిలబడి కాఫీ తాగుతున్నాడు మోహన్. ఉన్నట్టుండి అన్నాడు.

"మా కొలీగ్ ప్రసాద్‌కి వాళ్ళ మామగారు స్కూటర్ ఇచ్చారమ్మా. శ్రీనివాస్ భార్య స్కూటర్ ఫ్రిజ్ అందూ తెచ్చింది. పాతిక వేలు కట్నంతో పాటు

"పెళ్ళి పుట్టాలి దేనికైనా" చిదంబరం జేబులు ఖాళీ అయినట్టున్నాయి. మాటలు జోరుగా వస్తున్నాయి.

"ఆ మాత్రం నేనూ పెళ్ళి పుట్టలేదు వింటున్నావా మైథిలీ మీ నాన్నగారిని అడిగి నా ముచ్చట కూడా తీర్చవోయ్. అసలు అలక పాన్పు మీద పరదాగా

# మైథిలి

స్కూటర్ అడిగాను అది ఈ రోజు అవసరం అనిపిస్తోంది.

సైకిల్ కంఫర్టబుల్‌గా లేదా "

ఆ మాటల్లో శ్లేష గమనించాడు 'సరే అలాగే అనుకో నెల రోజుల్లోగా నాకు స్కూటర్ కావాలి

అదేదో చాక్లెట్ అడుగుతున్నంత తేలిగ్గా అడుగుతున్న భర్తను ముగ్గు వెయ్యటం ఆపి తెల్లబోయి చూసింది

నేనేం కట్నం కానుకలు కూడ తీసుకోలేదు 'సర్దాగా స్కూటరడిగాను అయినా మీ రజనీ కూడా చెప్పాడు కదుటోయ్ ఇటువంటి చిరుకానుకలు పుచ్చుకుంటే తప్పులేదని

చేతిలో ముగ్గు డబ్బా విసిరి ముఖాన కొట్టాలనిపించింది

భోజనం చేసి ఆఫీసుకి వెళ్ళబోతూ చిదంబరం ఏదో గుర్తుకువచ్చినట్టు వంట యింట్లోకి తొంగిచూసి అమ్మా మైథిలీ మీ నాన్నకి వారం రోజుల నుండి జ్వరం వస్తోందిట. అందుకే పేకాటకు కూడా రావటం లేదని తెలిసింది వెళ్ళి చూసిరా అన్నాడు

ఎంగిళ్ళు తీస్తున్న మైథిలి నిర్ఘాంత పోయింది వారం రోజులై జ్వరం కాస్తున్నా కనీసం కబురయినా రాలేదు

బుక్స్ తీసుకోడానికి వచ్చిన మోహన్ అరె జ్వరమా తప్పకుండా వెళ్ళు మైథిలీ నడిచి ఏం వెడతావులే పెట్లో డబ్బులున్నాయి రిక్షాలో వెళ్ళు పనిలో పని స్కూటర్ విషయం కూడా చెప్పు అని వెళ్ళిపోయాడు

మైథిలి ముఖంలో నెత్తురుచుక్క లేదు తను కూడా వెడతానని చెప్పబోయి కొడుకు మాటలు విని ఆగిపోయిన సుగుణ కోడలి పరిస్థితి గమనించి ఆ కంచాలు తీసి తనే శుభ్రం చేసింది

భోజనంచేసి రిక్షాలో పుట్టింటికి వెళ్ళింది

విమల ముఖమంతా ఆనందం నింపుకుని కూతుర్ని ఆహ్వానించింది రా! రా! మీ నాన్నగారికి జ్వరం నీకోసం ఒకటే కలవరిస్తున్నారు పిలిచినట్టే వచ్చావు

అందుకే కాబోలు వారం రోజుల్నుంచి జ్వరం వస్తున్నా ఇంత వరకూ కబురు చెయ్యలేదు నిష్ఠూరంగా అంది మెట్లెక్కివస్తూ

విమల కూతుర్ని దగ్గరికి తీసుకుని ముద్దు పెట్టుకుంది

అమ్మలూ' ప్రసాదరావు బలహీనంగా పిలిచాడు

వారం రోజులకే చిక్కి శల్యమైన తండ్రిని చూసి మైథిలి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి

కూతురి ఆరోగ్యం గురించి కుశల ప్రశ్నలు వేసి అల్లుడేమంటున్నాడు అంది

స్కూటర్ కావాలంటున్నాడు అనబోయి మింగేసింది

మైథిలి తెచ్చిన పళ్ళు రసం తీసి మైథిలికి ఇచ్చింది

"నాకెందుకమ్మా. నాన్నకివ్వు కోప్పడింది మైథిలి

కడుపుతో ఉన్న పిల్లవు నీకివ్వకుండా మీ నాన్న ఎలా తాగుతారు విమల కసిరింది బత్తాయి వలిచి తొనలు ప్రసాదరావుకి పెట్టింది

విశ్రాంతిగా తల్లి పక్కన పడుకుని శారదత్తయ్య ఏం చేస్తోందో అంది

'ఏం చేస్తుంది ఈ పాటికి హాయిగా నిద్రోతూ ఉంటుంది మధ్యాహ్నం ఆవిడే వస్తుందిలే రాకపోతే అప్పుడే వెడుదువుగాని

అలిసిపోయి ఉందేమో విమల కళ్ళు మూతలు పడిపోయినయి తల్లిమీద చేయి వేసుకుని పడుకున్న మైథిలికి నిద్రరాలేదు ఏదో ఆలోచనలో పడిపోయిన దానిలా తల్లినే చూస్తుండిపోయింది

మూడు గంటలకి నిద్ర లేచిన విమల అయ్యో! నిద్ర పట్టేసింది మధూ' అంటూ వెళ్ళి చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కుని వచ్చింది

ఆకలివెయ్యటం లేదటే

వేస్తోందమ్మా కూరేం చేశావు మైథిలి లేచి వంటయింట్లోకి వచ్చింది

ఈ రోజు మీ నాన్నకి పథ్యంకదా కూరేం చెయ్యలేదు చారు, పప్పు ఉన్నాయి పప్పు లేకపోతే నీ తమ్ముడు ముద్ద ఎత్తడు మరి.

ఊహూ వద్దు ఆవకాయవేస్తావా

ఆవకాయా అమ్మో వద్దుతల్లీ అసలే లేత నెలలు వేడిచేస్తుంది బజ్జీలు వెయ్యనా

మైథిలి తల ఊపటంతో బంగాళా దుంపలు ముందు వేసుకుంది

తల్లి చేతిలోంచి తీసుకుని మైథిలి తరిగింది విమల పిండికలుపుకుని బజ్జీలు వేస్తోంది

మైథిలి వేడివేడివి ఊదుకుంటూ తింటుంటే విమల మందలిస్తూ నలో ఇంకా చిన్నతనం పోలేదే అంది

రజనీ కూడా అదే అన్నాడు

విమల ఒక్క క్షణం కళ్ళెత్తి చూసి మాట మార్చేస్తూ నీకేమైనా తినాలనిపిస్తే చెప్పవే. నేచేసి పంపిస్తాను అంది

ఎందుకమ్మా అత్తయ్యగారు అన్నీ చేసి పెడుతూనే ఉన్నారు ఓ రోజు ఎందుకో




మిరపకాయ బజ్జీతినాలనిపించింది అడగడానికి మొహమాటం వేసింది '

అబ్బాయికి చెప్పకపోయావా'

మైథిలి ముఖంలో నవ్వు ఎగిరిపోయింది

మనిషి ప్రగతికి ప్రబల శత్రువు అసహనమే ఓరిమి ఉంటే పర్వతాలైనా అధిగమించవచ్చు ఇంతకీ నీ కోరిక తీరిందా' విమల నవ్వుతూ అడిగింది

ఊ

నువ్వే అడిగావా

ఊహూ! ఓ రోజు ఆయనే టిఫిన్‌బాక్స్‌లో పట్టుకొచ్చారు ఎంత సిగ్గులేని దాన్నంటే రోజూ రాత్రిపూట అన్నం పెట్టటం మానేశానా ఆ రోజు మిరపకాయ బజ్జీలు తెచ్చి అదీ స్వయంగా నాకిచ్చారని కోపం కూడా మర్చిపోయి అన్నం వడ్డించాను

ఉక్రోషంగా అంటున్న కూతుర్ని చూస్తే విమలకి నవ్వాగలేదు

నీకూ తా నవ్వొస్తోందా మందుకొట్టి వచ్చిందికాక పైగా వెధవడైలాగ్స్ రోజూ ఇలాగే ఏవోటి తెచ్చిపెడతాను, ఎదురుగా కూర్చుని అన్నం పెట్టరాదూ అని ఖర్మ కట్టుకున్నందుకు తప్పదుగా

ఎలా ఉన్నారు అన్నగారూ

ముందు గదిలో పలకరింపు విని అత్తయ్యా' మైథిలి అరిచేసింది గబాల్న లేవబోతున్న కూతుర్ని అలా లేవకూడదని విమల కేకలేసింది

శారదాంబ లోపలికివస్తూ అరె ఎప్పుడు వచ్చావమ్మా కులాసాగా ఉంటోందా ఒంట్లో' అంది

మైథిలి తల ఊపుతూ రజనీ ఉన్నాడా, వెళ్ళిపోయాడా అంది

ఆ నాలుగు రోజులయింది వెళ్ళి అని ఏదో అనుమానంవచ్చినట్టు "వాడు వచ్చాడని నీకెలా తెలుసు అంది

అదేంటత్తయ్యా నువ్వేగా లడ్డూలిచ్చిరమ్మని పంపావు ఓ గంట కూర్చుని వెళ్ళాడు బజ్జీలు ప్లేట్లో పెట్టి ఆవిడ ముందు పెడుతూ అంది

నేను లడ్లు పంపానా ఆవిడ, విమల ముఖాలు చూసుకున్నారు

బ్రహ్మాండంగా ఉన్నాయత్తయ్యా లడ్లు బజ్జీ తింటూ అంది

ఉగాది తర్వాత నేనింతవరకూ లడ్లు చెయ్యలేదు

మైథిలి బిత్తరపోయింది తర్వాత కబుర్లలో పడిపోయారు

సాయంత్రం మురళి స్కూలు నుండి వచ్చేదాకా ఉండి వాడితో కాసేపు కబుర్లు చెప్పి తల్లి యిచ్చిన జాజులు జడలో తురుముకుని, శారదాంబ యిచ్చిన యాపిల్స్ పుచ్చుకుని రిక్షాలో ఇంటికి వస్తుంటే మనసు తేలిగ్గా అనిపించింది రజనీతో సంభాషణ పదేపదే గుర్తుకొచ్చింది (ఇంకా ఉంది)

## మన శాస్త్రవేత్తలు

# ఐన్‌స్టీన్ చేత శభాష్ అనిపించుకున్న సత్యేంద్రుడు!



ప్రముఖ విద్యావేత్త అశుతోష్ ముఖర్జీ కలకత్తాలో విశ్వవిద్యాలయ కళాశాలను వ్యవస్థాపించిన తొలి రోజులలో. సుమారుగా 1916 ప్రాంతంలో. ఆ కళాశాలకు సరైన గ్రంథాలయం కూడా వుండేది కాదు మరి భౌతిక శాస్త్రంలో, గణితంలో బోధకులుగా చేరినవారు సామాన్యులు కారు గొప్ప మేధావులు. ఈనాడు యావత్ ప్రపంచం చేత కొనియాడబడుతున్న విశ్వవిజ్ఞాన మూర్తులు. వారిలో ఒకరు మేఘునాథ్ సాహా కాగా, మరొకరు సత్యేంద్రనాథ్ బోస్

ఆధునిక భౌతిక శాస్త్రం బహుముఖంగా వికసిస్తున్న రోజులవి మాక్స్ ప్లాంక్ క్వాంటమ్ సిద్ధాంతం గురించి ప్రతి ఒక్కరూ చర్చించుకుంటున్న వాతావరణం అది సరిగ్గా అదే సమయంలో అల్బర్ట్ ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతాన్ని కూడా ప్రతిపాదించాడు. పరమాణు రహస్యాలను ఛేదించడానికి అన్ని వైపుల నుంచి రకరకాల పరిశీలనలు , పరిశోధనలు చేబడుతున్న ఆ సమయంలో సాహా, బోస్ వంటి మేధావులు నిమ్మళంగా ఎలా వుండగలరు?

పైగా మొదటి ప్రపంచ యుద్ధం ఇంకా కొనసాగుతున్న కాలమది తాజా సమాచారాలను అందించే పత్రికలు, పుస్తకాలు అందడమే గగనంగా ఉండేది ఎన్ని కళాశాలలు తిరిగినా, ఎన్ని గ్రంథాలయాలను వాకబు చేసినా పాపం సాహా, బోస్‌లకు నిరాశే మిగులుతూ వుండేది. వారి ప్రయత్నాలు వమ్ము కాలేదు జర్మన్ శాస్త్రవేత్త బ్రుహ్ల్‌తో వారికి పరిచయం ఏర్పడింది ఆయన కొన్ని పుస్తకాలను, పరిశోధనా పత్రాలను అందించాడు అయితే ఆ సామగ్రి అంతా జర్మన్ భాషలోనే వుంది ఫలితంగా వారు జర్మన్ నేర్చుకున్నారు వారి పట్టుదల కారణంగా ఆధునిక భౌతిక శాస్త్రం వారి కనుసన్నల్లో మెలగసాగింది ఐన్‌స్టీన్ జర్మన్‌లో వెలువరించిన పరిశోధనా పత్రాలను వీరు ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు సాపేక్షతా సిద్ధాంతం గురించి విద్యార్థులకు బోధించడం కూడా మొదలు పెట్టారు బహుశా ఈ బోధన మన దేశంలో వీరితోనే మొదలేమో!

మేఘునాథ్ సాహా విదేశాలకు వెళ్ళడం, సత్యేంద్రనాథ్ బోస్ ఢాకా విశ్వవిద్యాలయానికి వెళ్ళడం ఇంచుమించుగా ఒకేసారి జరిగింది ఈ మార్పు బోస్ జీవితంలో ఒక సరికొత్త మలుపునే తీసుకొని రాగలిగింది. శాస్త్ర రంగం మరో మెట్టు పైకి వేసింది

సత్యేంద్రనాథ్ బోస్‌కి మాక్స్ ప్లాంక్ వ్రాసిన "థర్మో డైనమిక్ అండ్ వార్మెస్ట్రాహ్లంగ్" (ఉష్ణగతిక శాస్త్రము – ఉష్ణము) అనే జర్మన్ పుస్తకాన్ని ఒక విదేశీ మిత్రుడు అందించాడు ఈయన ఆ పుస్తకాన్ని ఆపోసన పట్టి ఎన్నో సమీకరణాలను తనకు తానుగా సాధించుకున్నాడు. మాక్స్ ప్లాంక్ ప్రతిపాదనల గురించి తీవ్రంగా ఆలోచించసాగాడు మధ్యలో ఒకచోట ప్లాంక్ ఒక పరికల్పనను ఊహించి సమీకరణాన్ని కచ్చితంగా కాకపోయినా దాదాపు కచ్చితానికి చేరువగానే సాధించాడు. అయితే బోస్ ఇలా చేయడాన్ని అంగీకరించలేకపోయాడు ఈ అంశాన్ని మరింత శాస్త్రబద్ధంగా పరిష్కరించడానికి పూనుకున్నాడు ఈ పూనికే సైద్ధాంతిక భౌతిక శాస్త్రంలో సరికొత్త సంచలనానికి కారణభూతమయింది అప్పటికి బోస్ వయస్సు 30 ఏళ్ళు మాత్రమే!

"ప్లాంక్స్‌లా అండ్ లైట్ క్వాంటమ్ హైపాథిసిస్" అనే పరిశోధనా పత్రాన్ని ఎంతో కష్టపడి రూపొందించి ప్రచురణ కోసం దేశ విదేశ పరిశోధనా పత్రికలకు ఈయన పంపితే– దురదృష్టం కొద్దీ ఏ పత్రికా దానిని ప్రచురించలేదు నిరాశతోనే ఈ పరిశోధనా పత్రాన్ని 1924 లో సత్యేంద్రనాథ్ బోస్ విశ్వవిఖ్యాతుడైన అల్బర్ట్ ఐన్‌స్టీన్‌కి పంపాడు ఈపరిశోధనా పత్రం ఐన్‌స్టీన్‌ని ఎంతగానో ఆకట్టుకుంది ఆయనే పని కట్టుకుని ఈ పత్రాన్ని జర్మన్‌లోకి అనువదించి ఒక ప్రముఖ పరిశోధనా పత్రికలో ప్రచురింప జేశాడు అంతే కాదు "అతిముఖ్యమైన ప్రగతిశీలక శాస్త్రీయ పరిశోధన" అనే కితాబు కూడా బోస్‌కి ఇచ్చాడు ఈ ప్రోత్సాహమే బోస్‌కి మరింత బలాన్ని అందించింది దీని ఫలితంగానే రశ్మ్యుద్గారత (రేడియో ఏక్టివిటీ) ప్రవర్తన గురించి, ప్రభావాన్ని గురించి వివరించడానికి "బోస్ స్టాటిస్టిక్స్" రంగంలోకి వచ్చింది. ప్రాథమిక శకలాలైన ఫోటాన్‌లు, ఆల్ఫా కణాలు వంటివి ఏవైనా సరే "బోస్ స్టాటిస్టిక్స్"ను పాటిస్తాయి. అందుచేతే వాటిని "బోసాన్స్" అని పిలుస్తున్నారు. ఇలాగ బోస్ పేరు శాశ్వతంగా నిలిచిపోయింది

సత్యేంద్రనాథ్‌బోస్ జనవరి 1, 1894న జన్మించాడు. ఈయన – పియరి సైమన్ లాప్లేస్, అగస్టిన్ లూయిస్‌క్యాచీ – అంతటి గణితవేత్త కాగలడని చిన్ననాటే ఉపాధ్యాయులు చెప్పేవారు. బోస్ ప్రదర్శిస్తున్న అసాధారణమైన ప్రతిభను చూచి 100 మార్కులకు 110 మార్కులు ఇచ్చేవారట ఆ అయ్యవార్లు! బోస్‌ను చూసి భయపడేవారట కూడా!

అయితే ఈయన ప్రతిభకు తగిన గుర్తింపు అంతర్జాతీయ స్థాయిలో లభ్యం కాలేదనే చెప్పాలి. "బోస్ స్టాటిస్టిక్స్" విలువను గుర్తించి కూడా ఈయనను "ఫెలో ఆఫ్ రాయల్ సొసైటీ"గా ఎన్నుకోవడానికి నిపుణులు చాలా ఆలస్యం చేశారు కొన్ని పర్యాయాలు ఈయన తన పరిశోధనా పత్రం విలువను పత్రికల వారికి తెలపడం కోసం ఐన్‌స్టీన్ వంటి ప్రముఖులచేత యోగ్యతా పత్రాలను జతచేసేవాడు కూడా "ఒక భారతీయుడు ఊహాతీతమైన పరిశోధనలు చేయడమా?" అనే తేలిక భావం అప్పట్లో ఎంతగా కమ్ముకొని ఉన్నప్పటికీ– బోస్ ప్రతిభను ఎవరూ మరుగుపరచలేకపోయారు

సైన్స్‌ను పాప్యులర్ చేయవలసిన అవసరాన్ని మొదటి సారిగా గుర్తించినవాడు సత్యేంద్రనాథ్ బోస్ బెంగాలీలో పాప్యులర్ సెన్స్ మేగజైన్‌ను కూడా వ్యవస్థాపించాడు ఎక్స్–రే, క్రిస్టలోగ్రఫీ మీద, థర్మోలు మినిసెన్స్ మీద ఈయన వెలువరించిన పరిశీలనలు ఎంతో మందికి మార్గదర్శకమయ్యాయి ఈయన ఉత్పత్తి చేసిన రసాయనికం ఒకటి ఇప్పటికీ కంటి మందుగా వాడబడుతూనే వుంది

1974 మొదట్లో కలకత్తాలో– "బోస్ స్టాటిస్టిక్స్" వెలువడి పాతికేళ్ళు గడిచినందుకు – గోల్డెన్ జూబ్లీ ఉత్సవం జరిపి – అంతర్జాతీయ శాస్త్ర సదస్సును జరిపారు. ఇది ఒక శాస్త్రజ్ఞుడికి అరుదైన గౌరవ పురస్కారం. ఈ పురస్కారాన్ని కళ్ళారా చూచిన ఒక నెల రోజులకే ఫిబ్రవరి 4, 1974న సత్యేంద్రనాథ్ బోస్ భౌతికంగా కనుమరుగైపోయారు కాని ఆయన పరిశోధనలు, అవి అందిస్తున్న ఫలితాలు మాత్రం ఎప్పటికైనా నిలిచిపోతాయి

– డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

# సినిమా... సినిమా... జి.వి.జి.



"సూత్రధారులు"లో అక్కినేని

## "పల్నాటి రుద్రయ్య" సుమన్

"వెరైటీ కోసం సుమన్‌కు ఈ చిత్రంలో కామెడీ ట్రాక్ కూడా ఉంటుంది. ఫిబ్రవరి నుంచి మే వరకు ప్రతి నెలా 20 నుంచి 30 వరకు షెడ్యూల్స్. ఐదు పాటలలో మూడింటిని కాశ్మీర్‌లో చిత్రీకరిస్తాం", అన్నారు బి. ఎల్. వి. ప్రసాద్. ఈయన దర్శకత్వంలో టి. ఆర్. తులసి నిర్మించే అన్నపూర్ణ సినీచిత్ర వారి "పల్నాటి రుద్రయ్య" చిత్రంలో సుమన్, విజయశాంతి, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, చలపతిరావు, సత్యనారాయణ, కె. ఆర్. విజయ తారాగణం. వేటూరి గీతాలను రాజ్‌కోటి స్వరపరిచారు. కబీర్‌లాల్ ఛాయ, శివశంకర్ నృత్యాలు, విజయన్ సాహసాలు, కె. రంగారావు సంయుక్త దర్శకత్వం,భాస్కర్- సత్యనారాయణ సహకార దర్శకత్వం, దోనేపూడి ప్రసాద్-రాజేంద్రప్రసాద్ ప్రొడక్షన్, మురళీరామయ్య- రామచంద్ర ప్రసాద్ కూర్పుతో ఈ చిత్రాన్ని సమర్పించే కాట్రగడ్డ ప్రసాద్ "క్లయిమాక్స్‌ను కుద్రేముఖ్‌లో పిక్చరైజ్ చేస్తాం. జూన్ విడుదల", అన్నారు.

## రమేష్ "బ్లాక్ టైగర్"

"నా దర్శకత్వంలో రమేష్‌బాబు, భానుప్రియ తొలిసారిగా నటిస్తున్న చిత్రమిది", అన్నారు దాసరి నారాయణరావు. ఈయన స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో హీరో కృష్ణ సమర్పించే పద్మాలయా స్టూడియోస్ (ప్రై) లిమిటెడ్ వారి "బ్లాక్ టైగర్" చిత్రంలో మోహన్‌బాబు, శివకృష్ణ, చరణ్‌రాజ్, ప్రదీప్‌శక్తి, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, డాక్టర్ ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, గోకిన రామారావు, మాగంటి సుధాకర్, శ్రీహరి, గీత, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు. రాజ్‌కోటి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, విజయన్ సాహసాలు, ఉప్పలపాటి సత్యనారాయణ సంయుక్త దర్శకత్వం, తార నృత్యాలు, సత్యనారాయణరాజు ప్రొడక్షన్, జి. హనుమంతరావు నిర్వహణతో జి. ఆదిశేషగిరిరావు నిర్మాత.

"మనిషి" లో

## తాతయ్య పెళ్లి- మనవడి శోభనం

"సత్యనారాయణ 'తాతయ్య', సుధాకర్ 'మనవడు'. వినోద ప్రధాన ఇతివృత్తం, ఫిబ్రవరి 9 నుంచి ఏప్రిల్ 3 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు సాహితి. ఈయన కథ, పాటలు, దర్శకత్వంలో ఎ. ఎస్. సూకరాజు నిర్మించే శశాంక ఆర్ట్సు "తాతయ్య పెళ్లి- మనవడి శోభనం" చిత్రంలో గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, వేలు, హరిప్రసాద్, జగ్గారావు, నళినీకాంత్, కె. కె. శర్మ, రాజారెడ్డి, చిట్టిబాబు, జగన్ పాత్రధారులు. భరత్‌కుమార్ మాటలు, రాజ్‌కోటి సంగీతం, సాయికుమార్ ఛాయ, కళాధర్ శిల్పం, సుందరం- శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, శక్తిస్వరూప్ సహకార దర్శకత్వం, మూర్తి- సతీష్- బాలు ప్రొడక్షన్, రాజేంద్ర కూర్పుతో ఎస్. ఎ నాయుడు సమర్పణ.

## విశ్వనాథ్ సృష్టి సూత్రధారులు

"దుర్మార్గుడ్ని చంపడం కంటే దుర్మార్గాన్ని సమాజంలో సమూలంగా పెరికి వేయడానికిసూత్రధారులుగా ఈ చిత్రంలోని సూత్రధారుల పాత్రలు ఉపకరిస్తాయేమో! ఎక్కువ భాగం తూర్పు గోదావరి జిల్లా దేవీపట్నం, రాజమండ్రి పరిసరాలలో షూట్ చేశాం. రాజమండ్రి ప్రాంతాలలోనే ఫిబ్రవరి 1నుండి మార్చి 20 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది.' అన్నారు కళాతపస్వి' కె. విశ్వనాథ్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. వి. కె. రెడ్డిసమర్పించే సుదర్శన్ సినీ ఎంటర్ ప్రైసెస్ "సూత్రధారులు" చిత్రంలో ఎ. ఎన్. ఆర్, మురళీమోహన్, భానుచందర్, సత్యనారాయణ, కె. ఆర్. విజయ, సుజాత, రమ్యకృష్ణ, శ్రీలక్ష్మి, సాక్షి రంగారావు, కె. ఎస్. టి. సాయి, మురళీకృష్ణ, కృష్ణకుమార్, అశోక్‌కుమార్, వరహాలరావు, విశ్వనాధశర్మ, కోట శంకరరావు, తాతాజీ నటవర్గం. ఎం. వి. ఎస్. హరనాధరావు సంభాషణల కర్త. కె. వి. మహాదేవన్ స్వరకల్పనలో సి: నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి, నాగఫణిశర్మ గీతాలు రాశారు. మధు అంబట్ ఛాయ, అరుణ్ డి. గొడగాల్కర్ శిల్పం, కె. వి. సత్యనారాయణ నృత్యాలు, నందూరి విజయ్ సంయుక్త దర్శకత్వం, దాసం సాయినాగప్రసాద్- లక్ష్మణరావు- కె. రవి ప్రకాష్ సహకార దర్శకత్వం, గురుదేవ్ నిర్మాణత, మహందాత ప్రొడక్షన్, జి. జి. కృష్ణారావు కూర్పుతో మల్లికార్జునరావు, ఎల్. సి. నాగరాజు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్. సుధాకర్, కరుణాకర్ నిర్మాతలు. ●



"సుమంగళి" లో శాంతిప్రియ.

## వినూత్న శీర్షిక



# భలే కవలలు



మా కవలలు బాబు, పాప. పాప పేరు బిందు మాధవి, బాబు పేరు విజయ సారథి. మా పిల్లలకి ఎన్నో పోలికలు, అలాగే ఎన్నో తేడాలు వున్నాయి.

పుట్టిన వెంటనే వాళ్ళని ఒకే ట్రేలో పడుకో బెట్టేరు నేను లేచి చూసేసరికి బాబు మా పాప వేలు నోట్లో చప్పరిస్తూ కనబడేసరికి ఎంతో తమాషాగా అనిపించింది 7వ నెలలో నా చేతిలో పాలసీసా చూసేసరికి ఎక్కడ పాకుతున్న వాళ్ళు అక్కడే పడుకునే వాళ్ళు అది ఎంతో తమాషాగా వుండేది ఒక్కోసారి వుత్తి సీసాని పట్టుకుని తిరిగినా అలాగే చేసేవాళ్ళు

వీళ్ళిద్దరికి ప్రతి విద్య– అంటే పాకడం, కూర్చోవడం నడవడం పళ్ళు రావడం– 15 రో తేడాలో వచ్చేవి ఇప్పటికి 8 ఏళ్ళ వాళ్ళయినా వాళ్ళ బరువు యిప్పటి వరకు ఎప్పుడూ సమంగానే వుంది

## రైట్ రైట్

స్కూల్లో టీచర్ డిక్టేషన్ చెప్తూ రైట్ అనేదిట మేము వ్రాయటుండానే మా టీచర్ రైట్, రైట్ అంటుందేమిటమ్మా అంటూ అమాయకంగా వాళ్ళు అడుగుతుంటే రైట్ అంటే గుడ్ అని, రైట్ అంటే వ్రాయు అని తేడా వివరించి చెప్పాల్సి వచ్చింది

సయామీస్ ట్విన్స్ గురించి పుస్తకాల్లో ఫోటోలు చూపించి నేను చెప్తుంటే మరి మేము అలా పుట్టలేదా? అని అడిగి కాస్సేపటికి యిద్దరూ ఓ తాడుతో ఒకరి కుడి చెయ్యి యింకొకరి ఎడమ చేతికి కలిపి కట్టేసుకుని మేము సయామీస్ ట్విన్స్ లాగానే కలిసి పోయాము అని ఒక పూటంతా అలాగే వున్నారు

మా వాళ్ళు ఒక్కక్షణం కూడ ఒకళ్ళని విడిచి ఒకళ్ళు వుండరు అలా అని దెబ్బలాడు కోకుండా వుండరు పెన్సిల్ కోసమో రబ్బర్ కోసమో డైనింగ్ టేబిల్ దగ్గిర ఒకే కుర్చీ కోసమో! మాధవికి తలంటు ఎంతో యిష్టం అదే సారథినైతే తలంటు కోసం మంచాల కిందో కుర్చీల వెనకో వెతుక్కో వలసిందే!

స్కూలుకి టైము అవుతోంది తొందరగా బొట్టు పెట్టుకుని తయారవ్వండి అని నేను యధాలాపంగా అంటే మా వాడు కూడ బొట్టు పెట్టేసుకునే వాడు స్టిక్కర్ పెట్టుకోవడం మహా సరదా! నేను ముగ్గులు వేస్తుంటే వెంటనే వాడూ ట్రై చేస్తాడు

ఇప్పటివరకు మా పిల్లల మార్కులు 1 2 కంటే తేడా రాలేదు ఒక సబ్జెక్టులో ఒకరు ఫస్ట్ అయితే మరో సబ్జెక్టులో మరొకరు డ్రాయింగ్‌లోను మెమరీ కాంపిటీషన్ లోనూ వీళ్ళకి ప్రైజులు వచ్చేయి ఇప్పుడు మా పిల్లలు వైజాగ్ సెంట్రల్ స్కూల్లో 3వ క్లాసు చదువుతున్నారు




భోజనం విషయంలో చాలమటుకు ఒకేలా వుంటారు కానీ వంకాయంటే మాధవికి అస్సలు నచ్చదు వాడికి ఎంతో యిష్టం వంకాయ చేసిన రోజు వాళ్ళ మొహాల్లో ఆ తేడా స్పష్టంగా మేము గమనిస్తాము

వీళ్ళు– స్కూల్లో టీచర్ యిచ్చిన డిక్టేషన్‌లో స్పెల్లింగులు తప్పుగా వ్రాసినది కూడ యిద్దరూ ఒకే తప్పు స్పెల్లింగ్ వ్రాయడం నా కెంతో విచిత్రంగా వుండేది ఉదా –Apirl Octomber అని ఒక్కలాగే రాశారు

ఇద్దరూ ఒకేసారి పుట్టడం వలన మొదటి రెండేళ్ళు తిండి నిద్ర కూడ సరిగ్గా లేకుండ ఎంతో కష్టపడ్డప్పటికీ వాళ్ళకి ఐదేళ్ళు వచ్చిన దగ్గిర్నించి ఎంతో సుఖంగా వుంది వాళ్ళ పనులన్నీ యిప్పుడు వాళ్ళు చేసుకుంటున్నారు ఇద్దరికీ ఒకేసారి చదువు చెప్పడం, హోమ్‌వర్క్ చేయించడం ఎంతో ఆనందంగా వుంటుంది నాకు!

– ఇందుర్తి సీతాదేవి

# స్వయంకృషి

పినిశెట్టి శ్రీనివాసరావు

''అబ్బబ్బ!... ఏం ఎండో... ఏం ఎండో... వస్తువుల ధరల్లా మండి పోతుంటేనూ...'' అనుకుంటూ అప్పుడే వీధిలోంచి ఇంట్లోకొచ్చారు రామయ్యగారు. గొడుగు మడిచి ప్రక్కనపెట్టి, చెప్పులు గది మూల విడిచిపెట్టి 'ఈజీచైర్'లో కూర్చున్నారు.



''హు ఫాను లేదు కాబోలు ఎలా వుంటుంది? కరెంటు ఉండి ఏడిస్తేగా? అన్నిటికి కట్లే ఈ రోజుల్లో అలాగే 'ఇన్నేళ్ళు దాటితే బ్రతికుండ కూడదు'- అని కూడా ఓ బిల్లు పాస్ చేసి పారేస్తే పీడ వదిలి పోతుంది జననాల మీద పొదుపు, పెట్టినట్లు, మనిషి ఆయుర్దాయం మీద కూడా కట్ పెట్టి పారేస్తే ఈ వయసులో బాధలైనా తప్పుతాయి జనాబా తగ్గుతుంది అప్పుడైనా- ఉన్న వాళ్ళైనా కాస్త సుఖపడుతారు ఇలాంటి శాసనాలు చెయ్యాలంటే మన వాళ్లే చేయాలి మిగిలిన ముఖ్య మంత్రులకి అంత గట్టి గుండె లేదు ''

''ఇదిగోండి దీనికోసమేగా మీ గోల,'' అంటూ విసనకర్ర తెచ్చి అందించింది జానకమ్మ

''హమ్మయ్య నువ్వొక్కదానివేయ్ నా అవసరాల్ని 'అర్థం చేసుకున్నదానివి ' అన్నారు రామయ్యగారు

''ఆ ఆ ఇక పొగడ్తలు ఆపండి మీ నెక్స్ట్ అవసరం కూడ అర్థం చేసుకున్నాను పాలు పొయ్యిమీద పెట్టాను కాఫీ క్షణంలో తెస్తాను '' అంది జానకమ్మ నవ్వుతూ

''చూశావా చూశావా నేనన్నానంటే అన్నానంటావ్ నాకు ఇప్పుడు కాఫీ అవసరం అని నేను 'చెప్పకుండా'నే పసిగట్టేశావ్'' అన్నారు రామయ్యగారు

కాఫీ తీసుకు రావటానికి వంటగదిలోక వెళ్ళిపోయింది జానకమ్మ

రామయ్యగారికి ఇంత వయసొచ్చినా కాం అలవాటు పోలేదు రోజుకు కనీసం నాలుగైదు సార్లన్నా కాఫీ పడకపోతే ఉండలేదు ఆయన అంతకు మించి మరే అలవాట్లులేవు·

గవర్నమెంటు ఉద్యోగం నుంచి రెండేళ్ల క్రితమే రిటైరైన రామయ్యగారికి ఇద్దరే సంతానం ఇద్దరూ మగపల్లలే పెళ్ళిళ్ళు చేసుకుని, ఉద్యోగాల్లో స్థిరపడ్డారు

పెద్దకొడుకు శ్రీకాంత్ విశాఖపట్నంలో ఓ ప్రైవేటు

కంపెనీలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు ఇద్దరు పిల్లలు ఎనిమిదేళ్ళ కొడుకు – ఆరేళ్ళ కూతురు

రెండో కొడుకు రవికాంత్ బెంగుళూరులో కంప్యూటర్ ఇంజనీరు ఒక్కడే కొడుకు

కొడుకుల మిద ఆదారపడవల్సిన అవసరం లేకుండా వచ్చే పెన్షన్‌తో, సొంత ఇంట్లో స్వతంత్రంగా ప్రశాంత జీవనాన్ని గడుపుతున్నారు ఆవృద్ధజంట ధైవానుగ్రహం వల్ల ఇద్దరిదీ మంచి ఆరోగ్యమే ఏదో ఎప్పుడైనా స్వల్పమైన అస్వస్థత తప్పనిస్తే మరే దీర్ఘరోగాలు లేవు బగవంతుడి దయవలన సంవత్సరానికోసారి పెద్దకొడుకు, చిన్నకొడుకు భార్యా పిల్లలో వచ్చి పోతుంటారు సెలవుమీద అలా వచ్చినప్పుడల్లా కొడుకులు, ఏదైనా ఇవ్వబోతే, నాకెందుకురా ఇంకెవరున్నారని మాకు మీ అమ్మకు నేను– నాకు మీ అమ్మ తప్ప? మీ దగ్గరే ఉంచండి ఖర్చులుంటాయి', అంటూ తోసిపుచ్చేవారు పిల్లలు వెళ్ళి పోతున్నప్పుడు మనవల చేతిలో పాతికో– ఏభైయో పెట్టి చాక్లెట్లు కొనుక్కోండర్రా, అంటూ ఆయనే తిరిగి ఇస్తుండేవారు అందుకే తాతయ్యంటే మనవలకు 'కాడ్‌బరీస్' చాక్లెట్లంత ఇష్టం పిల్లలొచ్చినప్పుడల్లా, సున్నుండలు– రవ్వలడ్లు చేసి పెట్టే నానమ్మన్నా కూడ. మనవలకు 'క్వాలిటీ ఐస్‌క్రీమ్' అంత ఇష్టమేమరి

ప్రేమించే ఎల్లలు – సంపూర్ణ ఆరోగ్యం– సొంత ఇల్లు– ఒకరిమీద ఆదారపడని స్వతంత్ర జీవితం ఇంతకంటే మరేం కావాలి వాళ్ళకావయసులో

అంతటి అదృష్టం ఎంత మందికి దక్కుతుంది? పూర్వజన్మ సుకృతం అంటే అదే కాబోలు

ఊ ఇదిగోండి మీ కాఫీ, అంటూ పొగలు గక్కుతున్న వేడివేడ కాఫీ గ్లాసుతో అందించింది జానకమ్మ

రామయ్యగారు కాఫీ త్రాగుతుంటే, మళ్ళీ వస్తా వంటగదిలో పనుంది అంటూ అక్కడి



నుంచి వెళ్ళి పోయింది జానకమ్మ

★ ★ ★ ★ ★

పెద్దకొడుకు – కోడలు, మనవలతో ఆరోజు రామయ్య గారి ఇల్లు మహాసందడిగా వుంది జానకమ్మగారు పొయ్యికే అంకితమై పోయారు బజారుకు– ఇంటికి సంచి పట్టుకు తిరిగేస్తున్నారు రామయ్య గారు

"మీరు కూర్చోండి నేను చేస్తాను, అంటూ కోడలు చెప్తున్నా విన్పించుకోటంలేదు అత్తగారు

"మీ కెందుకు నాన్నా శ్రమ నేను వెళ్ళొస్తాగా? అని చెప్తున్నా కొడుకు మాట వినటంలేదు రామయ్యగారు

పిల్లలొచ్చారంటే వాళ్ళకు పండగలాగుంది వయసు– శ్రమ తెలీటంలేదు ఎంతో ఉత్సాహంగా వున్నారు

అందుకే వయసు శరీరానికే కాని మనసుకు కాదన్నారు–

పిల్లలిద్దరూ కేరమ్స్– చైనీస్ చెక్కర్స్ – తాడో ఒక్కటనేమిటి ఒకటి తర్వాత ఒకటి ఆడిపారే స్తున్నారు మధ్యమధ్యలో నానమ్మ చేసిపెట్టిన జంతికలు– అరిసెలు లాగించేస్తున్నారు మధ్యాహ్నం వొంటిగంట దాటినా బోజనాలకు లేవక పోవటంతో రామయ్యగారు ఇక లేవండ్రా అంటూ కర్ర పట్టుకున్నారు తమాషా చేస్తూ

"తాతయ్యకు కోపం వస్తుంది అంటూ పిల్లలు 'బిలబిలమంటూ ఎక్కడి ఆటవస్తువులు అక్కడే వదిలేసి నానమ్మ దగ్గరకు పరుగు పెట్టారు.

అప్పటికే జానకమ్మ పళ్ళాల్లో పిండివంటలు వడ్డించింది బొబ్బట్లు – బూరెలు, గారెలు పులిహోర స్వీటు–హాటులతోనే కడుపునిండి పోయింది పిల్లలకి అన్నం వెయ్యబోతే ఇంకొద్దు నానమ్మా అంటూ చేతులడ్డం పెట్టారు కనీసం సాంబారు అన్నం అయినా తినలేదే అంటూ నొచ్చుకుంది జానకమ్మ

"వాళ్ళ తిండి అంతేలేమ్మా అంటూ సర్ది చెప్పాడు కొడుకు

పిల్లలు తినిలేచాక – పెద్దవాళ్ళు నల్గురూ కూర్చున్నారు బోజనాలకి

పులిహోర– బొబ్బట్లలో నెయ్యి జాస్తిగా వొడ్డించింది జానకమ్మ కోడలు –కొడుక్కి

"ఇలా తింటే వొళ్ళొచ్చేయదంటే", అన్నాడు శ్రీకాంత్ తల్లితో

"వయసులో వున్న పిల్లలు– ఇప్పుడు తినకపోతే మా వయసు వచ్చాక తింటారేంట్రా" అంది జానకమ్మ కొసరి కొసరి వడ్డిస్తూ

భోజనాల కార్యక్రమం ముగిశాక, పిల్లలకోసం రామాయణం 'కేసెట్' వేశారు దాంతో పిల్లలు టీ వి కి అతుక్కుపోయారు

ప్రక్కగదిలో రామయ్యగారు – జానకమ్మగారు పెద్దకొడుకు – కోడలు సమావేశమయ్యారు

చిన్నోడు కూడ వస్తే బాగుండేది అన్నారు జానకమ్మగారు చిన్న కొడుకును తలుచుకుంటూ

ఎప్పుడూ మేము రావటమే సరిపోతుంది మీరు మాత్రం మాదగ్గరకు రాకండి అన్నాడు శ్రీకాంత్ నొచ్చుకుంటున్నట్లుగా

అవునత్తయ్యా మీరు మాదగ్గరకొచ్చి ఒక్క నెర్లో జుల్లైనా వుండకపోతే ఇంక మేము రామంతే, అంది కోడలు

ఎవరొస్తే ఏవిటమ్మా? ఈ వయసులో మేం తిరగటం కంటే, మీరే వచ్చిపోతుండటం సులభం కదా?'

మీకే శ్రమలేకుండా తీసుకెళ్ళి మళ్ళీ తెచ్చి దింపే బాధ్యత మాదత్తయ్యా

వద్దులేమ్మా ఇప్పుడు మాత్రం ఏమైందని ఒకర్నొకరు చూసుకుంటున్నాం – మంచి చెడ్డలు చెప్పుకుంటున్నాం అది చాలదూ

రామయ్యగారు శ్రోతలా వింటున్నారు తప్ప ఏం మాట్లాడటంలేదు ఆయనకు నిద్రొస్తున్నట్లుంది

అది గ్రహించిన శ్రీకాంత్ మీరు పడుకోండి నాన్నా నువ్వు కూడా రెస్టుతీసుకోమ్మా, అంటూ లేచాడు

కోడలు కూడ కొడుకుతో బాటు బైటకు వెళ్ళి

## మీరు కవలలా?

★ మీకు కవల పిల్లలా?

★ ఏవైనా యిద్దరి మధ్య చాలా తమాషా పోలికలు– అలవాట్లు కలయికలు వగైరా వుంటాయి!

★ ఆడా మగా కవల లైతే మరీ విచిత్రంగా వుంటుంది.

★ మీ యిద్దరి ఫొటో పంపండి! అనుభవంలో జరిగిన "తమాషా" వుంటే రాయండి.

ఆంధ్రసచిత్రవారపత్రిక

తో మీ యిద్దరి ఫొటో – వివరం వేస్తాము. మీ ఫొటో – విషయం రెండూ ప్రచురణామోదం కానిపక్షంలో త్రిప్పి పంపగోరువారు తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చేయాలి– పద్య ఫొటో లు త్రిప్పి పంపటం సాధ్యం కాదని మనవి!

– సం.

పోయింది

★ ★ ★ ★ ★

అప్పుడే పిల్లలొచ్చి రెండ్రోజులైంది

ఈ రెండు రోజులు ఎంతో 'సందడిగా – సంతోషంగా గడిచి పోయాయి

పిల్లలు వాళ్ల స్కూలు విషయాలు చెప్పారు తాతగారికి – నానమ్మకి

తాతగారిచేత కథలు చెప్పించుకున్నారు మనవలు

నానమ్మ చేత 'చేగోడీలు' అడిగి చేయించు కున్నాడు మనవడు మనవరాలికిష్టమైన 'గులాబి పూలు' చేసిపెట్టింది నానమ్మ

రామయ్యగారు కొడుకు ఉద్యోగం గురించి ఏవేవో విషయాలు అడిగి తెలుసుకుంటున్నారు

అంతవరకూ బాగానే జరిగిపోయింది

అప్పుడే పేల్చాడు ఓ బాంబులాంటి వార్త శ్రీకాంత్

తన కొడుకుని ఏదైనా రెసిడెన్షియల్ స్కూల్లో వేస్తాడట

ఆ వార్త విన్న రామయ్యగారు ఒక్కసారి సీరియస్ అయిపోయారు మాట్లాడటం మానివేశారు

అదికాదు నాన్నగారూ సెవెన్త్ క్లాస్ – టెన్త్ క్లాస్ రిజల్ట్సు చూస్తే మొదటి ఇరవై రాంకులు రెసిడెన్షియల్ స్కూలు పిల్లలవే అక్కడైతే పిల్లలకు మంచి క్రమశిక్షణ, ధైర్యం, చదువు అబ్బుతాయి ఈ మామూలు స్కూళ్ళల్లో స్టాండర్డ్సు చాలా పడిపోయాయి మీ కోడలు కూడ అదే ఉద్దేశ్యంతోవుంది ఆడపిల్ల ఎలాగూ మాదగ్గరే వుంటుంది మగపిల్లాడు కనుక ఎక్కడున్నా ఫర్వాలేదు మొదట కొంచెం ఖర్చు ఎక్కువే అయినా, ఆ తర్వాత నెలకో ఐదొందలు అవుతుంది మొత్తం వాళ్ళే చూసుకుంటారు మూడ్నెల్లక ఆర్నెల్లక మళ్ళీ సంవత్సరానిక ఒక్కసారి పరీక్షలయిపోయాక వస్తూ పోతూ వుంటాడు వాడు కాలేజిక వచ్చేంత వరకు మనకక ఏ బాదరబందీ వుండదు

అంటే నీ కొడుకు నకు బారంగా వున్నాడన్న మాట అన్నారు రామయ్యగారు కోపంగా కొడు కుతో

అలా అని కాదు నాన్నగారు స్టాండర్డ్సు బాగుంటుందని, అంతే అన్నాడు శ్రీకాంత్

"ఏవిటిరా స్టాండర్డు స్టాండర్డు అంటున్నావు ఇందాకట్నుంచీ? నువ్వెక్కడ చదివావనుకుంటు న్నావ్? అదేం రెసిడెన్షిల్ స్కూల్కాదే పోనీ కాన్వెంటు స్కూలైనా కాదు కేవలం మున్సిపల్ హైస్కూలు మరి మీ అన్నదమ్ములిద్దరికీ ఫస్టు క్లాసులు రాలేదా? మీరు మంచి ఉద్యోగాలు చెయ్యట్లేదా? మీ కిప్పుడు స్టాండర్డులేదంటావా? రామయ్యగారు ఆవేశంగానే అన్నారు

అప్పటికీ– ఇప్పటికీ చాల మార్పొచ్చిందినాన్నా

ఏస్కూళ్ళు చూసినా, ఏ ఒక్క టీచరు పట్టుమని సంవత్సరం పాటు పనిచేయటంలేదు. అందు క్కారణం వాళ్ళిచ్చే జీతాలు తక్కువ కావటం. గ్రాడ్యుయేట్లు – పోస్టు గ్రాడ్యుయేట్లు ఏ ఉద్యోగం దొరక్క దొరికిందే చాలనుకుని, వీధికొకటి చొప్పున కుక్క గొడుగుల్లా పుట్టుకొస్తున్న ఈ స్కూళ్ళల్లో చేరిపోవటం. ఆ తర్వాత మరో మంచి ఉద్యోగం దొరికితే ఇది వదిలేసి పోవటం, దొరక్కపోతే జీతం కోసమే ఉద్యోగం చేస్తున్నట్లు 'ఫ్రస్టేషన్'తో వృత్తి మీద గౌరవం– శ్రద్ధ లేక మొక్కుబడిగా స్కూలుకు వెళ్ళి రావటం తప్పిస్తే.... భావి భారత పౌరులు గావల్సిన ఆ చిన్నారుల భవిష్యత్తును తీర్చిదిద్ద వలసిన బాధ్యత తమ మీద వుందన్న విషయాన్ని విస్మరించిన వాళ్ళే ఈనాడు టీచర్లంతా. ఇకపోతే పెళ్ళికాని ఆడపిల్లలూ.... సంబంధాలు కుదిరేదాక ఊరికే కూర్చోవటం దేనికని 'టీచరు' ఉద్యోగాల్లో చేరిపోవటం... ఆ తర్వాత వెళ్ళిపోవటం చూస్తూనే వున్నాము. అందుకే నాన్నా ఈ స్కూళ్ళల్లో ఇక ఎటువంటి స్టాండర్డ్సు ఆశించలేము".

"వోరే శ్రీకాంత్!.... నువ్వు చెప్పేది కొంత వరకు నిజమే.....కాని నువ్వొక ముఖ్యమైన విషయం మర్చిపోతున్నావు. ఆనాడైనా – ఈ నాడైనా పిల్లలు స్కూల్లో టీచర్లు చెప్పిందే విని పరీక్షలు రాసి పాసైపోవటం లేదు. ఇంటి దగ్గర మనం.... అంటే పిల్లల తల్లిదండ్రులం శ్రద్ధతీసుకుని, వాళ్ళను రోజూ టైము ప్రకారం చదివేలా చూసిన నాడే– వాళ్ళు మంచి మార్కులు తెచ్చుకుని పాసవ గల్గుతారు. క్లాసుకు నలభై – ఏభై విద్యార్థు లున్నప్పుడు టీచరు ఏఒక్క స్టూడెంటు మీద ప్రత్యేక శ్రద్ధ చూపించటం కుదరదు. కనుక మీరు స్కూలు కిస్తున్న ప్రాధాన్యతకంటే ఇంటి దగ్గర పిల్లల చేత చదివించటంలో శ్రద్ధ చూపిస్తే ఫలితం వుంటుంది. అప్పుడు పిల్లల్ని ఏస్కూల్లో చేర్పించాలన్న ప్రశ్నరాదు. హోమ్‌వర్కు శ్రద్ధగా చేసిన నాడు – క్లాసువర్కు గురించి అంత ప్రాధాన్యత అనవసరం".

"ఇకపోతే రెసిడెన్షియల్ స్కూల్లో నీకొడుకుని చేర్పించే విషయానికొస్తే.. నువ్వు డబ్బు పోస్తున్నావు కనుక – నీ కొడుక్కి వాళ్ళు తిండి, చదువు – ఉండటానికి హాస్టలు సౌకర్యం అన్నీ ఇస్తారు. బాగానే వుంది. కాని ఆ వయసులో పిల్లలకు కావల్సిన ప్రేమానురాగాలు కూడ తెచ్చి పెడ్తారా వాళ్ళు? బిడ్డ ఆకలేమిటో – అవసరమేమిటో – కష్టమేమిటో కన్న తల్లికి – తండ్రికి తెలుస్తాయి తప్ప వేరెవరికైనా ఎలా తెలుస్తాయిరా? వాడికి రేపేదైనా సుస్తీ చేస్తే, మందులు– డాక్టర్ని తీసుకు రాగలడే కాని, తల్లి – తండ్రి – తోబుట్టువు ఇచ్చే అనురాగం – ఆప్యాయత తెచ్చివ్వగలడ్రా? ఎనిమిదేళ్ళ వయసులోనే వాడు తల్లిదండ్రులను దూరమై, అనాథలా అక్కడెక్కడో మందలో తింటూ– పడుకుంటూ– చదువుకుంటానికి వాడికేం ఖర్మ పట్టిందిరా? వాడికి తల్లిదండ్రులున్నారు. తోబుట్టువుంది. బిడ్డల్ని కనగానే సరికాదురా శ్రీకాంత్. వాళ్ళను సాకాలి. విద్యాబుద్ధులు చెప్పించాలి. మమతానురాగాలు పంచివ్వాలి. అంతేకాని వాడెవడికో ఇంత డబ్బు పడేసి.... అమ్మయ్య... మనకిక బాధ్యత లేదని చేతులు దులుపుకోవాలని చూస్తే... మీరు తల్లిదండ్రులు కాదురా.... స్వార్థపరులు. మీ సుఖంకోసం కన్న బిడ్డని కిరాయి పెంపకానికి పంపే దుర్మార్గు లురా.... దుర్మార్గులు." ఉద్వేగంతో అన్నారు రామయ్యగారు

తండ్రి ఈ విషయం చాల సీరియస్‌గా తీసుకున్నా డని గ్రహించాడు శ్రీకాంత్. తను కేవలం తన అభిప్రాయం చెప్పాడంతే కాని ... ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు. కాని తండ్రి వాలకం చూసిన తర్వాత ఇక ఆ ఆలోచనకు స్వస్తి చెప్పక తప్పదనుకున్నాడు శ్రీకాంత్.

అందుకే అన్నాడు తండ్రితో... "నేనింకా వాడ్ని రెసిడెన్షియల్ స్కూల్లో వేసే విషయంలో ఎటువంటి నిర్ణయం తీసుకో లేదు నాన్నా... వేస్తే ఎలా వుంటుందని అనుకున్నానంతే... అందుకే మీ

## ఇలాంటి తల్లి ఉంటుందా?!



ఫ్రాన్స్‌కి చెందిన 38 సం.ల డేనిలీ పిచ్చిదో, మూర్ఖురాలో అర్థం కాదు. అందుకే ముక్కు పచ్చలారని తన 6 నెలల పసిపాప క్రిష్టల్‌ను బట్టలు ఉతికే మిషన్‌లో వేసింది. మిషన్ పని చేసినప్పుడు పిల్ల 'చట్నీ' అవుతుందని తెలిసినా తను అలా చేసింది. బట్టలను తెలుపు జేసినట్లు తన పాపను కూడా తెల్లగా అయ్యేట్లు చేద్దామనే డేనిలీ రోజాను అలాచేసింది.

అయితే క్రిష్టల్ దాని నుండి బయట పడింది. పూర్తిగా శుభ్రపడి మరీ! ఆమె శరీరంపై ప్రాణాంతకమైన గాయాలు ఏమీ తగలలేదు. కొన్ని గీట్లు తప్ప.

డేనిలీ పొరుగున వుండే మార్గరెట్ బ్రాడ్యూ అంటుంది– 'నేను వంటింట్లో నిలబడి ఆమెతో మాట్లాడుతున్నాను. ఇంతలో ఆమె "మా అమ్మాయి శుభ్రపడి వుంటుంది. తీసుకురావటానికి వెళుతున్నాను". అప్పుడు నేను అనుకున్నాను. ఆమె పిల్లను స్నానాల టబ్ నుండి బయటకు తీస్తుందేమో! కానీ బట్టలు ఉతికే మిషన్ నుండి బయటకు తీస్తూంటే నాకు ఆశ్చర్యం కల్గింది!'

డేనిలి యంత్రాన్ని 'ఆన్' చేయటం మర్చి పోయింది. లేకపోతే క్రిష్టల్ బ్రతికేది కాదు.

క్రిష్టల్ అరవలేదు. కానీ స్పృహ తప్పింది. మార్గరెట్ ఈ విషయం పోలీసులకు తెలియ పరచింది. వాళ్ళు రంగంలోకి దిగటం చూసి డేనిలీ ఆశ్చర్యపడింది 'నేనే క్రిష్టల్‌ను బట్టలు ఉతికే యంత్రంలో పడేశానంటూ ఆమె నిజం ఒప్పుకుంది.

"డేనిలీ దృష్టిలో ఆమె ఏమీ తప్పు చేయలేదు. పశ్చాత్తాప భావం ఆమె ముఖంలో లేదు. తనను ఎందుకు అరెస్టు చేశారా అని ఆమె ఆశ్చర్య పడుతూంది" అని పోలీసు వారి కథనం. 'నీవు పిల్లను హత్య చేయాలని ప్రయత్నించావు' అని పోలీసులు చెబితే ఆమె స్తబ్ధురాలయింది.

పిల్లని ఆస్పత్రిలో చేర్పించారు. ఆమెకు ప్రాణాంతకమైన ఏ గాయాలు తగలక పోవటం వల్ల అందరూ సంతోషించారు.

41 సం.ల డేనిలీ భర్త గెరార్డ్ "అన్నీ బాగానే వున్నాయి కానీ మా ఆవిడకు కామన్ సెన్స్ తక్కువ. ఆమె చేసిన నేరానికి ఆమెకు జైలుశిక్ష విధించటం మంచిది కాదు. నేను ఆమెను క్షమించమని అర్జీ పెట్టుకుంటాను. క్రిష్టల్‌ను సంరక్షించేందుకు ఓ ఆయాను కూడా ఏర్పాటు చేస్తాను" అన్నాడు.

# సౌందర్యదీపం

## చల్లా ఝాన్సీరాణి



### కంటి- మసాజ్

**అణువణువునా ఆకర్షణ- నరనరాల్లో నవ్యత్వం**

ముఖానికీ- శరీరానికీ మసాజ్ అవసరమైనట్లే కంటి చుట్టూ ఉండే కండరాలకు కూడా మసాజ్ చాలా అవసరం అయితే- కంటి చుట్టూ ఉండే కండరాలు చాలా సున్నితంగా ఉంటాయి గనుక కంటి మసాజ్ చాలా జాగ్రత్తగా చెయ్యాలి

మొదట ఏదైనా క్రీంని కళ్ల చుట్టూ రాయండి పాల మీగడ - కోల్డ్ క్రీం- ఆలివ్ ఆయిల్- ఇలాంటి వేవయినా ఫర్వాలేదు రాశాక కళ్ల మధ్యగా ఉన్న ముక్కు ఎముకని చేతులు బొటన వేళ్లతో పట్టుకుని కొద్దిగా లోపలికి- అంటే కనుగుడ్డు లోపలికి నొక్కండి (మరీ నొప్పి పుట్టేలా కాదు) ఇలా చేస్తే కళ్ళు రిలాక్స్ అవుతాయి అలా ఐదారుసార్లు చెయ్యాలి

తర్వాత చూపుడు వేలూ - మధ్య వేలూ ఉపయోగిస్తూ కంటి చుట్టూ బ్రిడ్జిలా ఉన్న ఎముక భాగాన్ని నొక్కి రాయాలి. ఇలా చేసేటప్పుడు కంటి చుట్టూ ఉండే సుకుమారమైన కండరాల్ని పొరపాటున కూడా మీ వేళ్లకి తగలనివ్వకండి. ఇలా పదిసార్లు చెయ్యాలి

ఆ తర్వాత పైన ఉపయోగించినట్లే చూపుడు వేలు- మధ్య వేలూ ఉపయోగిస్తూ రెండు చేతులతో కంటి చుట్టూ వుండే కండరాల్ని మృదువుగా మసాజ్ చెయ్యాలి కనుకొలకు నుంచి కంటి కొసవరకూ అక్కడి నుంచి కంటి కిందుగా వేళ్లని పోనిస్తూ కనుకొలకు వరకూ రానివ్వాలి ఇష్టం వచ్చినట్టుగా డైరెక్షన్ మార్చకూడదు

ఇలా చేస్తే కళ్ల చుట్టూ ఉండే కండరాలు శక్తివంతమవడంతో పాటు కళ్ల చుట్టూ ఉండే ముడతలు పోతాయి

రోజూ క్రమం తప్పకుండా కళ్ల చుట్టూ ఆముదం లేదా ఆలివ్‌నూనె రాసుకుంటే కంటి చుట్టూ ఉండే ముడతలు మాయమై కళ్ళు చక్కటి షేప్‌లో కనిపిస్తాయి

బంగాళాదుంపని సన్నని ముక్కలుగా తరిగి గ్రైండ్ చేసి ఆ రసాన్ని రాసుకోవడం- లేదా బంగాళాదుంప స్లైస్‌ని కళ్ల మీద పెట్టుకుని పది నిముషాలు రిలాక్స్ అయినా కళ్ల చుట్టూ ఉండే ముడతల్ని పోగొట్టుకోవచ్చు

### కంటి చుట్టూ ఏర్పడే నల్లటి వలయాలు

కొంతమందిని చూస్తూనే- "ఏమిటి? అలసి పోయినట్టు కనిపిస్తున్నారు?" అనడిగేస్తాం

దానికి కారణం వాళ్ల కళ్ళు- కళ్ల చుట్టూ ఉండే నల్లటి వలయాలు ఈ వలయాలు మనలోని అశాంతినీ- అలజడినీ- అవిశ్రాంతినీ ఎదుటి వారికి స్పష్టంగా చెప్తాయి కొన్ని నియమాల్ని పాటిస్తే నల్లటి వలయాల్ని పోగొట్టుకోవడం ఏమంత కష్టమయిన పనికాదు

1 రోజూ 8-9 గ్లాసుల నీళ్ళు తప్పకుండా తాగాలి

2 రోజూ తప్పకుండా ఎనిమిది గంటలు నిద్రపోవాలి

3 ఉదయం లేస్తూనే చల్లటి నీళ్లతో కళ్లని కడుక్కోవాలి

4 కళ్లని గట్టిగా నలపకూడదు అలాగే వేళ్లతో కళ్లని మూసుకొని కొద్దిసేపు రిలాక్స్ అవ్వాలి

5 అరచేతిని కప్‌లా చేసి కంటి చుట్టూ లోపలికి వెలుగు ప్రవేశించకుండా చేసి కళ్ళు తెరిచి అలాగే ఉంచాలి

6 భోజనంలో పళ్ళు, ఆకుకూరలూ తప్పనిసరిగా వాడాలి

7 రాత్రుళ్ళు ఎక్కువసేపు మేలుకుని చదవడం -రాయడం- కుట్టడం కళ్లని బాగా అలిసిపోయేలా చేస్తుంది

8 ఉదయానే వాకింగ్ కెళ్లడం ఎంతైనా అవసరం ప్రశాంతమైన వాతావరణం కళ్లని ఆరోగ్యవంతం చేస్తుంది ●

## స్వయం కృషి

సెర్యయం కూడ తెలుసుకుందామని మీతో చెప్పాను . అన్నాడు శ్రీకాంత్

నువ్వు అనుకున్నావో నిర్ణయించుకున్నావో నాకు తెలీదు నాకైతే ఈ విషయం నచ్చలేదు- నచ్చదు వాళ్ళు చేసేది వ్యాపారం తెలుసా? అయితే అటువంటి స్కూళ్ల అవసరం వున్న వాళ్ళు లేకపోలేదు ఉదాహరణకు - తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగాలు చేసుకుంటూ పిల్లల్ని చూసుకునే వ్యవధిలేనివాళ్ళు- తరచుగా ఒకచోటనుంచి వేరొక చోటుకి ఉద్యోగరీత్యా బదిలీయై తిరిగేవాళ్ళు- ఏ పల్లెటూళ్ళోనో వుంటూ, అక్కడ స్కూలు సౌకర్యం లేనివాళ్ళు - ఇంకా అనాథులు కాని మీలాంటి వాళ్ళకి కాదు అస్కూళ్ళు నీకు ట్రాన్స్‌ఫరు ప్రశక్తి లేదు ఉన్న ఊళ్ళో ఎన్నో మంచి స్కూళ్ళు ఉన్నాయి మీ భార్యాభర్తలిద్దరూ చదువుకున్న వారు ఇద్దరంటే ఇద్దరే పిల్లలు మీకు ఒకరికొకరు తోడుగా, స్నేహంగా - చదువుకుంటూ, ఆడు కుంటూ వుంటే వాళ్ళను విడదీయటానికి మనసెలా వొప్పుతుందిరా మీకు? ఉన్న ఒక్క అన్నయ్య దూరంగా వెళ్ళిపోతే, నీ కూతురు ఆడుకోటానికి - అల్లరికి తోడులేక ఒంటరితనంతో బాధపడితే అదిదాని మానసిక స్థితి మీద ఎటువంటి దుష్పరిణామం కల్గివుంటుందో ఆలోచించావా?'

'నా సంగతే ఆలోచించు మా తల్లి దండ్రులకు మేం పదిమంది పిల్లలం అందరం పెద్దయ్యేంత వరకు ఒకేచోట కలిసి - మెలసి ఉన్నాం- చదువుకున్నాం- పెరిగాం కాని ఈనాడు మా మధ్యవున్న సంబంధ బాంధవ్యాలు ఎటువంటివి? ఏ పెళ్ళిలోనో కల్సుకున్నప్పుడే హలో- అంటే - హలో అనుకోవటంతో ఆఖరు ఒకరింటికి ఒకరు రమ్మని పిలుచుకోటం లేదు- వచ్చిపోవటం లేదు కాని పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టుగా జనవరి ఫస్టుకు మాత్రం గ్రీటింగులు పంపించు కుంటాం- అంతే కలిసి పెరిగిన మా మధ్య గ్రీటింగ్సు పంపించుకోటానికి అవసరమైన ఆప్యాయత అనురాగం మిగిలాయంతే మరి - చిన్నతనంలోనే ఫామిలీ మెంబర్స్ నుండి దూరంచేయబడి- ఎక్కడో చదువుకుని - పెరిగిన పిల్లాడిలో- పెద్దయ్యాక మనం ఇంకెంత సంబంధ బాంధవ్యాలు ఆశించ వచ్చంటావ్? నువ్వాశించినట్టుగా, నీకొడుకు పెద్ద రాంకుల్లో పాసై - ఏ ఆఫీసరో అవుతాడనుకో కాని, అందులో తండ్రిగా నీ పాత్రేమిటి? కేవలం ఫైనాన్షియర్‌వి- అంతేనా?

మనం నాటిన మొక్కకు మన చేతుల్తో నీళ్ళు పోసుకుంటే వచ్చే ఆనందం, ఆ మొక్క పూలు పూసి నప్పుడు వచ్చే ఆనందం- నిత్యం ఆ మొక్కను మనకళ్ళముందు చూసుకుంటున్నప్పుడు కలిగే ఆనందం- ఏతోటమాలికో ఆ బాధ్యత అప్పగించిన నాడు రావురా శ్రీకాంత్ నీకు డబ్బు లెక్కువుంటే ఏ అనాథ శరణాలయానికో రాసివ్వు - పుణ్యమైనా వస్తుంది అంతేకాని ఇటువంటి ఆలోచనలు చేయకు చెప్పదల్చుకుంది చెప్పేసి కొడుకు సమాధానం కోసం చూడకుండా అక్కడ నుండి లేచి వెళ్ళిపోయారు రామయ్యగారు

* * * * *

తిరుగు ప్రయాణం రోజు ఆటో ఎక్కుతూ-

'ఆనంద్ నాదగ్గరే వుండి చదువుకుంటాడు నాన్నా' అంటూ తండ్రికి మాట ఇస్తున్నట్టుగా శ్రీకాంత్ తండ్రిచేతిలో చెయ్యివేసి చెప్పుంటే అత్తా కోడళ్ళు అసలు విషయం తెలీక ముఖా ముఖాలు చూసుకున్నారు ●

**1989 Calender with Glamour & Grandeur**

కంటికి యింపు! యింటికి సొంపు!!

నవ చలన చిత్ర వార పత్రిక

# సినిమారంజని

## 1989 కేలండర్!

మీ అభిమాన నాయికా, నాయకుల విశిష్ట వర్ణ చిత్రాలను మీ సొంతం చేసుకోండి!!



★ డెమ్మీ సైజులో (సినిమారంజని - మనోరంజని సైజు) ఆరు పేజీలు! వెల - **4** రూపాయిలే!

★ మీ దగ్గరలో వున్న ఆంధ్రపత్రిక ఏజెంటుతో కాపీని ముందుగానే రిజర్వు చేసుకోండి!



(గత సంచిక తరువాయి)

డాక్టర్ సుచరితను పరీక్షించారు. ఇంజక్షన్ చేశారు. మా ఇద్దర్నీ చూస్తూ "ఈ పాపకు తల్లెవరు?" అని అడిగారు.

"వీళ్లకు తల్లీ దండ్రీ కూడానా డాక్టర్‌సాబ్! బయట బోర్డు చూడలేదా? ఇదిగో ఈమెగారు తెచ్చి వదిలారు" ఈసడింపుగా అంది ఆ స్త్రీ, మైనాను చూపిస్తూ.

మైనా ఏమీ అనలేదు. పెద్ద తప్పుచేసి, దానిమీది మంచి చెడులను నిభాయించే బాధ్యత తల్లి మీద పెట్టి, ఇక బెల్లం కొట్టిన రాయిలా నిర్వికారంగా వుండిపోయిన పాపాయిలా వుంది మైనా.

"చెప్పండి డాక్టర్. ఏమిటి? ఆ బిడ్డకు తల్లిని నేనే అనుకొని చెప్పండి" అన్నాను.

వెర్రిగా చూసింది మైనా.

నల్లటి మైనా మొయిలులా వుంది!

మంచుముద్దలా వుంది!

ఏ క్షణంలో కరుగుతుందో, ఏ క్షణంలో కురుస్తుందో అన్నట్లుగా వుంది!

పరిసరాలను గమనిస్తూ అన్నారు డాక్టర్ "అమ్మాయికి విష జ్వరంలా వుంది. ఈ వాతావరణం అంత బాగా లేదు. మీరు వీలైతే ఇంటికి తీసికెళ్లి నాలుగు రోజులు కనిపెట్టి వుంటే తప్ప పాప కోలుకోవడం కష్టం"

మైనా అయోమయంగా చూసింది.

"అలాగే డాక్టర్. తప్పకుండా తీసికెళ్తాను" అన్నాను నేను.

"లేదు లేదు. పాప నిలా అర్థాంతరంగా తీసికెళ్ళడానికి వీల్లేదు. మా రూల్స్ ఒప్పుకోవు" అరిచినంత పని చేసింది ఆ స్త్రీ.

"ఓ పక్క ప్రాణాలు పోతోంటే మీ రూల్సేమిటి! మా స్వంత పూచీ మీద తీసికెళ్తాములే"

"మీ పూచీ ఎవడిక్కావాలి. అసలే మేనేజర్ వూళ్లో లేడు. కావాలంటే ఆయనొచ్చాక ఆయనతో మాట్లాడి తీసికెళ్లండి. అసలే మావి బక్క ప్రాణాలు. ఏదైనా తారుమారయితే మా పీకల మీది కొస్తుంది" అంది.

నేనావిడతో కొంచెంసేపు దెబ్బలాడాను.

డాక్టర్ నిట్టూరుస్తూ "చూడండీ, ఇక్కడి నియమా లేమిటో నాకు తెలియవు. పాపను ఇక్కడి నుండి తీసికెళ్లడానికి వీళ్ళు ఒప్పుకోకపోతే మీరైనా రెండ్రోజులు ఇక్కడ వుండి చూసుకోండి. ఇంతమందిలో వీళ్ళు ఈ పాపను ప్రత్యేకంగా కనిపెట్టి వుండటం కష్టం" అన్నారు చివరి వాక్యం వ్యంగ్యంగా అంటూ.

ఆ స్త్రీ డాక్టర్‌కేసి గుర్రుగా చూసింది.

డాక్టర్ పాపకు కావలసిన మందులు రాసిచ్చి, ఏది ఎలా వాడాలో వివరించి, నా కోరిక మీద మళ్లీ వస్తానని హామీ ఇచ్చి వెళ్ళిపోయారు.

డాక్టర్ అలా వెళ్లగానే ఆవిడ నా మీద విరుచుకుపడింది.

"మీరెవళ్లోగానీ ఇలా వచ్చి ఆశ్రమ నియమాలను అస్తవ్యస్తం చేసి ఆశ్రమాన్ని అప్రదిష్ట పాలు చేయటం మేము సహించం. పాపను మేము చూసుకుంటాంగానీ మీరు వెళ్లిపొండి. మిమ్మల్ని ఇక్కడ వుండనివ్వడానికి మా రూల్సు ఒప్పుకోవు" అంది.

"ఇద్దరం వుండంలే. నే నొక్కదాన్నే వుంటాను" అన్నాను సౌమ్యంగా.

పిచ్చిదానిలా ఎడాపెడా తల తిప్పింది "లేదు లేదు" అంటూ.

"అయితే నేను కూడా ఓ అనాథనే అనుకో. ఇక్కడ అనాథలకు చోటుంది కదా?" అన్నాను.

"అయితే నే ననాథనంటూ రిజిస్టర్‌లో సంతకం చేయండి. మేనేజర్ అనుమతి లేందే మీ రెక్కడికీ పోకూడదు" అంది.

"అలాగే" అంటూ ఆవిడ చెప్పిన చోటల్లా సైన్ చేశాను. ఆవిడ మమ్మల్ని సాధించడానికే ఇవన్నీ చేస్తోందని మా కర్థమైంది. అయినా చేసేదేముంది?

మందులు, కావలసిన వస్తువులు పట్రమ్మని మైనాకు డబ్బులిచ్చాను. మైనా వెళ్ళిపోయింది.

ఆవిడపేరు రంగమ్మట. కచ్చకట్టినట్లుగా ఆ గది ఛాయలకు స్వీపర్‌నుగానీ ఎవర్నిగానీ రానివ్వలేదు. నేనే ఆ ఇరుకు గది తుడిచి శుభ్రం చేశాను. మేకులు దిగ్గొట్టి బిగించిన వెంటిలేటర్ రెక్కలను మేకులు పీకివేసి తెరిచాను.

మైనా మందులతోపాటు మా గది నుండి బెడ్‌షీట్లు, దోమతెర, స్టౌ, రెండు గిన్నెలు, గాజు గ్లాసులు, స్పూన్లు, మరి కొన్ని అవసరమైన వస్తువులు, నాకు ఫలహారం తెచ్చింది.

అవన్నీ చూసి రంగమ్మ గుండెలు బాదుకుంది.

"ఇది అనాథ శరణాలయ మనుకున్నారా చెట్టు క్రింది కుష్ఠురోగుల చింకి సంసారమనుకున్నారా?" అని గొంతు చించుకుని అరిచింది.

ఆవిడ అరుపుల్ని మేమేమీ పట్టించుకోలేదు.

రాత్రి చాలా ప్రొద్దు పోయాక సుచరిత కొద్దిగా తెలివిలోకి వచ్చింది. టెంపరేచర్ కొంచెం తగ్గింది. మైనాను చూసి 'అక్కా' అన్నట్లుగా పెదిమలు కదిలించింది. మైనా కళ్లలో సంతోషం భరతనాట్యం చేసింది.

"ఇంక ఫరవాలేదు. నీవు ఇంటికెళ్లిపో. ఆ రాక్షసి చూసిందంటే ఇద్దర్నీ తరిమేస్తుంది" అన్నాను.

మరి కాసేపుండి నా బలవంతం మీద మైనా ఇంటికెళ్లిపోయింది.

ఆ రాత్రంతా నేను నిద్రపోలేదు. పాప నుదుటి మీద తడిగుడ్డ వేస్తూ, టైం ప్రకారం మందులు వేస్తూ మేలుకునే వున్నాను.

ఈ పాప ఎవరు? నే నెవరు? ఈ అనాథ శరణాలయంలో, నేనూ ఓ అనాథగా పేరు నమోదు చేయించుకొని ఈ అనాథ పాపకు (అనాథే మరి) సేవ చేయవలసిన అవసర మేమిటి? కేవలం రక్త సంబంధాలే బంధాలు కావనీ, అనుబంధాలు కూడా బంధాలు అవుతాయనీ ఇలాంటప్పుడే నిరూపణ అవుతూ వుంటుంది.

మైనా విశృంఖలత్వాన్ని అసహ్యించుకునే నేను ఆ విశృంఖలత్వంలోంచే వుద్భవించిన ఈ అనామిక బాలికపట్ల నాకెలా కరుణ కలుగుతోంది! అసలు చెడు అంటే ఏమిటి? మంచి అంటే ఏమిటి? మైనా ప్రవర్తన చెడు అన్న భావన పెంచుకున్న నేను ఆ చెడులోంచే వచ్చిన సుచరితలో మంచిని చూడ గలుగుతున్నానా? మంచిని చూడలేనప్పుడు నాకీ కరుణ, ఆత్మీయత కలుగవు కదా?

హఠాత్తుగా నాకు జ్వరం వచ్చినప్పుడు మైనా నాకు సేవలు చేసిన విషయం గుర్తుకు వచ్చింది. మైనా ఎంతో చెడ్డది అని అప్పట్లో నా భావన. అంత చెడులో ఎదుటి మనిషికి సేవ చేయాలనే మంచి

**జరిగిన కథ – 9: అమూల్యకు బెనర్జీ నుంచి ప్రేమలేఖ వస్తుంది. వేరే గదిలో అద్దెకుచేరిన అమూల్యకు శృతి పరిచయమవుతుంది. తిరిగి తన గదికిచేరిన మైనా ఒక చిన్నారిపాపకు తల్లి అని తెలుసుకుని విస్తుపోతుంది అమూల్య. తెలుగు లెక్చరర్ అమూల్యను ప్రేమిస్తున్నట్లు తనకనుమానంగా వుంటుందంటుంది మైనా. వైధవ్యం ప్రాప్తించిన మేనత్త జానకి అమూల్య దగ్గర రెండురోజులు వుండివెళ్తుంది. అమూల్య, మైనా చిన్నారి సుచరితను చూసివద్దామని అనాథశరణాలయానికి వెళితే, ఆ పాప జ్వరంతో అపస్మారకస్థితిలో పడివుంది.**

ఎలా పుట్టింది!? నావల్ల మైనా కెలాంటి లాభమూ లేదు. పైగా ఎప్పుడూ విమర్శిస్తూ, గేలిచేస్తూ, ఈసడిస్తూ మైనా నెంతగానో బాధించాను. అంటే ప్రతిఫలాపేక్ష రహితంగానే మైనా నా పట్ల ఆర్ద్రత ప్రదర్శించింది. అంటే అది పూర్తిగా మంచితనమే అవుతుంది కదా? చెడులో మంచి వున్నట్లే. మంచిలోనూ చెడు వుంది. దీని అర్థం ఎవరూ పూర్తిగా చెడ్డవారు కాదు. పూర్తిగా మంచివారూ కాదు.

నిట్టూర్చాను.

ఇన్నాళ్ళూ నేనెంతో మంచిదాన్ననీ, చెడు అంటకుండా బ్రతుకుతూన్న మంచిదాన్ననీ నాకే తెలియని అహం నాలో వేళ్ళు పాతుకుని వున్నందుకు సిగ్గుగా అనిపించింది. ఇన్నాళ్ళూ నేను మంచి దనుకుంటూన్న దేమిటి? కన్యగా పురుష స్పర్శ నెరుగక పోవటమే కదా? పతివ్రతలా ఒకే మగడికి కాపురం చేయటమే కదా? పేరు వున్న ఒక మగవాడికి, అంటే ఆ మగవాడెవరో తెలిసి వాడికే బిడ్డను కనడమే కదా? మంచి అంటే కేవలం ఇంతేనా! కనీసం నా దృష్టిలో! నా తల దిమ్మెక్కి పోయింది. బహుశా మంచి అంటే తాను చేస్తున్నది చెడు అనిపించుకుంటూనే, చెడు అని వేలెత్తి చూపించుకుంటూనే, ఆ వేలెత్తి చూపిన వారికే, తాను చేస్తూన్నది మంచి అని తెలియకుండానే మేలు చేయటం కాబోలు!

నాకు మళ్ళీ నా జ్వరపు తీవ్రతలో సేవ చేసిన మైనా కళ్ళ ముందు ఆడింది.

ఇప్పుడు మైనా స్థానంలో నేను. నా స్థానంలో సుచరిత. అకస్మాత్తుగా నాకో ఆలోచన వచ్చింది. ఆ రోజు మైనా నన్ను చూసుకున్నందుకే నేను సుచరితను ఆదరిస్తున్నానా? కేవలం అందుకేనా?ఆ నాడు మైనా నన్నాదుకోక పోయి వుంటే, నా దృష్టిలో మైనా 'చెడు' గానే వుండి వుంటే, ఆ చెడ్డదైన మైనా చెడ్డ కూతురి మీద నేనిలా వాత్సల్యం చూపి వుండే దాన్నేనా? 'కాదేమో' అనే సందిగ్ధ సమాధానం వచ్చింది.

క్షణక్షణానికీ నాలోని చెడు ఏమిటో నెమ్మది నెమ్మదిగా కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

. రక్త సంబంధీకుల కోసం, ముఖ్యంగా వారి అవసరాలకు కాక, ఆడంబరాల కోసం డబ్బును, చీరెలనూ త్యాగం చేయడం నిజమైన మంచి కాదేమో.

తండ్రి ఎవరో తెలీకుండా, విశృంఖలత్వానికి మారురూపైన మైనా కడుపున పుట్టిన ఈ అనాథ, అనామిక బాలిక సేవలో నా కెంతో తృప్తి లభించింది. ఊహూ, జీవితంలో ఎప్పుడూ లభించని తృప్తి.

నా మనసు ఆర్ద్రమై కళ్ళ గుండా జాలువారి సుచరిత నుదుటి మీది గుడ్డను తడిపింది.

★ ★ ★ ★

తెల్లవారక ముందే మైనా వచ్చింది. మైనా కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి. కంటి మీద నిద్ర లేదో, కన్నీళ్ళో మరి!

వచ్చి మౌనంగా కూర్చుంది.



"మైనా, గలగలా మాట్లాడు కిలకిలా నవ్వు. ఇలా వుండకు ఇప్పుడేమయిందని' పాపకు బావుంది జ్వరం తగ్గింది తెల్లవారు ఝామున మాట్లాడింది కూడా" అన్నాను మైనా భుజం మీద చెయ్యి వేసి

మైనా నవ్వలేదు గానీ ఆ కళ్లలో, సంతోషం తొంగి చూసింది.

"నీకు కాఫీ, టిఫిన్ తెస్తాను" అంటూ ఫ్లాస్కు తీసుకుని వెళ్లిపోయింది.

మైనా వచ్చే లోపల స్టౌ మీద వేడి నీళ్లు పెట్టి పాపకు ముఖం కడిగించి మందు వేశాను మైనా పాపకు పాలు, నాకు కాఫీ, టిఫిన్ తీసుకుని వచ్చింది పాప మైనాను చూసి "అక్కా అంటూ చేతులు చాచింది

మైనా పాప నెత్తుకుంది

వెయ్యేళ్ల తపోఫలాన్ని చేతుల్లోకి తీసుకున్న అనుభూతి కనిపిస్తోంది మైనా ముఖంలో

"మైనా ఈ అనుభవాన్నీ, అనుభూతినీ నీ సొంతం చేసుకో పాపను తీసికెళ్లి నీవే పెంచుకో' అన్నాను నవ్వుతూ

మైనా ముఖం వివర్ణమైంది

ఆ మాటల్ని భరించలేని దానిలా చటుక్కున పాపను నా చేతుల్లో పెట్టింది

నేను ఆశ్చర్యపోయాను

'టిఫిన్ చెయ్ నేను డాక్టర్ని తీసుకు వస్తాను అంటూ బయటకు నడిచింది

మైనా నా కర్థం కావటం లేదు

* * * *

రెండ్రోజుల తర్వాత అనాథ శరణాలయం మేనేజర్ వచ్చాడు. రంగమ్మ మా మీద ఎడాపెడా ఒకటికి నాలుగు కల్పించి చెప్పింది. ఆయన శాంతంగా నన్ను కూడా విషయం అడిగాడు నేను వున్న విషయం చెప్పాను మేనేజర్ రంగమ్మను గట్టిగా చీవాట్లేశాడు

'అనాథ శరణాలయం వున్నది అనాథలకు న్యాయం, మేలు జరగడానికి గానీ వాళ్ల మీదే రూల్సంటూ రుద్ది, వాళ్లకే కీడు చేయడానికి కాదు అంటూ మందలించాడు

ఆవిడేదో సణుగుతూ అవతలికి వెళ్లిపోయింది

మేనేజ్‌మెంటులోని లోపాలకు సంజాయిషీగా ఇది ఒక్కరికి సంబంధించినది కాదు అందరూ పెద్దలే అందరికీ పెత్తనం చేయాలనే దాతలు తక్కువ మాదాతలు ఎక్కువ నే నొక్కణ్ణీ ఏం చేయగలను చెప్పండి? అన్నాడు

మేనేజర్ మాటలు సాత్వికంగానే వున్నాయి చేతలు?

"ఏం నాటకమాడుతున్నావురా బాబూ' అన్నట్లు చూసింది మైనా

మరో రెండు రోజులకు సుచరిత బాగా కోలుకుని అటూ ఇటూ తిరుగసాగింది

నేనిక ఇంటికి వెళ్లిపోవాలని అనుకున్నాను. మేనేజర్ కూడా "పాపకు బాగుంది. ఇక మేము చూసుకుంటాము. మీరు ఇంటికి వెళ్లిపొండి" అన్నాడు.

'నేనిక్కడ అనాథనని పేరు నమోదు చెయించుకున్నాను మరి వెళ్లవచ్చా?' అన్నాను నవ్వుతూ

' అనాథల్ని ఆదుకునే ఆపద్బాంధవి మీరు మీరు అనాథేమిటి' అంటూ నవ్వాడు

వచ్చేటప్పుడు డాక్టర్ని కలుసుకుని కృతజ్ఞతలు చెప్పి ఫీజు ఇచ్చి వచ్చాము డాక్టర్ ఫీజు నేనే ఇచ్చాను మైనా ఏమీ అనలేదు

ఇంటికి వస్తూ వుంటే పాప మాటలు గుర్తు వచ్చాయి ఈ నాలుగు రోజుల్లో పాప బాగా మాలిమి అయింది

"ఆంటీ, మళ్లీ ఎప్పుడు వస్తావు?"

"ఏమో అన్నాను బుగ్గ నిమురుతూ

"నాకు మళ్లీ జొరం వచ్చినప్పుడు వస్తావా? అంది అమాయకంగా



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.




కేరళ రాష్ట్రం లోని ఒక స్కూలులో బిజోయ్ ఇమాన్యుయేల్, బినుమోల్ మరియు బిందు ఇమాన్యుయేలు చదువుతున్నారు వారు జెహోవాస్ మతమునకు చెందినవారు వారు ఉదయం స్కూలుకు వెళ్ళినప్పుడు అందరూ జనగణమన జాతీయ గీతం పాడుతారు ఈ ముగ్గురు గౌరవ సూచకంగా నిలబడతారు కాని జాతీయ గీతం పాడరు అది వారి యొక్క మత విశ్వాసమునకు విరుద్ధం కనుక పాడరు ఎవ్వరూ అది అగౌరవమని భావించ లేదు కాని 1985లో కొందరు పెద్దలు అది జాతికి అగౌరవమని భావించటం జరిగింది ఇది గుర్తించిన ఎమ్ ఎల్ ఏ ఈ విషయం గురించి విధాన సభలో ప్రశ్న వేశారు దీని గురించి కమిషన్ వేశారు స్కూళ్ల డెప్యూటీ ఇన్స్పెక్టర్ ఆదేశాల ప్రకారం ఆ స్కూలు హెడ్ మిస్ట్రెస్ ఆ ముగ్గురు పిల్లలను 1985 జూలైలో స్కూలు నుంచి బహిష్కరించారు ఆ ముగ్గురు పిల్లలు హైకోర్టులో రిట్ పిటిషన్ వేశారు హైకోర్టు సింగిల్ జడ్జి, ఆ తర్వాత హైకోర్టు డివిజన్ బెంచ్ కూడా స్కూలులో చేర్చుకొనవలసినదనిన వారి పిటిషన్ను తిరస్కరించారు ఇక సుప్రీమ్ కోర్టుకు వారు అప్పీలు పెట్టుకున్నారు సుప్రీమ్ కోర్టు వారు తమ తీర్పుతో హైకోర్టు వారు ఇతర మతాల వారికి జాతీయ గీతం విరుద్ధంగా లేదని అనడం తప్పు అభిప్రాయం అని పేర్కొన్నారు జాతీయ గీతం పాడాలని శాసనం లేదని, జాతీయగీతం పాడుతున్నప్పుడు కలిసి పాడకపోతే అగౌరవం కాదని సుప్రీంకోర్టు అభిప్రాయ పడ్డారు భారత రాజ్యాంగంలో 51 అధికరణ ప్రకారం జాతీయ గీతం పాడుతున్నప్పుడు గౌరవ సూచకంగా లేచి నిలబడ్డారు కాని కలిసి పాడకపోతే అగౌరవం కాదు అన్నారు సుప్రీమ్ కోర్టు తమ తీర్పులో కేరళ ప్రభుత్వం వారు 1961లో, 1970లో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్స్ట్రక్షన్ జాతీయ గీతం పాడునప్పుడు స్కూలు అంతా కలిసి పాడాలని సర్క్యులర్ను పంపించాలని సుప్రీమ్ కోర్టులో వాదించారు కాని ఈ సర్క్యులర్లకు చట్టబద్ధమైన ఆమోదం లేదని ఆ విధంగా నిర్బంధించి కూడా 19 మరియు 25 అధికరణలలో కల్పించిన హక్కులకు విరుద్ధమని సుప్రీమ్ కోర్టు తీర్పులో పేర్కొన్నారు కనుక ఈ ముగ్గురు పిల్లలను జాతీయ గీతం పాడినప్పుడు, గౌరవ సూచకంగా నిలబడినప్పుడు వారు కూడా జాతీయ గీతం పాడలేదని స్కూలు నుంచి బహిష్కరించటం రాజ్యాంగంలోని 19 అధికరణకు విరుద్ధం అంతే కాకుండా ప్రపంచమంతా జహోవా మతం వారి గురించి కోర్టు తీర్పులు వున్నాయి కనుక భారత రాజ్యాంగం లోని 19 మరియు 25 అధికరణలు క్రింద ఈ ముగ్గురు పిల్లలకు రక్షణ కల్పించాలి, అంటూ వీరి అప్పీలు అనుమతించి హైకోర్టు తీర్పును కొట్టివేస్తూ 1986లో సుప్రీమ్ కోర్టు తీర్పు ఇచ్చారు ఈ ముగ్గురు పిల్లలను స్కూలులో తిరిగి చేర్చుకోవాలని కూడా సుప్రీమ్ కోర్టు తీర్పు ఇచ్చారు ●

---

'చ చ అంటూ పాపను ఎత్తుకున్నాను నా కళ్లలో నీళ్ళు తిరిగాయి

'నీకు ఇంక ఎప్పుడూ జ్వరం రాదు ఇన్నాళ్ళూ ఆంటీ గురించి తెలియక జ్వరం వచ్చేది ఇప్పుడు ఆంటీ వుందని జ్వరానికి భయం ఇంక రాదు వస్తే నేనూర్కోనుగా అన్నాను

కిలకిల నవ్వింది పాప, చంద్ర కిరణాలు జలజల రాలినట్టుగా

పాపను వదలి రాలేక రాలేక వచ్చాము

గేటు దాటుతూ వెనక్కు తిరిగి చూశాము దూరంగా పాప చేయి వూపుతూ కనిపించింది మేమూ చేయి వూపాము ఉత్సాహం పొంగి పొర్లగా పాప ముందుకు పరిగెత్తి రావటానికన్నట్లుగా కాలు కదిపింది పక్కనే వున్న రంగమ్మ ఝాడించి పట్టుకుంది పాపను పాప బిక్క మొహం వేసింది

బాధతో నా మనసు గిలగిల లాడింది

అప్రయత్నంగా మైనా కేసి చూశాను

నీళ్ళు తిరుగుతూన్న కళ్లను నా నుండి దాచుకోవడానికి తల బాగా వంచుకుంది

ఇంటికి వచ్చేశాము

"అన్నట్టు శృతి ఏం చెప్పావు" అన్నాను అప్పుడు గుర్తుకు వచ్చింది ఆ విషయం

'ఏదో ఒకటి చెప్పాను తను నిన్నేమీ అడగదు నీవూ ఏమీ చెప్పకు అంది మైనా

"సుచరిత విషయం శృతికి చెప్తే బాగుంటుందేమో తను పాప విషయంలో నీ కేదైనా సహాయం చెయ్యొచ్చు సలహా ఇవ్వొచ్చు అన్నాను

'అన్ని పనులూ సహాయాల ద్వారా, సలహాల ద్వారా జరగవు అంది నిర్లక్ష్యంగా

మైనాలో నేను మళ్ళీ వెనకటి స్వభావం చూశాను నాకొకటి అర్థమైంది పాప సమక్షంలోని మైనా వేరు పాప పరోక్షంలోని మైనా వేరు

అంతలో శృతి గదిలోకి వచ్చింది

"బేబీ చెప్పింది నీవు వచ్చావని థేంక్ గాడ్ ఈ రోజు కూడా నీవు రావేమోనని అనుకున్నాను రాత్రి మా ఇంట్లో డిన్నర్ ఈ రోజు మాత్రం నీవు తప్పకుండా హెల్ప్ చేయాలి ఎందుకంటే మా అత్తయ్య దగ్గర నోట్ చేసుకున్న వంటలు ప్రిపేర్ చేస్తున్నాను హలో మైనా, నీవు కూడా ఎక్కడికీ వెళ్లకు అన్నట్టు గెస్ట్ ఎవరో తెలుసా? మీ టిలుగు అని నవ్వుతూ వెళ్ళిపోయింది

అంతవరకూ అలా అలవోకగా శృతిని చూస్తూ వింటూన్న నాకు హఠాత్తుగా వూపిరి ఆగిపోయినట్లుగా అయింది

అన్నట్టు గెస్ట్ ఎవరో తెలుసా? మీ టిలుగు
అన్నట్టు గెస్ట్ ఎవరో తెలుసా? మీ టిలుగు
అన్నట్టు గెస్ట్ ఎవరో తెలుసా? మీ టిలుగు

కోటి గొంతుకలతో ఎవరో ఎలుగెత్తి అంటూన్నట్లుగా, అయినా ఎంతో మెలోడియస్‌గా

గుండెల మీద ఢంకా బజాయిస్తూన్నట్లుగా, అయినా ఎంతో మృదువుగా

తెలుగు మాటలా, తెలుగు పాటలా తీయగా, హాయిగా, తేనె సోనలా, పూల వానలా

"లాభం లేదోయ్ దుర్వాసుడి శాపం నుంచి నిన్నెవరూ తప్పించలేరు నవ్వుతూ అంటోంది మైనా

ఉలికి పడి "ఏమిటి'' అన్నాను

"ఏమిటేమిటి' మరీ ఇంత పరధ్యానమా దుష్యంతుడి ధ్యానంలోని శకుంతలలా'' అంది.

నేను సిగ్గు పడిపోతూ, ఆ విషయం మైనా ఎదుట బయట పడిపోకూడదని నవ్వలేక ఏడుస్తూ, ఏడ్వలేక నవ్వుతూ చివరకు ఆముదం తాగిన ముఖం పెట్టేశాను

మైనా పొట్ట చెక్కలయ్యేలా నవ్వసాగింది

(ఇంకా ఉంది)

# శాస్త్రజ్ఞ శేఖరుడు డా. బి. వి. నాథ్

"అభిప్రాయాలు మారవచ్చు. ఆచార వ్యవహారాలు మారవచ్చు.. తరాలు మారవచ్చు. కాని వైజ్ఞానిక రంగంలో నా కృషి విజ్ఞాన శాస్త్రం ఎంతకాలం ఉంటుందో అంతకాలమూ నిలుస్తుంది". (శ్రీ 'సస్యశ్రీ' అందజేసిన టేపురికార్డు నుంచి) ఇంత నిబ్బరంగా తనను తాను అంచనా వేసుకున్న శాస్త్రజ్ఞుడు ఎవరో కాదు, డా. బి. వి. నాథ్. భాగవతుల విశ్వనాథ్ వైజ్ఞానిక రంగంలో బి. వి నాథ్‌గా ప్రసిద్ధుడు. కనీసం మెట్రిక్యులేషన్ పరీక్ష అయినా నెగ్గని విశ్వనాథ్, ఆచార్యుల కాచార్యుడై, స్వతంత్ర భారతంలో శాస్త్ర ప్రగతికి పథనిర్దేశం చేసిన మహా పురుషుల్లో ఒకరైనారంటే ఆశ్చర్యం వెయ్యక మానదు. కేవలం 'లేబరేటరీ అటెండర్'గా ఉద్యోగ ప్రవేశం చేసిన నాథ్ వ్యవసాయరంగంలో అత్యున్నత పదవుల నలంకరించి పరిపాలనా దక్షుడుగా పేరొందడమే కాక, పరిశోధనారంగంలో అనన్య సామాన్య ప్రతిభా వైశిష్ట్యం వల్ల దేశ విదేశాల్లో విఖ్యాత యశుడై అపూర్వ గౌరవ ప్రతిష్ఠల నందుకొన్నాడంటే, ఈనాడు నమ్మశక్యం కాని విషయం.

గణితశాస్త్రంలో శ్రీనివాసరామానుజన్‌కు బ్రిటిష్ మేధావు లందిచ్చిన ఆదరావ కాశాలు, శాస్త్ర విభాగంలో ప్రాథమిక పట్టా కూడా లేకపోయినా స్వకీయ ప్రతిభావిశేషం వల్ల విశ్వ విఖ్యాత శాస్త్రజ్ఞుడై, భారత పౌరసత్వం వరించిన జె. బి. ఎస్. హాల్డేన్ ప్రభృతులు క్షణకాలం మన ముకురంలో దర్శన మిస్తారు. అసాధారణ విజయాలు సాధించిన ఆంధ్ర శాస్త్రజ్ఞుడు బి. వి. నాథ్‌కి అతని శతజయంతి సందర్భంగా నివాళు లివ్వడం మన కర్తవ్యం.

## శతజయంతి

విశ్వనాథ్ విజయనగర వాస్తవ్యుడు. విజయనగరానికి అనతిదూరంలో అలమండ గ్రామంలో మాతామహుల ఇంట జనవరి 1, 1889వ తేదీని జన్మించాడు. తన 11వ ఏటనే తండ్రిని గోల్పోయిన విశ్వనాథ్ చిన్ననాడే కష్టాల్లో చిక్కుకుని, మేనమామ సహాయంతో మెట్రిక్యులేషన్ దాకా చదివి పరీక్షరాశాడు. కాని దురదృష్ట వశాత్తు పరీక్ష తప్పాడు. ఇది అతనికి ప్రబలాఘాతమైంది. పరీక్షలు ప్రతిభకు గీటురాళ్ళు కావని హృదయానికి గట్టిగహత్తుంది. మళ్ళీ పరీక్షరాయనని భీష్మించాడు. ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీ శాస్త్రాల్లో లభ్యమైన పుస్తకాలను చదివి నెమరు వేయసాగాడు. కాని మేనమామ ఎంత ఆప్యాయంగా చూసుకున్నా, తనకుటుంబ భారాన్ని కూడా అతనిపై వెయ్యడం బాధాకరంగా ఉంది. ఏమి చేయడానికి పాలు పోని ఆ చీకటి రోజుల్లో, ఒకసారి హఠాత్తుగ ఒక వెలుగు కిరణం కనిపించింది.

## జపాన్ ప్రయాణం

బహుచిన్నదైన జపాన్ దేశం ఆసియాలో కెల్లా పెద్ద దైన రష్యాను ఎదిరించి విజయం సాధించడం నాథ్‌ను ఉత్తేజపరిచింది. జపాన్ ఆసియా ఆశాజ్యోతి అనిపించింది. జపాన్ వారి పారిశ్రామిక పద్ధతులను అధ్యయనం చెయ్యాలని సంకల్పించాడు. ఒకరోజు సాహసించి విజయనగరానికి అయిదు మైళ్ళ దూరాన ఉన్న జొన్నవలస గ్రామనివాసి, సౌజన్యమూర్తి పూసపాటి జోగి జగన్నాథ రాజుగారి వద్దకు వెళ్ళి, తన ఆదర్శాన్ని వివరించి జపాన్ వెళ్ళడానికి ఆర్థిక సహాయాన్ని అర్థించాడు. జగన్నాథ రాజుగారు ప్రతిభా సంపన్నుడైన నాథ్ తప్పక పైకి రాగలడని భావించి జపాన్ పర్యటనకు కావలసిన ధన సహాయం చేయడమే కాక, తరువాత కూడా ఎన్నో విధాల నాథ్ కుటుంబాన్ని ఆదుకున్నాడు.



## ఆత్మహత్యా యత్నం

నాథ్ ఆర్థికంగా స్థిరపడ్డానికి చేసిన యత్నాలేవీ ఫలించలేదు. జీవితం ఒక చేదు పాటగా రూపొందింది. ఋణభారం భరించ లేక ఒకటి రెండు సార్లు ఆత్మహత్యా ప్రయత్నం కూడా చేశాడు. అలాంటి విషాదకర పరిస్థితుల్లో అనుకోకుండా తుని రాజా వారి నుండి పిలుపు వచ్చింది. తుని సంస్థానం లోని గనులు, పరిశ్రమలు పర్యవేక్షించ డానికి ఒక మేధావి అవసరమని భావించి నాథ్‌ను ఆహ్వానించారు. రాజాశ్రయంలో తన పదవీ బాధ్యతలు నిర్వహిస్తూ, తన పరిశోధనలు కొనసాగిస్తూ కొంతకాలం నిశ్చింతగా గడిపాడు నాథ్.

1910 సం. లో రాజావారు గతించడంతో ఆశ్రయం గోల్పోయి తెగిన గాలిపటంలా ఉద్యోగాన్వేషణలో ఉత్తర భారతదేశంలో పర్యటించాడు. సర్ పి. సి. రే (కలకత్తా) చంద్రభూషణ బహదూరు (కలకత్తా), ఆచార్య గజ్జర్, కోటి భాస్కర్ అమాన్ (బొంబాయి) వంటి ప్రఖ్యాత శాస్త్రజ్ఞుల వద్ద పని చేసి అనుభవశాలి అనిపించుకున్నాడు. వారి మన్ననలను, ప్రశంసలను పొందాడు. ఇంతలో మద్రాసు కెమికల్ ఎగ్జామినర్ దగ్గర అసిస్టెంట్‌గా పని చేసే అవకాశం వచ్చింది. వేలి ముద్రలు, రక్త పరీక్షలు ఆధారంగా నేర నిర్ణయం చెయ్యడం వంటి అనుభవాలు గడించారు.

1911వ సంవత్సరంలో కోయంబత్తూరులోని అగ్రికల్చరల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో కెమికల్ అసిస్టెంటు ఉద్యోగానికి దరఖాస్తులు కోరబడి నాయి. ఈ ఉద్యోగానికి మాసిక వేతనం రూ 50/- మాత్రమే. ఈ ఉద్యోగానికి జరిగిన ఇంటర్వ్యూలో నాథ్ ఎం. ఎసి. మొదలైన విద్యార్థులతో పోటీ చేయవలసి వచ్చింది. పోటీ తీవ్రంగా ఉన్నా నాథ్‌ను అదృష్టం వరించింది. అధికారులు ప్రతిభను, అనుభవానికి పట్టం కట్టారు. దీనితో నాథ్‌కు వృత్తిపరంగా స్థయిర్యం, ఆత్మ విశ్వాసం పెరిగాయి. ఉద్యోగ ధర్మాన్ని దీక్షతో కొనసాగిస్తూ పరిశోధనలో నిమగ్న మానసుడయ్యాడు నాథ్. నిరంతర కృషికి తోడు అదృష్టం కడా కలిసి రావడంతో నాథ్ క్రమంగా ఉన్నతోన్నత పదవులు నిర్వహించి ఎన్నో పురస్కారాలను పొందాడు.

## 140కి పైగా పరిశోధనా పత్రాలు ప్రకటించాడు.

నాథ్ జీవితంలోని కొన్ని ముఖ్య ఘట్టాలను ఇక్కడ పేర్కొంటాను.

1) 1914లో నాథ్ మెస పొటేమియాలోని బాగ్దాద్ సమీపంలో రుస్తుం నగరంలో ఒక పెద్ద రసాయనిక ప్రయోగశాలను నిర్మించాడు. అది; ఇప్పుడు ఉచ్చ స్థితిలో ఉంది.

2) 1921లో అతి ప్రతిష్ఠాకరమైన రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమిస్ట్రీలో ఫెలోషిప్ లభించింది.



# పిలుస్తున్నది 500 ఏండ్ల నాటి 'మందసా' కోట!

ఐదు శతాబ్దాల క్రిందట రాచరికపు పోకడలతో పుట్టిపడి, నేడు వ్యభిచారుల కేళీకలాపాలకు స్థావరమై ఎవరి ఆలనాపాలనకు నోచుకోక శిథిలావస్థకు చేరుకున్నది 'మందసా కోట'

శ్రీకాకుళం జిల్లాలోని మందసా సమీపంలో రాజా బామన సింగ్‌దేవ్ ఈ కోటకు పునాది వేశారు సుమారు 500 సంవత్సరాల క్రితం యిక్కడి మహేంద్రగిరి పర్వత శ్రేణులలోని అడవులలో వేటకై వచ్చిన ఆ రాజు 'రాజ ముద్రిక' ఈ ప్రదేశంలో జారి పడింది దానిని వెదికే ప్రయత్నంలో ఆ రాజుగారి సైనికులు అక్కడి ఒక గుట్టను త్రవ్వేందుకు యత్నించినప్పుడు, ఆ గుట్ట నుంచి ఒక నదీ ప్రవాహం పుట్టుకు వచ్చిందని, మహేంద్ర గిరిపై పుట్టిన ఈ నదికి 'సున్నా ముది (ఒరియాలో బంగారు ముద్రిక) అని పేరు పెట్టి, ఆ ప్రాంతాన్ని తన ఆదీనంలోకి తెచ్చుకొని మంచసా గ్రామ సమీపంలో ఈ కోటకు పునాది నిర్మించారని చారిత్రక ఆధారాలు తెలియజేస్తున్నాయి

బామనసింగ్‌దేవ్ కుమారుడు రాజాసింగ్‌దేవ్ ఈ కోట నిర్మించిన ప్రదేశాన్ని రాజదాని చేసుకొని 'పీరమంజూ షా' అని పేరు పెట్టుకున్నాడు ప్రస్తుతం ఈ ప్రాంతం 'ఎడి మందసా'గా పిలువబడుతోంది

అయితే శత్రురాజుల దాడులకు గురైన ఆ కోట శిథిలమైపోగా రాజా సింగ్‌దేవ్ కుమారుడు జగన్నాథరాజమణి మందసా గ్రామంలో ప్రస్తుతం వున్న కోటను నిర్మించినట్లు దాఖలా లున్నాయి కాగా ఈ కోట నిర్మాణ దశలో ఒక బ్రాహ్మణుడిని బలి యిచ్చినట్లు, ఈ దోష పరిహారార్థం కాంచీపురం నుంచి తెచ్చిన వాసు దేవస్వామి ఆలయ నిర్మాణం జరిగిందని నానుడి

ఆ స్వామి వారి పేరు మీద ఈ ప్రాంతంలో. ప్రతి యేటా ఉత్సవాలు జరపటం ఆనవాయితీగా వస్తున్నది

ఇక్కడి రాజవంశీయులలో పిన్న వయస్కుడైన రెండవ శ్రీనివాస రాజమణి కుమారుడు చత్రపతి సింగ్‌దేవ్ ప్రస్తుతం సైన్యంలో పని చేస్తున్నారు కోటను పరిరక్షించే విషయంలో ఈయన అంత ఆసక్తి చూపక పోవటంతో అది శిథిలావస్థకు చేరి కాలగర్భంలో కలిసిపోతోంది ప్రస్తుతం కోట వ్యవహారాలను శ్రీ జగదీష్ చంద్ర ఆచార్య నామమాత్రంగా పర్యవేక్షిస్తున్నారు

గత చరిత్రకు సాక్షిగా నిలిచిన ఈ కోటను పరిరక్షించవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది'

(సేకరణ :– క్రాంతికిరణ్)

3) 1928లో ప్లేంట్ అన్ సిరియల్ న్యూట్రిషన్‌పై, భూసారంపై పరిశోధనలు వైజ్ఞానిక ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తాయి ఫలితంగా ప్రభుత్వం ఇతనికి 'రావుబహదూర్' బిరుదాన్నిచ్చి సత్కరించింది

4) 1934లో బీహారులోని పూసా గ్రామంలో ఇంపీరియల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్‌కి ప్రదమ భారతీయ డైరెక్టరుగా నియమించబడి, అనతి కాలంలోనే దాన్ని డిల్లీకి మార్చారు ఇదే నేటి ప్రసిద్ధ సంస్థ-- పూసా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, న్యూఢిల్లీ

5) 1943లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు గౌరవ డాక్టరేటు (డి ఎ సి) ఇచ్చి సత్కరించింది ఆంగ్లప్రభుత్వం 'కంపెనీ ఆఫ్ మోస్ట్ ఎమినెంట్, ఆర్డర్ ఆఫ్ ఇండియన్ ఎంపైర్' (సీ ఐ ఇ) బిరుదునిచ్చి సన్మానించింది

6) ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ పదవి 1945లో బాపట్ల వ్యవసాయ కళాశాల స్థాపన

7) 1947లో బెనారస్ విశ్వవిద్యాలయంలో ఇర్విన్ ప్రొఫెసర్ ఆఫ్ అగ్రికల్చర్

8) 1949లో డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్, ఫుడ్ కమీషనర్ రాజస్థాన్‌లో 1951–56 మధ్య ప్లానింగ్ కమిషన్‌లో అడ్వైజర్, ప్రెసిడెంట్– సాయిల్ సైన్సెస్ కమిటీ, ఐ సి ఏ ఆర్

10) ఎఫ్ ఏ ఓ (యునైటెడ్ నేషన్స్)కు సలహాదారు ఆయన కివే మన శత జయంతి నివాళులు'

–డా. గంటి శ్రీరామమూర్తి

# అదృష్టరేఖ

ఆదూరి వెంకట సీతారామమూర్తి



న్యూస్ పేపరు ముందేసుకుని కూర్చున్నారే గాని సాంబయ్య గారి దృష్టి అందులోని వార్తల మీద లేదు- అతని కళ్ళలో గత కాలపు సంఘటనలేవేవో లీలగా కదులాడుతున్నాయి-

ఈజీచైర్లోంచి కాస్త ముందుకు వంగి కిటికీలోంచి వీధిలోకి చూశారు పిల్లలెవరో రోడ్డు మీదే క్రికెట్ ఆట ఆడుకుంటున్నారు- డిటెక్టివ్ పుస్తకాలు అద్దెకిచ్చే కుర్రాడు ఎదురింటి వారికి కొత్త పుస్తకాలిచ్చి పాతపుస్తకాలను తీసుకు వెళ్తున్నాడు-

మళ్ళీ పేపరు మీదికి దృష్టి సారించేరు సాంబయ్యగారు- దేశ రాజకీయాలు అస్తవ్యస్తంగా వున్నాయని పించిందాయనకు- జీవితంలో రాణింపుకు రావలసిన వాడు వక్రమార్గాన్ని తొక్కక తప్పదేమో నన్పించిందాయనకు- పేపరు చూస్తూనే ఒక ట్రెండు మార్లు కిటికీలోంచి వీధిలోకి దృష్టి సారించారు- ఆయన కళ్ళూ మనసూ రెండో కొడుకు త్రివేది కోసమే ఎదురు చూస్తున్నాయి-

అంతలోకి వీధి గుమ్మంలోకి ఆటో వచ్చి నిల్చుంది అందులోంచి త్రివేది దిగేడు- రెండు పెద్ద అట్ట పెట్టెలను ఆటో డ్రైవర్ సాయంతో తీసుకువచ్చి ముందు గదిలో పెట్టించేడు-

పెట్టెల వంక చూసేరు సాంబయ్యగారు- వాటిపై తన ఎడ్రసూ, పంపినవారి ఎడ్రసూ స్పష్టంగా వున్నాయి- ఆటో వాడిని పంపేసి, సీలు చేసిన అట్ట పెట్టెలను విప్పడం మొదలు పెట్టేడు త్రివేది- పార్వతమ్మ కూడ లోపల్నించి వచ్చి ఎదురుగా కూర్చుంది- తనకోస మేదో తెచ్చామని తల్లీ దండ్రీ చెప్పి, చూపించే వరకూ కళ్ళు మూసుకుంటే మూసుకున్న ఐదేళ్ళ పాపాయి ఆతృతలా వుందిప్పుడు సాంబయ్య గారి పరిస్థితి- కాకపోతే ఆ ఆతృతని పైకి కన్పించనీయటం లేదు-

ఒక అట్టపెట్టె మూత తెరిచి లోపలవాటిల్లో రెండు పుస్తకాలు బయటకు తీసి ఒక పుస్తకం తండ్రికీ, మరొకటి తల్లికీ అందించేడు త్రివేది-

అప్పుడే పుట్టిన పసిబిడ్డను ఒడిలోకి తీసుకున్నట్టు ఆప్యాయంగా ఆత్రంగా పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నారు సాంబయ్యగారు-

దాని ఆవిర్భావానికి వెనుక జరిగిన కథంతా తెల్సినదే అయినా కలా నిజమా అన్నంత ఆశ్చర్యంతో ఆయన కళ్ళు మెరిశాయి- ముఖచిత్రం ఎంతో అందంగా సహజంగా వచ్చింది- వెనుక అట్ట మీద నిండుగా ఆయనదే రేఖా చిత్రం వుంది- దానికి కాస్త దిగువగా పరిచయ వాక్యాలు క్లుప్తంగా అచ్చేసి వున్నాయి-

"పుస్తకం చాలా బాగా వచ్చింది కదండీ. ఫొటో కాకపోయినా ఫొటో లో వుండేంత జీవకళా ఆ గీతల్లో తీసుకొచ్చాడా చిత్రకారుడు- ఈ శుభ సమయంలో స్వీట్ పట్టుకొస్తా వుండండి" అంటూ లోపలికి వెళ్ళింది పార్వతమ్మ.

పెట్టెల్ని లోపలిగదిలోకి చేరవేసేడు త్రివేది-

పుస్తకం విప్పి పేజీలు తిరగవేశారు సాంబయ్య గారు- తెల్లని కాగితం, అందమైన అచ్చు - ఎంతో అద్భుతంగా తన కోరిక మేరకు వచ్చిందనిపించింది.

పార్వతమ్మ ప్లేటుతో కోవాతెచ్చి ఆయనముందు పెట్టి వెళ్ళింది- నోరు తీపి చేసుకుని మరో మారు పుస్తకం వంక చూశారాయన - మనసంతా ఆనందంతో నిండి పోయింది-

"ఏనాటి కోరిక యిది! ఇన్నాళ్ళకు యిలా తీరింది!!" అనుకుంటూంటే ఆయన కనుకొలుకుల్లో నీళ్ళు జేరాయి-

పాతికేళ్ళ క్రితం కాబోలు... తను రచయితగా కలంపట్టి తొలి కథను ప్రచురించాడు- పెద్దమ్మాయి కడుపులో వుంటే పురిటికోసం పార్వతి వాళ్ళ పుట్టింటి కెళ్ళినపుడు రాశాడు మొట్ట మొదటి కథను- ఆ కథ సరిగ్గా అమ్మాయి పుట్టిన రెండు రోజులకు అచ్చయి తన చేతి కొచ్చింది- అప్పటి ఆ సంతోషం అంతాయింతా కాదు- తన కలం నించేకాదు తన యింటకూడ సరస్వతి పుట్టిందన్నాడు- అమ్మాయికి సరస్వతి పేరే పెట్టేడు-

ఆ కథకొచ్చిన పారితోషికం తక్కువే కావొచ్చు - కానీ అప్పట్లో సరస్వతి అన్న ప్రాశనకు ఆదబ్బుతో చిన్న వెండి గిన్నె వచ్చింది - ఆ తర్వాత రెండు సంవత్సరాలలో ఐదారు కథల వరకూ అచ్చయ్యాయి - వాటి నుండి వచ్చిన డబ్బునూ కూడ తను సరస్వతి కోసమే ఖర్చు చేశాడు-

కూతురైతేనేం? ఇప్పుడిలా తన రుణం తీర్చుకుంది!

ఆ మాటకొస్తే నాలుగేళ్ళ వయసు నుండే సరస్వతి తన రచనా వ్యాసంగానికి సాయపడింది - కథరాసి ఒక్కొక్క కాగితమే అందిస్తే క్రింద కూర్చుని వాటిని చక్కగా దొంతు పెట్టేది- మరికాస్త పెద్దయ్యాక పేజీ నెంబర్లు కూడ వేసేది! ఆ సరస్వతే యిప్పుడు తన కథలను కొన్ని ఒక చోట చేర్చేందుకు దోహదపడింది-

సరస్వతి తల్చుకోక పోతే యిది అయ్యేదికాదు! కూతుర్ని తల్చుకుంటూంటే సాంబయ్య గారి మనసులో ఒక్క మారు ఆనందం పొంగి పొరలింది-

అందం, తెలివి, చలాకితనం, పట్టుదల అన్నీ

ఈ వారం
టి. ఎ. తార



# నా కనుల అందం నాదే

టి. ఎ. తార అర్చన జోగళ్ కర్‌కి నాట్యమన్నా, నటన అన్నా అమితమైన ప్రేమ. సమాజంలోని కుళ్ళుని, సమాజ పరంగా స్త్రీ జాతికి జరుగుతున్న అన్యాయాలను తలచుకుంటేనే ఆమె కసహ్యం. మూడ్‌ని బట్టి గిటార్ వాయించడమో, పెయింటింగ్ చేయడమో, లేదా సంగీతం వినడమో ఆమె హాబీ. మామూలుగా పాశ్చాత్య దుస్తులంటేనే ఆమె మోజు చూపుతుంది.

"నా రూపానికంతా నా కళ్ళే ఆకర్షణ. నా నిజాయితీ, నాట్యంలో, నటనలో నా కున్న ఆత్మ విశ్వాసమే నా శక్తి. కానీ నాకూ ఒక బలహీనత ఉందండోయ్! నన్ను ఉపేక్షిస్తున్నారేమో అనే అనారోగ్యపు ఆలోచనే నా బలహీనత. నటీమణుల గురించి మాత్రం నన్ను అడగకండి, నటుడు కమల్ అంటే మాత్రం నాకు అభిమానం" అంటోంది ఈలలామ.

"అర్చన షూటింగ్ ఉన్న రోజులలో సాధారణంగా ఉదయం 6 గంటల కల్లా నిద్రలేచి తయారయి షూటింగ్‌కి వెళ్ళి పోతుందట. ప్రొద్దున షూటింగ్ పని ఉంటే సాయంత్రం ఆరు కల్లా ఇల్లు చేరి షాపింగ్ చేయడం అంటే ఆమెకి సరదాట!

తీరిక వేళల్లో ఇంటి చుట్టూ తిరుగుతుంటాను. షూటింగ్ రోజులలో చిందర వందరగా వదిలేసిన నా గదిని శుభ్రం చేసి మళ్ళీ ఒక ఆకృతికి తెస్తుంటాను. ఇంకా డైరీ వ్రాయడం, వీడియో సినిమాలు చూడటం, అపాయింట్‌మెంట్స్ ఫిక్స్ చేసుకోవడం శలవు రోజుల్లో నా కార్యక్రమాలు అంటోంది ఈ అందాల తార.

"1983లో ఉత్తమ మరాఠీ రంగస్థల నటిగా అవార్డు నందుకున్న క్షణాలు జీవితంలో మరపురాని మధురమైన క్షణాలు" అంటోంది ఆమె.

అర్చన నటించిన ఏడు చలన చిత్రాలలో నాలుగు విడుదలయ్యాయి. ఇంకా మూడు విడుదల కావలసి ఉంది. నాలుగు టి. వి. సీరియల్స్‌లో మూడు ప్రసారమయ్యాయి. నటనలో ఆమె చూపిస్తున్న ప్రజ్ఞా పాటవాలు ఆమెకు ఉజ్వల భవిష్యత్తు ఉందని చెప్పకనే చెపుతున్నాయి.

-పి. ప్రమీల

# ఆవిష్కరణ

వున్నాయి సరస్వతిలో – ఆవిషయంలో మగపిల్లలైన చక్రధరం, త్రివేది కూడ ఆమెకు ఏరకంగానూ సాటిరారు– ఆ కారణం చేతనే కాబోలు సరస్వతి పెళ్ళి తనకొట్టే భారం కాలేదు–

పెళ్ళిళ్ళు చేసుకుని వెళ్ళిన చాల మంది ఆడపిల్లలు తల్లిదండ్రులను మర్చి పోయి. భర్తలకు తగ్గ భార్యలుగానే అయిపోవడం, ఆగూటి పలుకులే పలకడం చూశారు– కానీ సరస్వతి ఆ కోవకు చెందదు. ఆమెకు తన మీద మమకారం పోలేదనడానికి యింతకంటే నిదర్శనం యింకేం కావాలి?

తొలికథ రాసిన తర్వాత పదేళ్ళలో సుమారొక పాతిక కథలు రాసేడు– వాటిల్లో కనీసం పది కథలైనా మంచివీ, నలుగురూ మెచ్చినవీ వున్నాయి–

"నీ కథలు కేవలం వూహాజనితాలు కావు సాంబయ్యా వాటిల్లో జీవితం కన్పిస్తుంది – ప్రతికథా ఏదో ఒక సాంఘిక సమస్యను ప్రతిబింబిస్తుంది– ప్రజాజీవితాలకి అద్దం పట్టేదిలానే వుంటుంది– పాత్రల స్వరూప స్వభావాలూ, వాటి మధ్య ఏర్పడే సంఘర్షణ సహజంగా వుంటాయి' అనేవారు మిత్రులూ, శ్రేయోభిలాషులూ– ఆ విమర్శలే, ఆ పొగడ్తలే ఆ తర్వాత రచనలకు వూపిరి అయ్యేయి– అప్పట్లోనే కలిగింది తనదంటూ ఓ కథాసంకలనాన్ని వెలువరించాలని– కానీ పుస్తక ప్రచురణంటే మాటలా?

ఆ విషయమై తర్వాత ఎన్నెన్నో ఆలోచనలు చేశాడు ఆ తర్వాత రాసిన కథల పారితోషికాల్ని ఒక చోట వుంచేడు. సరస్వతి పెళ్ళి నిశ్చయమైన సమయానికి ఆ సొమ్ము రెండు వేలకు దగ్గరగా పోగైంది. ఆ సొమ్ముతో పుస్తకానికి సరిపోయే కాగితం కొనేస్తే ప్రింటింగ్ ఖర్చులు తర్వాత చూసుకో వచ్చునుకున్నాడు- కానీ అనుకోని రీతిలో ఆ సొమ్ము పెళ్ళిలో ఖర్చయి పోయింది అలా అయినా తనేం బాధపడలేదు తనకు ప్రాప్తముంటే పుస్తకానికి సొమ్ము దానంతటదే సమకూరుతుందని ధైర్యంగానే వున్నాడు మరోమారు అలా కూడబెట్టిన సొమ్ము కూడ చక్రధరం ఉద్యోగం కోసం సెక్యూరిటీ డిపాజిట్‌గా కట్టాల్సి వచ్చింది. అప్పుడూ బాధపడలేదు. తనకు తన కోరికలకంటే బాధ్యతల నిర్వహణే ఎక్కువను కున్నాడు.

చక్రధరం ఉద్యోగస్తుడై వెళ్ళిక తనాట్టే రచనలు చేయలేదు. ఏ పత్రికల వాళ్ళయినా అడిగితే ఒకటి రెండూ –– అంతే! అంతకు మించి లేదు. సరికొత్త ట్రెండ్స్ సెట్ చేసి, కల్పనా సాహిత్యపు పరిధినీ, పరిమాణాన్నీ అనూహ్యంగా మార్చేస్తున్న యీ కొత్తయుగపు రచయితల కాలంలో తనింతకంటే ఏం రాయనక్కరలేదు– ఇంత వరకూ సుమారుగా రెండు వందల కథలు రాసేడు. గొప్ప కథలని చెప్పలేడు గానీ వాటిల్లో వలభై కథలైనా మంచివీ, మేధావి రచయితలు మెచ్చినవీ వున్నాయి.

మంచి కథలు అప్పటప్పుడు పత్రికల్లో అచ్చయినా, అవన్నీ ఒక సంకలనంగా వస్తే గాని ఆ రచయిత యొక్క రచనా విశిష్టతనూ, కల్పనాశక్తినీ మేధావులు అంచనా వేయడానికి వీలుండదు. రచన కొంత కాలం భౌతికంగానైనా బ్రతికుండడానికి పుస్తకరూపంలో వచ్చి తీరాలి. ఆకారణంచేత పుస్తకం వెలువరించాలనే కోరిక సాంబయ్య గారి మనసులోంచి తొలగి పోలేదు

'సరస్వతి పూనుకోకపోతే యీ నాటికీ తనా విషయంలో అశక్తుడిగానే మిగిలి పోయేవాడు' అనుకున్నారు సాంబయ్యగారు.

సంక్రాంతికి నాలుగురోజుల ముందే వచ్చింది సరస్వతి. వస్తూ వస్తూ ఓ పెద్ద తెల్లకాగితాల బండిల్‌ని తెచ్చింది.

"మీ అల్లుడుగారు మీకిది సంక్రాంతి బహుమతిగా యిమ్మన్నారు నాన్నా" అంది తన గదిలో పెట్టిస్తూ కాగితాలు నున్నగా తెల్లగా బాగున్నాయి ఖరీదైన వనే అన్పించింది. 'మేప్‌లిథో' అంటారట ఆ కాగితాన్ని.

'బహుమతులు నేను అల్లుడి కివ్వాల్సింది పోయి ఆయన నాకివ్వడ మేంటమ్మా' అన్నాడు.

మీ కథల్ని ఒక పుస్తకంగా వేయాలని మీరెప్పట్నించో అనుకుంటూన్నారు కదనాన్నా. అందుకోసం వుంచిన డబ్బుకూడ నా పెళ్ళిలో ఖర్చయి పోయింది ఆవిషయం ఆయనకెప్పుడో చెప్పేను". అంది సరస్వతి

మనసు తెల్సుకుని ప్రవర్తించే భార్యా పిల్లలూ. అంతకంటె మంచి మనసున్న అల్లుడూ. నిజంగా ఎంత ఆనందించాడో

ఆ మరుసటి నెలే చక్రధరం మూడు వేల రూపాయలకి తన పేర్న ఓ డ్రాఫ్టు పంపేడు.

"కాగితం ఎటూ వుంది కాబట్టి నీకథల పుస్తకం ప్రచురణ మొదలెట్టేయ్ నాన్నా అందాకా యీ సొమ్ము ప్రెస్ వాడికి అడ్వాన్సుగా యివ్వు. అవసరమైతే మళ్ళీ పంపుతాను" అంటూ ఉత్తరం కూడరాసేడు. సెలవును సొమ్ము చేసుకునే సదుపాయం కొత్తగా వచ్చిందిట వాళ్ళకి. తన ఖాతాలో వున్న సెలవును అమ్మేసి ఆడబ్బును పంపేడు చక్రధరం.

ఆ ఉత్తరం చదువుతూంటే కళ్ళంట నీళ్ళు తిరిగాయి. "ఎవరి పిల్లలు! ఎవరిలోకం! పెంచి పెద్ద చేసే వరకే రెక్కలొచ్చాక ఎగిరే పక్షులే! అనుకుంటారు గానీ అందరూ అలాకాదు. ముఖ్యంగా తన పిల్లలు తలిదండ్రుల మనసుల్ని యిష్టాల్ని గ్రహించిన వాళ్ళు' అనుకున్నాడు.

"ఇంకేమండీ. ఎంచక్కా కూతురూ అల్లుడూ కాగితం యిచ్చేరు కొడుకు డబ్బు పంపేడు. తొందరగా ఆపుస్తకం పనేదో చూడండి" అని తొందర చేసింది పార్వతి.

'అవునునాన్నా. నేనూ యిప్పుడు ఖాళీయే కాబట్టి ప్రూఫులు చూడ్డం లాంటి పన్లు చేయగలను" అన్నాడు త్రివేది.

ఓ మంచి రోజు చూసి ఉన్న కథల్లో ఓ పాతిక కథల్ని తీసి, విజయవాడ బయల్దేరేడు. దారిలో చిన్ననాటి స్నేహితుడు శాస్త్రి కలిస్తే కబుర్లు రచనలపైకి మళ్ళి, తను వెళ్ళే పని గురించి చెప్పేడు.

"బావుందయ్యా – ఇంత గొప్ప రచయితవి. నీకథలు నువ్వే పుస్తకం వేయించుకోడమేంటి? పబ్లిషర్లే వేస్తారు. కాసో కూసో ముట్ట జెపుతారు కూడ. వాకబు చెయ్యి. అమ్ముకోడం, సొమ్ము చేసుకోడం మనకి చేతకాని పని–" అని ఓ ఉచిత సలహా పారేశాడు.



# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం, పరిపూర్ణ పోషకాహారపు మంచితనం అందజేస్తుంది. 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్థాలు ప్రవేశ పెట్టేటప్పుడు, నెస్టమ్‌తో ప్రారంభించండి. బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్, తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది. అంతేకాదు, నెస్టమ్, ఇనుము, విటమిన్‌లతో మరింత బల వర్ధకం చేయబడింది.



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే, పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్ మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసిన మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు, పప్పు పండ్లు నెస్టమ్‌లో కలపండి

కేవలం రూ 9/-* కే డబ్బాలో 200 గ్రా. సంచీ




* స్థానిక పన్నులతో సహా

**ఉచితం !**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016
న్యూ ఢిల్లీ 110 008



Nestlé

ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది.

అతని సలహా ప్రకారం వాకబుచేస్తే.

"కథల పుస్తకాలీరోజుల్లో కొనేదెవరు మాష్టారూ- ఇప్పుడు వస్తున్నదీ మార్కెట్లో విరివిగా అమ్ముడౌతున్నదీ నవలాసాహిత్యమే- సస్పెన్స్, క్రైం, సెక్స్, సైంటిఫిక్ ఫిక్షన్ – వీటిపై రాయండి తప్పక వేస్తాం ఎంత సాహిత్య సేవ చేస్తున్నా యిదీ వ్యాపారమే కదసార్" అన్నాడొక పబ్లిషరు

ఇంచుమించు అదే భావాన్ని వెల్లడించేరు మరికొందరు పబ్లిషర్లు. అయితే "మీరు వేయించుకుంటామంటే అందంగా అచ్చువేసి యిస్తాం" అనిహామీ యిచ్చేరు.

మొత్తానికి పుస్తకానికయ్యే ఖర్చు తెల్సుకుని కొంత అడ్వాన్సు యిచ్చి సరిపడా కాగితం, కొన్ని కథలూ కూడ యిచ్చి తిరిగి వచ్చేడు సరిగ్గా అప్పుడు ఎదురైంది ముఖచిత్రం సమస్య

ముఖచిత్రం కమర్షియల్గా వేయించండిసార్ పుస్తకాలు అమ్ముడవ్వాలంటే ముఖచిత్రం ఆకర్షణీయంగా వుండాలి' అన్నాడు పబ్లిషరు

ప్రముఖ చిత్రకారుడు భారవిచేత ముఖచిత్రం వేయించాలనుకున్నాడెప్పుడో ఆయన చిరునామా కనుక్కొని, ఇంటికొచ్చేక ఆయన పేర్న ఓ నూట పదహార్రూపాయలకు డ్రాఫ్టు పంపుతూ బొమ్మ వేయవలసిందిగా కోరుతూ ఉత్తరం రాసేడు– వారం తిరక్కుండానే బారవి నుండి కవరొచ్చింది ముఖచిత్రం డ్రాయింగుతో పాటు ఓ ఉత్తరం , తను పంపిన డ్రాఫ్టూ ఉన్నాయందులో

"మాష్టారూ మీ దగ్గర చదువుకున్న వేలాది మందిలో నేనూ ఒకణ్ణి మీ చిత్రానికి ముఖచిత్రం వేయడమే అదృష్టంగా భావిస్తున్నాను పుస్తకం అచ్చయి వస్తే మీ సంతకంతో ఒక కాపీ పంపితే దాచుకుంటాను అంటూ రాశాడు

మనుషుల్లో మంచివాళ్ళుంటారు. తన శిష్యుల్లోనూ చెప్పుకోదగ్గ అటు ముత్యాల్లాంటి వాళ్ళున్నారు. అన్పించింది సాంబ య్యగారికి.

* * * * *

ఇన్నాళ్ళకి ... తను కోరుకున్న పుస్తకం చేతికొచ్చింది దీని వెనుక తను కథలు రాసి పడిన కష్టంకంటే పిల్లల అభిమానాలే ఎక్కువగా అన్పించాయి

ఆ వెంటనే పుస్తకాలు ప్రెస్ నుండి వచ్చినట్టు సరస్వతికీ, చక్రధరానికీ ఉత్తరాలు రాసి పడేశారు సాంబ య్యగారు.

మూడో రోజు ఉదయమే సరస్వతి వచ్చింది

"ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్నాను. ఏది నాన్నా నీ పుస్తకం" అని అడిగింది గుమ్మంలోకి అడుగు పెడుతూనే తను భద్రంగా పేక్ చేసిన మొదటి పుస్తకాన్ని కూతురి చేతికందించారు సాంబ య్యగారు- విప్పి, అందంగా వచ్చిన పుస్తకాన్ని చూసి ఆనందపడింది సరస్వతి తర్వాత పేజీతిప్పింది మొదటి పెజీలో ఆకుపచ్చ యింకు పెన్నుతో రాసిన ముత్యాల్లాంటి పదాల్ని చదివింది

'ఇది సరస్వతీ కటాక్షం అందుకే ఇది నా తల్లి సరస్వతికి ప్రేమతో' అనివుంది

'ఇదేమిటి నాన్నా ఇది నాకాపీనా' అంది

అవునన్నట్టుగా తలూపేడు సాంబ య్యగారు

"పుస్తకాలు అప్పుడే ఎవరికీ యివ్వకునాన్నా ఆవిష్కరణ సభ జరపాలిగా' ఆ తర్వాతే ఎవరికైనా యివ్వవుగాని" అంది

"నా పుస్తకానికింకా ఆవిష్కరణేమిటమ్మా అదిప్పుడే నా తల్లి సరస్వతి చేతుల మీదుగా జరిగి పోయిందిగా" అంటూ నవ్వేరు సాంబ య్యగారు

"బావుంది నాన్నా నాకేంతెల్సు నీ పుస్తకాన్ని సాహితీపరులెవరో ఆవిష్కరించాలి గొప్ప రచయితలు ఆ పుస్తకంలోని గొప్పదనాన్ని నలుగురికీ విప్పి చెప్పాలి. నీ పుస్తకం యొక్క గొప్పదనం నలుగురికీ తెలియాలంటే ఆవిష్కరణ జరిపి తీరాలి మీ అల్లుడిగారి కోరికకూడా అదే అంది. సాంబ య్యగారు ఆలోచనలో పడ్డారు.

పార్వతి, త్రివేది కూడ అదే అభిప్రాయాన్ని బలపరచారు.

ఆ మర్నాడే చక్రధరం నుండి ఉత్తరం వచ్చింది. పుస్తకాన్ని వెంటనే చూడాలనిపించినా ఆఫీసులో ఆడిట్ పార్టీ వుండటాన రావడానికి వీలుపడలేదనీ, ఆవిష్కరణ సభ త్వరలో ఏర్పాటు చేయించమనీ, దానికయ్యే ఖర్చు రాస్తే తను వచ్చినప్పుడు తేగలననీ.... రాశాడు

ఆ రాత్రి బాగా ఆలోచించారు సాంబ య్యగారు తన అభిప్రాయంకంటే పిల్లల కోర్కె తీర్చడమే సబబనిపించిందాయనకు. అయితే ఆవిష్కరణ జరిపించడమంటే ఎవరింట్లో వారు పండగ జరిపించుకున్నట్టు కాదు. పుస్తకం ఆవిష్కరించడానికి యోగ్యులైన వారు కావాలి. ఒకరు యిద్దరు వక్తలుండాలి. వారి గౌరవార్థం పూలదండలు, గుచ్ఛాలు వుండాలి. సభావేదిక వుండాలి. అన్నిటికంటె ఇది తిలకించి, విని ఆనందించే సహృదయ ప్రేక్షకులుండాలి. వీటి ఏర్పాట్ల కోసం ఒకర్ని ఆశ్రయించక తప్పదు. అది తన మనసుకు నచ్చనిపని! – దీర్ఘంగా నిట్టూర్చేరు సాంబ య్యగారు.

మర్నాడు విషయాన్ని తోటి ఉద్యోగస్తుడైన కృష్ణమూర్తితో చెప్పేడు. కృష్ణమూర్తి వయసులో తనకంటే చిన్నవాడూ, సాహిత్యాభిలాషీ. అంతా విని, "పుస్తకావిష్కరణ జరిపించాలి మాష్టారూ – కొత్త యింటికి గృహప్రవేశంలా కొత్త పుస్తకానికి ఆవిష్కరణ కూడ ముఖ్యమే. ఆ ఆచారం పూర్వం నుండే వస్తోంది. గ్రంథ రచయిత పాఠకులకు పరిచయం కావడానికి అది దోహద పడుతుంది అటు ప్రచారం, ఇటు వేడుక రెండూ జరుగుతాయి పోతే ప్రచారమూ అవసరం కాని పేరున్న గ్రంధకర్తలే ప్రచురించిన తమ ప్రతి పుస్తకాన్ని వూరూరా ఆవిష్కరించుకుంటూంటే, జీవితకాలంలో ఒకటి రెండు పుస్తకాలు తప్ప వేయించుకోలేని మీ వంటి వారు తప్పని సరిగా ఆవిష్కరించాలి. ఏర్పాట్లంటారా ఆ సంగతి నా కొదిలెయ్యండి మన వూళ్ళో మాజీ సాంస్కృతిక సంఘముంది వాళ్ళీ సభను ఏర్పాటు చేస్తే బావుంటుంది ఆ సంఘ కార్యదర్శికి ఈరోజే మిమ్మల్ని పరిచయం చేసి విషయం చెబుతాను అన్నాడు కృష్ణమూర్తి

సాంబ య్యగారు ఏం మాట్లాడలేదు సరేనన్నట్టు తలపంకించేరు

ఆ సాయంకాలమే కార్యదర్శి వెంకట్రావుకి సాంబ య్య గార్ని పరిచయం చేసి సంగతిని వివరించేడు కృష్ణమూర్తి



సాంబ య్యగారు ఆంధ్రదేశంలో గల గొప్ప కథా రచయితల్లో ఒకరనీ, ఆయన పుస్తకావిష్కరణ సభ జరపడం ఆ వూరి ప్రజల అదృష్టమనీ యిలా ఎన్నో చెప్పేడు – అయితే అంతా విని.

"బాగానే వుందండీ – కవుల్నీ రచయితల్నీ గౌరవించొచ్చు– కానీ వున్న సొమ్మంతా శ్రీరామ నవమి నవరాత్రులకే ఖర్చయిపోయింది– మంచి కార్యక్రమాలు జరిపించడమే మా వంతు గానీ చందా లెవరిస్తున్నారు చెప్పండి? ఫండ్స్ కూడేక, కావలిస్తే వినాయక నవరాత్రుల్లో యీ తంతూ జరిపించేద్దాం – జనం కూడ వస్తారు – ఖర్చు కూడ ఆ లెక్కలోకి పోతుంది" అంటూ తేల్చేసేడాయన.

ఆ జవాబు విని కృష్ణమూర్తికి నోట మాట రాలేదు– కాస్త తేరుకున్నాక నచ్చజెప్పడానికి ప్రయత్నించేడు.

"ఖర్చు కూడ ఆట్టే ఏం వుండదు సార్– నాలుగు పూలదండలు, బొకేలో– అంతే! రచయితకీ ఆవిష్కరణకీ కావల్సిన శాలువాల సంగతి ఆయన అభిమానులు చూసుకుంటారు – మీరు పెద్దలను రప్పించి సభ ఏర్పాటు చేస్తే చాలు – ఇన్విటేషన్ల ఖర్చు కావలిస్తే మా స్కూలు వాళ్ళం పెట్టుకుంటాం – సాంస్కృతిక సంఘం కాబట్టి యీ సాహితీ ఉత్సవం మీ చేతుల మీదుగా జరిపిస్తే బావుంటుందని నా వూహ."

కార్యదర్శి గారేం కొరుకుడు పడలేదు.

"అది మాత్రం తక్కువదా చెప్పండి. సాహితీ సభలకు రాజకీయ నాయకులొస్తారా? కాకపోతే ఎవర్ని పిలవాలి? డబ్బే ఎలాగోలా పోగెయ్యవచ్చు– సాహిత్య సభలకు యిరుపక్షాల జనాన్నీ పోగెయ్యడం కంటే"

ఇక అక్కడ పని అయ్యేలా లేదని వచ్చేశారు– ఆ తర్వాత మరో చోట కూడ ప్రయత్నించి విఫలుడయ్యేడు కృష్ణమూర్తి.

సాంబ య్య గారికి తల కొట్టేసినట్లయింది– ఈ బాధ భరించే కంటే పిల్లలకే ఎలాగో నచ్చజెప్పుకోవచ్చనుకున్నారాయన–

ఆ మర్నాడు బజార్లో సాంబ య్య గారికి వెంకటప్పయ్య కన్పించేడు. "ఏంటోయ్– పుస్తకమేదో అచ్చేయించి ఆవిష్కరణ కోసం తిరుగుతున్నావటగా! ఎంత వరకూ వచ్చిందీ" అంటూ ఎగతాళిగా ప్రశ్నించేడు–

వెంకటప్పయ్యకి తనో పెద్ద కవినని అహంభావం – గిరజాల జుట్టూ, నిరంతరం వంటి మీద పట్టు లాల్చీ, శాలువా– కానీ అతనేం రాస్తాడో అతనికే తెలీదు– పండగల మీద, నాయకుల మీద కవితలల్లుతాడు –తనకు తప్ప కవిత్వం రాయడం మరెవరికీ చాతకాదంటాడు – కవితలల్లటం అల్లాటప్పా విషయం కాదు– అది యీ వెంకటప్పయ్యకే చెల్లింది– అని మీసం మెలేస్తాడు.

సాంబ య్య గారేం మాట్లాడకపోడం చూసి,

పాఠకులకో సవాల్!



## మల్లెపూలూ, మంచి గంధం చాలవా? ఎండాకాలానికి?

ఇది ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి– ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలేగాని బాధించకూడదు. రసభరితంగా వుండాలేగాని అశ్లీలం కొట్ట వచ్చినట్లుండరాదు... కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం.ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!– ఈ విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. సంచిక విడుదలైన వారంలోగా పంపాలి.మర్చిపోకండి. –సం.

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక– మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేకపోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహ పడక మళ్ళీ ప్రయత్నించండి!

## "ఏమిటా... ఎగబడ్డం ముందు వెనుక చూడకుండా"

★ రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

**"అబ్బ! తప్పుకోవయ్యా బాబూ! నే నీ బస్సు డ్రైవర్ని!!"**

–ఎస్. శ్రీనివాసమూర్తి (నెల్లూరు)

★ రు. 15 బహుమతి పొందిన రిపార్టీ :

**"అవునోయ్... ప్రేమ గ్రుడ్డిదన్నారు కదా... విన్లేదూ?!"**

–ఉజ్వల ప్రసాద్ (రామవరం)

### మరి కొన్ని వాగ్బాణాలు

"అమ్మో... తల్లీ! వెనక నా భార్య అప్పడాల కర్రతో వచ్చేస్తోంది.... తప్పుకోండి పారిపోవాలి!" –జి. నరసింహమూర్తి (అయిజ)

"ఏంటమ్మో, కండక్టర్నే అంత మాట లంటావా ముందు టికెట్టుకు డబ్బు లిస్తావా లేదా?"

–టి. రాంప్రసాద్ (ప్రొద్దుటూరు)

"అలా చూడబట్టే మూడు బస్సులు వచ్చి వెళ్ళినా... నే నింకా యిక్కడే వున్నాను" –బొబ్బిలి శ్రీనివాసరావు (ద్రాక్షారామం)

### లక్కీ పేర్లు :-

ఎం విజయ భాస్కరరెడ్డి (రామవరం), జి. విజయలక్ష్మి (విజయపూరి నార్త్), జి. నాని (వరంగల్), జి. ఎస్. ఎన్ మూర్తి (పెదపాడు), బి. మురళి (తెనాలి), ఎన్. సుబ్బలక్ష్మి (రేపల్లె), ఇ. సుబ్రహ్మణ్యేశ్వరరావు (మచిలీపట్నం), మంచెం నాగశైలి (సామర్లకోట), షేక్ ఫక్రుద్దీన్ (కందుకూరు), వి. శేషగిరిరావు (కూరాడ), ఎస్. విజయ నిర్మల (చిన ఓగిరాల), ఎ. శ్రీనివాసరావు (పాలకొల్లు).

"ఎందుకొచ్చిన ఆవిష్కరణలులే- బోలెడు డబ్బు ఖర్చు - నువ్వు చెయ్యలేవు- దాని వల్ల కలిసొచ్చేదీ లేదు-" అనేసి తన దార్న చక్కాపోయాడు

ఆ వూళ్ళో వెంకటప్పయ్యని చాల మంది కవిగా గుర్తిస్తారు -ఆ గుర్తింపు కోసం అతను చాలా హంగామా చేస్తాడు- అతనికి రాజకీయ వర్గంలో కూడ పలుకుబడి వుంది- ఎవర్నెలా లోబర్చుకోవాలో, ఎవరి చేత పనులెలా చేయించుకోవాలో అతనికి బాగానే తెల్సు - ఏదో ఒక రకమైన గ్రాంటుతో మూడేళ్ళ కోమారు ఓ పుస్తకాన్ని ప్రచురిస్తూంటాడు- దానికి ఆవిష్కరణ సభ ఏదో ఒక వూళ్ళో జరిపిస్తూనే వుంటాడు- ఒకే పుస్తకానికి చాల చోట్ల ఆవిష్కరణలు జరిపిన ఉదంతాలూ వున్నాయి- ఓమారొక ఆవిష్కరణ సభకి వెంకటప్పయ్య స్వయంగా పిలిస్తే వెళ్ళేరు సాంబ య్య- సభ భారీఎత్తున జరిగింది- ఒక మంత్రిగారు ముఖ్యఅతిథి- మరో మంత్రిగారు ఆవిష్కర్త- స్థానిక ఎమ్మెల్యేగారు వక్త- వీరుకాక వేదిక మీద మరో సినీ నిర్మాత- వెంకటప్పయ్య సరేసరి- అందరికీ నిలువెత్తు గులాబీ దండలు - ఎందరో ఫోటోగ్రాఫర్లు ముందు వరసలో పత్రికా విలేఖరులూ - అయితే మంత్రులిద్దరికీ సాహిత్యం గురించి ఏమీ తెలీదు- ఏవేవో మాట్లాడేరు- సహజ ధోరణిలో వాగ్దానాలేవో చేసేరు- కవిగారి బాహ్యసౌందర్యాన్నీ గుణాల్నీ ఒకరు పొగిడితే మరొకరు దుశ్శాలువ కప్పి సత్కరించేరు- దానికి జవాబుగా ఆవిష్కరణ తంతు అయ్యేక వెంకటప్పయ్య కూడా తన శక్తి మేరా వేదిక మీది అందర్నీ పేరు పేరునా పొగిడేడు- అటువంటి వారి అండదండలుండడం వల్లే తను కవిత్వాన్ని రాయగలుగుతున్నానన్నాడు - వారి అభిమాన ముండాలే గాని ఏడాదికో పుస్తకాన్ని తను ప్రచురించగలనన్నాడు- సభ అవుతూండగా హాల్లోని జనాన్ని చూసి ఆశ్చర్యపోయారు సాంబ య్యగారు- పట్టుమని పాతిక మందైనా లేరు- వీళ్ళ కోసమేనా యీ హడావుడంతా అన్పించింది - ఆ మర్నాడు అన్ని పత్రికల్లోనూ ఆవిష్కరణను గురించిన వార్తలు ఫోటోలతో సహా ప్రచురింపబడ్డాయి.

ఆ వెంకటప్పయ్యే యిప్పుడు తనకు వద్దని సలహా యిస్తున్నాడు- నిట్టూర్చేరు సాంబ య్య గారు-

ఓ మారు తన కథకి బహుమతొచ్చిందని చెబితే వెంకటప్పయ్య చాల అపహాస్యం చేశాడు

"నువ్వేం అనుకోకు గానీ యీ రోజుల్లో సాహిత్యపు విలువలు బాగా పడిపోయాయి" అంటూ చాలా చాలా విషయాలపై తన అక్కసును వెళ్ళబుచ్చాడు-

అప్పుడూ తనేం బాధ పడలేదు- వెంకటప్పయ్య తత్వం తనకు తెల్సు- 'ఎదుటి మనిషిలోని విలువను గ్రహించి గౌరవించే సంస్కారం అందరికీ వుండదు' అనుకొని సరిపెట్టుకున్నాడు-

ఏవేవో ఆలోచనలతోనే ఆ రాత్రి సగం వరకూ గడిపేశారు సాంబ య్యగారు-

మర్నాడు స్కూల్లో హెడ్ మాష్టరు గారు పిల్చి, "మీ పుస్తకం అచ్చయి వచ్చిందటగా- వచ్చే నెలలో మన స్కూల్ డే ఎటూ వుంది - ఆ సమయంలో నే మీ పుస్తకం ఆవిష్కరిస్తే బావుంటుందను కుంటున్నాను- మీరు సరేనంటే " అంటూ ఆగేరు-

సాంబ య్య గారికా పరిస్థితి యిబ్బందికరంగా తోచింది.

"చాలమంది విద్యార్థులకీ, కొంతమంది పేరెంట్సుకీ కూడ మీరంటే గౌరవభావం వుంది- కలెక్టరుగారు తప్పకుండా వస్తారు- సభ గొప్పగా వుండకపోవచ్చు- కానీ మీరంటే అభిమానమున్న వారి మధ్య మీ పుస్తకావిష్కరణ జరుగుతుంది-' అంటూ యింకా ఏవేవో మాట్లాడేరు హెడ్‌మాష్టర్ గారు-

విషయమంతా ఆయనతో కృష్ణమూర్తి చెప్పినట్లు గ్రహించేరు సాంబ య్య గారు- అయినా దేనికీ ఆయన పెదవి కదపలేదు- కానీ ఆయన మౌనాన్ని అర్థాంగీకారంగానే తీసుకున్నారు హెడ్ మాష్టర్ గారు-

* * * *

ఇల్లంతా సందడిగా వుంది-

ముందు రోజే సరస్వతి, ఆమె భర్త వచ్చారు- చక్రధరం కూడ భార్యాపిల్లలతో వచ్చేరు-

సాయంకాలం ఆవిష్కరణ సభ

మధ్యాహ్నం భోజనం చేసి మంచం మీద నడుం వాల్చారు సాంబశివయ్య గారు- ఉదయం తలంటు పోసుకున్నారేమో నిద్ర బాగా పట్టేసింది- మనసు, శరీరం ఎక్కడెక్కడికో తేలిపోతున్నట్లనిపించిం దాయనకు-

సాయంత్రం సభా ప్రాంగణం అందంగా అలంకరింపబడింది- ప్రస్తుత విద్యార్థులూ, పూర్వం ఆయన వద్ద చదువుకుని గొప్పవారైన వారూ, విద్యార్థుల తల్లిదండ్రులూ ఎందరో వచ్చారు. సభకు-పుస్తకం మీద అభిప్రాయం చెప్పేందుకు ఓ ప్రముఖ రచయిత, ఒక విమర్శకుడూ వచ్చారు- కలెక్టరు గారే యింకా రాలేదు- సాంబయ్య గారి కోసం యింటికి కారు పంపించేరు- అయితే ఆ సమయంలో సాంబయ్య గారింట్లో కలకలం మొదలైంది- అది నెమ్మదిగా ఏడ్పులూ, పెడబొబ్బలుగా మారింది- ఎవరెవరో ఏవేమో అంటున్నారు- ఆశ్చర్యపోతున్నారు - సానుభూతి ప్రకటిస్తున్నారు- "పాపం .. ఆవిష్కరణ జరగకుండానే...." అంటున్నారెవరో!

త్రుళ్ళిపడి లేచారు సాంబయ్యగారు-అదంతా కలే అనుకుంటే నమ్మలేనట్లుగా వుందాయనకు-

ఆ సాయంకాలం పోస్ట్‌మేన్ వచ్చి రెండు కవర్లిచ్చి వెళ్ళేడు- అందులో ఒకటి కలెక్టర్‌గారి నుంచివచ్చింది.

ఆ కవర్ని విప్పి చదవడం మొదలు పెట్టేరు సాంబయ్యగారు-

"మాష్టారూ! పూవనంలాంటి విద్యాలయంలో రేపటి పౌరులైన పిల్లల సమక్షంలో మీ పుస్తకానికి



## "ఫారా" పంతం!



హిందీ, తెలుగు చిత్రాల్లో నటిస్తున్న గ్లామర్ తార 'ఫారా'- చిత్రాలైనా వదులుకుంటుందట గాని తాను పట్టిన పట్టు వదలనని అంటూంది.

ఇటీవల ఒక చిత్రానికి సంబంధించి ఆమె నటిస్తున్న పాత్రకు డ్రస్సు కుట్టించుకొని దాని తాలూకు రు. 12,000 బిల్లు నిర్మాత చేతిలో పెట్టిం దట. ఆ నిర్మాత ఆ బిల్లు చూసి బిత్తర పోయాడట.

"అమ్మా, నువ్వు నటించే సీనులో యింత ఖరీదు గల బట్టలు వేసుకో కూడద"ని నిర్మాత ఎంత మొత్తుకున్నా వినలేదు సరికదా ఆ బిల్లు చెల్లించక-పోతే చిత్రంలో నటించటం మానేస్తానని కూడా చెప్పిందట. పాపం ఆ నిర్మాత బిల్లు చెల్లించకుండా మానగలడా!



అవిష్కరణంటే ఆనంద మనిపించింది- కానీ మాష్టారూ మీ పుస్తకం ఆవిష్కరించడానికి నేను తగను- నేను మీ దగ్గర విద్య నేర్చుకున్నాను మాష్టారూ- అంతేకాదు మీ అభిమానిని కూడ మీ కథల కటింగ్స్ చాల నా దగ్గరున్నాయి- పత్రికల్లో మీ కొత్త కథ చదివిన ప్రతిసారీ మీరు నా ముందు నిలుస్తారు- నిజం మాష్టారూ- మీరు కథలు రాయడం తగ్గిస్తే బాధపడే వాళ్ళలో నేనొకడిని- అంతర్జాతీయ స్థాయిలో అవార్డులు పొందాల్సిన మీ కథలు యితర భాషల్లోకి వెళ్ళలేదన్న బాధతో వెళ్ళాలనే కోరికతో ఈ మధ్యే మీ కథలు కొన్నిటిని ఇంగ్లీషులోకి ప్రచురించి ఒక పుస్తకంగా తీసుకు రాలనుకుంటున్నాను- ఈ సమయంలో నే మీ కథలు పుస్తకం వెలువడిందని తెల్సి చాల సంతోషించాను-

అయితే మాష్టారూ ఆవిష్కరణ విషయంలో నాదో చిన్న మనవి- పై నెలలో జ్ఞానపీఠ్ అవార్డు పొందిన ప్రముఖ బెంగాలీ రచయిత ఒకరు రాజధాని వస్తున్నారు- ఆ సందర్భంలో స్థానిక రచయితలతో, కవులతో ఒక సాహితీ సదస్సు కూడ ఏర్పాటవుతోంది- ఆ సాహితీ ప్రాంగణంలో మీ పుస్తకాన్ని వారి చేత ఆవిష్కరింప జేయాలని వుంది- వారికి మన కథలంటే అమితమైన మక్కువట- వీలైతే నేను తర్జుమా చేసిన మీ కథలను ముందుగా వారికి పంపి వారి అభిప్రాయాలను సేకరించాలని కూడ వుంది-

ఇవన్నీ నా అభిప్రాయాలు మాత్రమే- మీ అనుమతి కోసం ఎదురు చూస్తుంటాను "

ఆ ఉత్తరాన్ని రెండు మూడు మార్లు చదివేరు సాంబ య్యగారు- ఆయన మనసు ఆనందడోలిక లూగింది- అంతరాంతరాళంలో కలిగిన స్పందన శరీరానికి కొత్త వుత్సాహాన్నిచ్చింది- ఇప్పటి జిల్లా కలక్టరు మధుసూదనం ఒకప్పుడు తన శిష్యుడే అవడం ఆయన కెంతో గర్వాన్ని కూడ కలిగించింది-

ఒక్కక్షణమాగి, రెండో కవర్ని కూడ చేతిలోకి తీసుకుని విప్పేరు

మాననీయ మార్గ దర్శక రచయితలైన
శ్రీ సాంబ య్య గారికి,

అప్పుడెప్పుడో ప్రచురింపబడ్డ మీ 'బ్రతుకు బాట' కథను నేను యిటీవలే చదవటం తటస్థించింది- అందులో మీరు విపులీకరించిన జీవిత సత్యం, అవ్యాజమైన మానవత్వం, జీవన గమనంలో దగాపడ్డ, నిరాశ్రయ జీవికి మీరు చూపిన మార్గం, గమ్యం నా కెంతగానో నచ్చాయి- నా మనసుకు పట్టిన కథ అది- అస్తవ్యస్తమైన నా బ్రతుక్కి ఓ మార్గాన్ని చూపించిన కథ అది- నా బ్రతుకిప్పుడు చక్కబడిందంటే దానిక్కారణం మీరూ, మీ కథే

మీ వంటి గొప్ప రచయితల కథలు యింత వరకూ ఎందుకు చదవలేదా అని బాధ పడుతున్నాను- మీ రచనల కోసం అన్వేషిస్తున్నాను- అనుమతిస్తే త్వరలో నే మిమ్మల్ని కల్సుకోవాలనుకుంటున్నాను- మీరు చూపిన మార్గంలో 'పయనిస్తున్న- ధనంజయ '

పత్రికాఫీసు నుండి రీడైరెక్ట్ కాబడి వచ్చిందా ఉత్తరం- మరో మారు చదివారా ఉత్తరాన్ని సాంబ . య్య గారు- అతని కళ్ళలో సన్నని నీటి పొర జేరింది- అది మనసులోంచి తన్నుకొచ్చిన ఆనందపు పొర!

తను రచయితగా కృతకృత్యుడయ్యాడనడానికి యీ నిదర్శనం చాలు! మధుసూదనం వంటి ప్రతిభావంతులైన విద్యార్థులు, ధనంజయ వంటి పాఠకులు ఏ ఉపాధ్యాయుడికి గాని ఏ రచయితకు గాని ఒక్కరుంటే చాలు నన్పించింది

అవి చాలు తనకు! ఈ యిద్దరి మనసుల్లో తనకూ తన రచనలకూ ఉన్న ఆస్థానం చాలు!

తన పుస్తకానికిక ఆవిష్కరణ జరక్కపోయినా ఫర్వాలేదు- తన రచనలు యిటువంటి ఎందరి హృదయాల్లోనో ఎప్పుడో ఆవిష్కరింపబడి వుంటాయి!- అనుకున్నారాయన చమర్చిన కళ్ళను ఒత్తుకుంటూ-

* * *

సాంబ . య్యగారు అనుకున్నట్లే ఆయన పుస్తకానికి ఆవిష్కరణ మహోత్సవం జరగలేదు-

ఆయన ఉత్తరం చేరే లోగానే మధుసూదనం దూర ప్రాంతానికి మరో హోదాలో ఇనుకోకుండా బదిలీ అయి వెళ్ళిపోయేడు ●




## అదృష్టం

సిరి సంపదలతో తులతూగుతున్న వానినీ, నిర్విచారంగా- సుఖంగా కాలం గడుపుతున్న వానినీ చూచి 'అదృష్ట జాతకుడు' అని అందరూ ప్రశంసిస్తారు. ఇప్పటి వారిలో చాలా మంది అదృష్టాన్ని నమ్మరు. కష్టసుఖాలు, సిరి సంపదలు ప్రయత్నంపైనే ఆధారపడి ఉంటాయని వారి ఉద్దేశం. అదృష్ట శబ్దానికి అర్థం కనబడనిదీ అని. అది అప్రయత్నంగా- తలవని తలంపుగా వచ్చేది మాత్రమే. లాటరీలో రూపాయి టిక్కెట్టు కొన్న వానికి లక్షల కొద్దీ ధనం రావడం అదృష్టమే కదా! అతనికి ఆ సంపద, రావలసి ఉండి వచ్చినదే. అంత పైకం వస్తుందని అతడు నమ్మి ఉంటాడంటారా? అలా నమ్మి ఉండడు.

అసూయాపరులగు కొందరు ఓర్వలేక సంకుచిత బుద్ధితో అదృష్టవంతులను చిక్కులు పెట్టుటకు తెగపడానికీ ప్రయత్నం చెయ్యవచ్చును. కాని వారి ఆటలు సాగవు. బాగుపడే వానిని చెరిచే వాడూ, చెడిపోయే వాడిని బాగుపరచే వాడూ ఉండరని సామెత ఉండనే ఉన్నది.

మానవుడు తాను పొందవలసిన దానిని ఎలాగూ పొందుతాడు. దానినెవ్వరూ ఆటంక పరచలేరు. ఈ విషయాన్నే మన ప్రాచీనులు ఎన్నడో ఇలా చెప్పారు.

"ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః
దేవోపితం వారయితుంన శక్తః"

"తనకు ప్రాప్తమై ఉన్న దానిని మానవుడు తప్పక పొందగలడు. దేవుడు కూడా దాన్ని అడ్డుకొనలేడు" అని దీని అభిప్రాయం.

అయితే- అదృష్టాన్ని నమ్ముకుని ఎవ్వరూ ప్రయత్నంలో ఉపేక్ష వహించ కూడదు. ప్రయత్నం పురుష లక్షణం. ప్రయత్నం విఫలమైతే తనకు అదృష్టం లేదు అనుకోవాలే కాని, నిరుత్సాహంతో దిగులు పడకూడదు. నిరుత్సాహం మనిషిని క్రుంగ దీస్తుంది.

– బులుసు వేంకట రమణయ్య

సీరియల్

# ఆడపిల్లలు – అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

నిత్యమూ తను ఆరాదించే స్వామి అనుగ్రహంతో స్వచ్ఛంద సేవకుల సహాయ సహకారాలతో ఆ కుగ్రామంలో ఒక మంచినీటి చెరువును తవ్వించాడు జగదీష్ కలిమిలేములపార్టీ కార్యకర్తలు సమధిక ఉత్సాహంతో ఒక్క నెల రోజుల్లోనే చెరువు తవ్వటం పూర్తయింది

ఆ రోజున ఆ చెరువు తట్టునే పెద్ద సభ జరిగింది ఆ మధ్యాహ్నమే అయిదువందలమందికి పైగా పేదలకు అన్నదానం జరిగింది సభకు జగదీష్ అధ్యక్షత వహించాడు ఆనాడు ఆ గ్రామ ప్రజలంతా అక్కడే వున్నారు జండాలతో, రంగురంగుల తోరణాలతో సభాస్థలిని దివ్యంగా అలంకరించారు ఆనాడు ఆ గ్రామప్రజల సంతోషానికి అవధులులేవు పదేళ్ళుగా అమలుకాని ఆ చెరువు తవ్వకం పని జగదీష్ వల్ల పూర్తయిందనేదే వారి సంతోషం

ఆ సభకు జగదాంబ, సావిత్రి, శ్రీవిద్య, రుక్మిణి, వాసు, సత్యబామ వచ్చారు ఈ అయిదుగురినీ తమ కార్లోనే తీసుకువచ్చింది సత్యబామ తన కార్లో హేమంత్‌నీ, కోసలరామ్‌నీ తీసుకువచ్చాడు అభిలాష్

జగదీష్ ఆనాడు కాషాయవస్త్రాలు ధరించాడు మెడలో రుద్రాక్షలూ, నుదుట విభూతి అతని ముఖవర్చస్సులో ఏదో మార్పు, స్వచ్ఛత, ప్రకాశవంతమైన దృష్టి, వినమ్రతా బావం అతన్ని చూస్తున్న అందరికీ వింత అనుభూతి కలుగుతున్నది పక్కనున్న ఆసనంలో వృద్ధుడయిన ఒక శ్రామికుడు. అతను ఆనాటి సభకు ముఖ్యఅతిధి, ఆ ఊరివాడు, నలభైసంవత్సరాల నుంచీ అతనిది శ్రామిక వృత్తి సరిగ్గా అయిదున్నర గంటలకు సభా ప్రారంభం అయింది

జగదీష్ లేచి నిల్చుని తన ఉపన్యాసాన్ని ప్రారంభించేముందు ఇద్దరు గ్రామ బాలికలు ప్రార్ధన చేశారు

'దివ్యాత్మ స్వరూపులారా!

ఈనాడు మనందరికీ ముఖ్యంగా ఈ గ్రామ ప్రజలకూ ఎంత ఆనందప్రదమైన రోజో అందరికీ తెలుసు స్వామి ఆశీర్వచనబలం వలనా, ఆ పరంధాముని కృపచేత పదేళ్ళుగా ఎవ్వర్యూ చేపట్టని ఈ మంచినీటి చెరువు త్రవ్వకం పనిని, మనందరం నడుంకట్టి పనిచేసి ఒక్క నెల రోజుల్లో పూర్తిచేయగలిగాం ఎందుకని? మనలో సంఘీభావం పెరగటంచేత మాటలతోనే మగ్గిపోతున్న మన ఈ సంఘటిత శక్తి ఈనాడు ఇంతటి దివ్యశక్తిగా ఎట్లా మారింది? ఇది ఎవరికి వారు వేసుకోవలసిన ప్రశ్న –

మనస్సు జీవనోపాధికీ, జీవిత పరమావధికీ మూలకారణమైనది సకల పుణ్యముల సంఘటిత ప్రభావమే మానవ జన్మ అణకువతో జీవించిన మానవుడి మంచితనం ఏనాడూ వృధాపోదు అదే మానవత్వం కొంతమంది మానవులు అహంకారమే మానవత్వం అని భావిస్తూవుంటారు ఆ అహంకార మనస్తత్వం వుండటంచేతనే సకల బోగములూ అనుబవిస్తున్నామని వారు అనుకుంటారు మరో పరిదిలో ఆలోచిస్తే బోగములే మానవుని అనుబవిస్తున్నయ్యికాని, మానవుడు భోగాల్ని అనుబవించటంలేదు

జివితం అంటే ఏమిటి? చిరునవ్వులకూ, కన్నీటి దారలకూ మద్య అటూ యిటూ తిరిగే గడియారం పెండ్యులం వంటిదే జీవితం –

ఒకడు కోటీశ్వరుడు,
ఒకడు కూటికి లేనిపేద,
ఒకడు దీర్ఘరోగి,
ఒకడు ఆరోగ్యవంతుడు,
ఒకడు సుఖసంతోషవంతుడు,
ఒకనికి నిరంతర కన్నీటిదారలు,
ఒకస్త్రీకి పెక్కు సంతానము,
ఒక స్త్రీకి బిడ్డలు లేరు,
ఒక స్త్రీ పూర్ణసుమంగళి,
ఒక స్త్రీ యౌవ్వనదశలోనే వితంతువు,
ఒక స్త్రీ అన్యోన్య సంసారజీవితాన్ని అనుభవిస్తుంది,
ఒక స్త్రీ కట్న కానుకల బాధలు పడలేక హత్యకో ఆత్మ హత్యకో గురిఅవుతుంది – ఇట్లా అనేకానేక సుఖ, సంతోష, దుఃఖమయ జీవితాలు

ఎందుకు? ఎందుకని?

కర్మ ఫలితమే మన అనుబవాలకు కారణం, ఈ కర్మ నివృత్తికి మార్గం సత్కర్మలు

సత్కర్మలు అంటే ఒక్క దానం, దర్మం, జపం, ధైవదర్శనం, క్రతువులు యివేకాదు, వీటిలోనూ కొంత స్వార్ధం వున్నది నిస్వార్ధ, నిరాడంబర మానవసేవే సత్కర్మ అంతేకాదు అహంకారాన్నీ పోగొడుతుంది

జన్మవలన రాగద్వేషాలు పుడుతయ్యి రాగద్వేషాల వల్ల కర్మలు, కర్మల వలన సుఖ దుఃఖాలు కలుగుతయ్యి సర్వదుఃఖాలకూ కారణం జన్మ. జన్మరాహిత్య మార్గాన్ని వెతికినప్పుడే దుఃఖరాహిత్యం అవుతుంది కర్మ వలన లభించిన ఈ జన్మను సార్ధకంచేసుకోవాలి అంటే సమాజసేవా మార్గంలో జీవితాన్ని ప్రవేశపెట్టాలి. అదే జన్మరాహిత్యానికీ లేక జన్మ సార్ధకత్వానికీ సరయిన మార్గం

మళ్ళీ మరోవైపునుంచి చూస్తే కర్మకు కారణం గుణం ఈ గుణము అనేది చదువుకుంటే వచ్చేదికాదు మన స్వానుభవంతోనే రావాలి ఈ సద్గుణాన్ని నిత్యజీవితంలో ఆచరణలో వుంచాలి

మానవజీవితానికి దేహమూ, మనస్సు చాలా ప్రధానమైనవి ఈ రెంటి సంస్కారములూ మానవుడికి అత్యంత అవసరమైనవి మానవత్వంలో కూడా రెండు రకాలున్నయ్యి సామాన్య మానవత్వము, సంస్కార మానవత్వమూ సామాన్య మానవత్వం స్వార్ధపూరితమైనది సంస్కార

**జరిగిన కథ – 41: జగదీష్ స్థాపించిన పార్టీ వార్షికోత్సవంలో వరకట్న సమస్యపై శర్వాణి, మనిషి శీలంపై జగదీష్ ఉపన్యసిస్తారు. పెద్ద కూతురు పెళ్ళికన్నా ముందు చిన్నకూతురు అసిరమ్మ పెళ్ళిచేయాలనే నిర్ణయానికి వస్తారు సావిత్రి తల్లిదండ్రులు. శ్రీవిద్య యింటికి భోజనానికి వచ్చిన హేమంత్ తన మనసులో మాట ఆమె తల్లి జగదాంబకు తెలియజేస్తాడు. దగ్గర బంధువు అనూరాధ నుంచి వచ్చిన లేఖ హేమంత్‌ను దుఃఖానికి గురిచేస్తుంది. కోసలరామ్ తన జరిగిన జీవితకథను అభిలాష్, సావిత్రిలకు చెప్పుకున్నాడు.**

మానవత్వం సత్కర్మలు చేసేది

మనం సినిమాకు వెళతాం ఈ వెళ్ళినవారిలో కొందరు దయార్ద్రహృదయులు వుంటారు ఆ సినిమా కష్టాలు చూసి కంట తడిపెడతారు కళ్ళు వాస్తయ్యి దుఃఖభారంతో చీదుతారు సినిమా అయాక బయటికివస్తారు బిచ్చమెత్తుకునే వాళ్ళు, అన్నార్తులూ, అడుక్కునే పసివారూ కనిపిస్తారు చీదరించుకుని వెళ్ళిపోతారే గాని పది పైసలు దానం చెయ్యరు మరీ వెంటబడితే కొట్టబోతారు అంటే వారు సినిమాలో అసత్యమైన దానిని చూసి విచారపడుతున్నారేగాని, సత్యమైనదానిని పరిగణనలోకి తీసుకోవటంలేదు కాని దీనిని సంస్కారవిహీనత అనలేము, సంస్కార విహీనతకాదు మనస్సుకు పట్టించుకోకపోవటమే కారణం

సేవాభావం మానవుడిలో ప్రవేశించి అతన్ని సేవాతత్పరుడుగా చేయాలంటే 'సేవింగ్ ఆన్ డిజైర్స్' అంటే కోరికలమీద అదుపును చేపట్టటమే తగిన సాధనం

ఈనాడు మనం ఎన్నో కార్యాలకు ఎంతో డబ్బును వ్యయంచేస్తున్నాం ఆకలి, తిండి విషయంలో 'డయటింగ్'కు ఇచ్చినంత ప్రాధాన్యత 'డయటింగ్ ఆన్ లగ్జరీస్'కు యివ్వటంలేదు కారణం ఆకలి కసువుకు అంటె పొట్టకు పరిమితం లగ్జరీస్ మనస్సుకూ, శరీరానికూడా కావాలి **'సేవింగ్ ఆన్** డిజైర్స్' అంటే కోరికలమీద **అదుపును** సాధించాలంటే మనస్తత్వంలో మార్పు రావాలి. ఇందుకు విచక్షణా జ్ఞానం చాలా **అవసరం** ఈ విచక్షణా జ్ఞానం అనేది ఈ నాలుగు సూత్రాలమిదా ఆదారపడివున్నది ఈ నాలుగు సూత్రాల్ని సమన్వయపరుచుకుని మనస్సులో ప్రవేశింప చేసుకుంటే అంతకుమించిన జపతపాలు లేవు

ఉన్నది ఒకే కులం –.అది మానవత్వం

ఉన్నది ఒకే మతం – అది ప్రేమ మతం

ఉన్నది ఒకే బాష – అది హృదయ భాష

ఉన్నది ఒకే దేవుడు – అతడు సర్వవ్యాపి

ఇక ఆచరణ, ఆదర్శం విషయాలు తీసుకున్నప్పుడు ముందుగా మానవత్వాన్ని గురించి తెలుసుకోవాలి శరీరము, మనస్సు, ఆత్మల చెరికయే మానవత్వం ఒకటి చెయ్యటం, రెండోది తెల్సుకోవటం, మూడవది ఉండటం ఈ మూడు గుణాల సమ్మిళిత స్వరూపమె మానవత్వం

ఈ మానవత్వానికిమూలస్తంబాలు నాలుగు సత్యము, ధర్మము, శాంతి, అహింస ఈ నాలుగింటిలోనూ అంతర్వాహినిగా ఉండేదే ప్రేమ

ఈ మానవత్వం అలవర్చుకున్న తరువాత చేయవలసినది సాధన, ఇది మూడు విదాలు వ్యక్తి సాధన, సమాజసాదన, విశ్వసాధన

ఇక పుష్పము హారముకాదు, ఒక వ్యక్తి సమాజముకాదు, ఒక వృక్షము వనముకాదు అనేక వ్యక్తుల సాధన, సత్సంపత్తి చేరికగా వున్నప్పుడే దివ్యత్వాన్ని స్పందింపచేసే నిస్వార్ధ దృష్టితో చేసే సేవకు దోహదం చేస్తుంది

స్వామి చెప్పారు నీవు చేయవలసిన విధులను నిర్వర్తించు, నీ బాధ్యతలను నీవు పాటించు, నీ



హక్కుల మేరకు జీవించు, కాని వాటిమీద మమకారాన్ని పెంచుకోవద్దు -

మనిషిగా జన్మించిన ప్రతి వారికీ ముఖ్యంగా కావలసినది మానవత్వం ఈ మానవత్వాన్ని గుర్తించటమే జ్ఞానము తనను తాను తెలిసికొనకపోవటమే అజ్ఞానము ఈ అజ్ఞానానికి కారణం మనిషిలో తిష్ఠవేసుకుని వున్న అష్టమదములు

మొదటిది కులమదం,
రెండవది బలమదం,
మూడవది విద్యామదం,
నాలుగవది యౌవ్వనమదం,
ఐదవది ధనమదం,
ఆరవది సౌందర్యమదం,
ఏడవది అధికారమదం,
ఎనిమిదవది తపోమదం

ఈ అష్టమదములు మనిషిని ప్రలోభపెడతాయి అట్టి ప్రలోభాలకు లొంగనివాడు ధన్యుడు

ఇక మానవుడికి ఎన్ని సంస్కారములు వున్నప్పటికీ, ఎంత చదువు చదివినా, వాటిని సద్వినియోగము చేసుకోలేకపోవటానికి కారణం సత్సంగం లేకపోవటమే ఈ సత్సంగం ద్వారా తనలో వున్న సద్గుణాలనూ, సదాలోచనలనూ, సద్భావాలనూ, సత్ప్రవర్తనలనూ అభివృద్ధి చేసుకోటానికి వీలవుతుంది ఈ విధంగా ప్రవర్తించి దివ్యమైన మానవత్వాన్ని వికసింపచేసుకున్న వ్యక్తిలో, అతని హృదయాన్ని చిలికితే సాక్షాత్కారం లభిస్తుంది

హృదయ మనే భాండంలో, ప్రేమ అనే పాలలో దివ్యత్వం అనే దైవత్వం వెన్న రూపంలో వుంటుంది దానిలో విశ్వాసం అనే తోడు వేసి, బుద్ధి అనే కవ్వంతో చిలికితే వెన్న అనే సాక్షాత్కారం లభిస్తుంది

ఈనాటి ఈ సభలో నేను సేవనుగురించీ, సేవా కార్యక్రమాన్ని గురించీ, సద్భావాలను గురించీ మానవత్వాన్ని గురించీ, దివ్యత్వాన్ని గురించి చెప్పటానికి కారణం, మిమ్మల్ని ఆధ్యాత్మిక మార్గం వైపుగానే మళ్ళించటానికి కాదు మనల్ని మనం తెలుసుకోవడం కొసమే మనల్ని మనం ధర్మబద్ధంగా, సహృదయంతో, సదాలోచనలతో తెల్సుకున్నప్పుడు మన హృదయాంతరాళాల్లో మానవత్వం అనే దివ్యత్వం వెల్లివిరుస్తుంది అహంకారం అంతరిస్తుంది. సమాజంయందు సదవగాహన, సేవాభావం ఏర్పడుతుంది అదే సహజ జీవిత సార్థక్యం, దివ్యమానవ అభ్యుదయం, నైతిక శిక్షణ" అని తన ఉపన్యాసాన్ని ముగించాడు జగదీష్ కరతాళధ్వనులు మిన్నుముట్టాయి

శర్వాణి తన ఉపన్యాసంలో మహిళా అభ్యుదయమూ, మహిళా సంక్షేమ కార్యక్రమాల్ని గురించి మాట్లాడింది

ఆనాటి సభలో ముఖ్య అతిథిగా కూర్చున్న ఆ శ్రామికుడు లేచి జగదీష్‌కి మళ్ళీ నమస్కరించి నాలుగు మాటలు చెప్పాడు

"పెద్దలందరికీ నమస్కారాలు. ఈ రోజుల్లో అనేకమంది రాజకీయ ప్రాముఖ్యం కోసం, అది చేస్తాం, ఇది చేస్తాం అని చెపుతూ వుంటారు కాని ఏ ఒక్కపనీ కాదు పునాదిరాళ్ళు పాతటంతోనే ఆ చెయ్యవలసిన కార్యక్రమం అంతం అవుతుంది ఒక పేదవాడుగా, కూలివాడుగా నాకు యివన్నీ అనుభవాలే కాని జగదీష్‌బాబుగారి సంఘం మాత్రం అడిగింది చేసి, ఆ పని పూర్తయిన తరవాతనే మాట్లాడతారు వీరి సంఘం నూరేళ్ళు బతకాలని నా కోరిక అని సభకు నమస్కరించి కూర్చున్నాడు

జగదీష్ మళ్ళీ లేచి నిల్చుని నాలుగు వాక్యాలు చెప్పాడు

"ప్రతి విషయంలోనూ సామరస్యము, ఐక్యత, సమన్వయము కలిగివుండేట్టుగా అందరూ కలిసి వ్యవహరించాలి ప్రేమతత్వంతోనే నిజమైన ఆత్మతత్వం లభిస్తుంది సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ నాలుగూ ప్రత్యేకమైనవి కావు

సత్యం కరెంటు,
ధర్మం వైరు,
శాంతం బల్బు,
ప్రకాశం ప్రేమ

ఈ నాలుగింటి ఐక్యత మానవుని దివ్యత్వము ఈనాటినుంచీ ఈ "కలిమిలేముల పార్టీ" పేరును 'కలిమిలేముల సేవాసమితి'గా మార్పుచేసి ఈ సేవాసమితి సభ్యులందరం మానవసేవ చేయటానికే పునరంకితం అవుతున్నాం" అని తన ఉపన్యాసాన్ని పూర్తిచేసి మనస్సులోనే తన స్వామికి నివాళులు అర్పించాడు జగదీష్ హర్షపులకాంకితులయి అందరూ సంతోషంతో కరతాళధ్వనులు చేశారు

జగదాంబ కళ్ళు చెమర్చటమేకాదు, వర్షించాయి తన కొడుకు జగదీష్ యింతటి ప్రజ్ఞావంతుడయి అత్యున్నత భావాలతో అందరి హృదయాలనూ ఆకట్టుకుంటున్నందుకు ఆవిడ అమితంగా సంతోషించింది శ్రీవిద్యలేచి వెళ్ళి జగదీష్ పాదాలకు నమస్కరించి అతని ఆశీస్సులు పొంది సజలనయనాలతో తిరిగి తల్లి దగ్గరకువచ్చింది

సత్యభామ ఈ ఉపన్యాసాన్ని వింటున్నంతసేపూ అనేకభావాలతో తన ఆశయాలకు ఒక రూపాన్ని ఏర్పర్చుకున్నది ఏదో దివ్యశక్తి, దివ్యమైన అనుభూతి, దివ్యమైన ఆలోచన, మనస్సులో ఒక అనిర్వచనీయమైన భావన, ఆధ్యాత్మిక భావ తరంగాలలో మనస్సు మునిగిపోయింది

లౌకికజగత్తులో మానవునకూ, మానవునకూ మధ్యనున్న బాంధవ్యాన్నే ప్రేమ అని భావిస్తాడు మానవునకూ వస్తువులకూ వున్న సంబంధ బాంధవ్యమే ప్రేమ అని భావిస్తాడు అంటే సంబంధ బాంధవ్యమైనదే ప్రేమతత్వం పరిపూర్ణమైన ప్రేమతత్వము వికసించిన తక్షణమే, హృదయ కమలము పరిమళభరితమై వికసిస్తుంది

లేచి నిల్చున్నది సత్యభామ ముకుళిత హస్తాలతో ముందుకు నడుస్తున్నది కాళ్ళు తడబడుతున్నాయి శరీరం వణుకుతున్నది కళ్ళల్లో ఆనందాశ్రువులు

మెల్లిగా అడుగులువేస్తూ జగదీష్‌వైపు నడుస్తున్నది తన దగ్గరకు వస్తున్న సత్యభామను చూస్తున్నాడు జగదీష్

సత్యభామ మెల్లగా నమస్కరిస్తూ వచ్చింది వంగి రెండుసార్లు పాదాభివందనం చేసింది మూడవసారి రెండు చేతులూ అతని పాదాలమీద వుంచింది కాళ్ళు వణుకాయి, పళ్ళు తూలింది. అతని పాదాల మీదనే పడిపోయింది అదే ఆఖరి నిట్టూర్పు, ఆఖరి శ్వాస, ఆఖరి పాదాభివందనం, ఆఖరి కోరిక, సత్యభామ ప్రాణాలు విశ్వాంతరాళంలో కలిసిపోయినయ్యి

పరిపూర్ణమైన ప్రేమ స్వప్రయోజనరహితమైన పవిత్ర ప్రేమగా విలసిల్లింది సత్య, నిత్య,

## క్రీడారంగం క్విజ్-6కి జవాబులు

(1) 193 పరుగులు. ఆస్ట్రేలియాకి చెందిన "డెనిస్ ఆనెట్స్"
(2) జాయ్‌అలాయ్ (హై అలాయ్ అనాలి) ఈ ఆటలో రికార్డు చేయబడిన వేగం గంటకు 302 కి. మీ. లేక గంటకు 188 మైళ్ళు.
(3) 1964 సంవత్సరంలో
(4) పెర్త్‌లో, కర్ట్‌లీ ఆంబ్రోస్, పాట్రిక్ పాటర్సన్, గార్డన్‌గ్రీనిడ్జ్
(5) ఇమ్రాన్‌ఖాన్
(6) ఇంగ్లాండ్‌పై కరాచీలో 99 పరుగులకు రమీజ్‌రాజా
(7) ఓల్గా మొరజోవా. 1974 సం.లో ఫిలడెల్ఫియాలో 'బిల్లీ జీన్‌కింగ్'ని ఓడించి సాధించింది.
(8) ఈ సం. రంజీలీగ్ మ్యాచ్‌లలో గోవాపై తమిళనాడుకు చెందిన ఊర్కారి వెంకట్రామన్, అర్జన్ కృపాల్ సింగ్‌లు సాధించారు.
(9) మార్టినా నవ్రతిలోవా, పామ్ ష్రివర్‌లకు
10) గారీస్వీట్

నిర్మలమైన ప్రేమ అనిత్యము, అసత్యము, అశాశ్వతమైనది.

కాలగర్భంలో కలిసిపోయే సంబంధ బాంధవ్యాలను సత్య, నిత్యములుగా భావించి, నిత్య సత్యమైన ప్రేమ సత్యాన్ని వదులుకుంటున్నాము.

అపూర్వమైన ఈ సంఘటన అందరి మనస్సులనీ కలచివేసింది కంట తడిపెట్టనివారులేరు

ఈ ప్రపంచంలో కొంతమంది వ్యక్తులుంటారు తమ స్వప్రయోజనాలకే కాకుండా ఇతరుల స్వప్రయోజనాలకు కూడా గౌరవాన్ని యిచ్చి, ఇంటా, బయటా కూడా తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటారు. తాము ఆశించిన, తాము కాంక్షించిన స్వప్రయోజనం ఫలించకపోతే పద్ధతిని మార్చుకుని జీవితాన్ని మరో మలుపుకు తిప్పుకోరు సత్యభామ ఈరకమైన మనస్తత్వంకలది పరిపక్వత పొందలేని ప్రేమాన్వేషణలోనే, ఆత్మ సమర్పణం కావించుకున్నది

* * *

సత్యభామ మరణంతో సావిత్రి కొద్దిరోజుల వరకూ కోలుకో లేకపోయింది వారం రోజులు ఇంటిదగ్గరే వున్నది ఆ తరువాతనే అభిలాష్ ఇంటికి వెళుతున్నది. ఈ సంఘటన శ్రీవిద్య మనస్సునూ కుదిపివేసింది. కర్మకాండలకు సహాయపడటానికి వాళ్ళ యింటికి వెళ్ళింది జగదాంబ సత్యభామ తండ్రి గోపాలరావు మనోవేదనకు అంతులేదు ఆయన జీవచ్ఛవంలానే వున్నాడు కూతురు మరణం ఆయన్ని పూర్తిగానే కృంగదీసింది తన తదనంతరం డబ్బు, ఆస్తినీ "కలిమిలేముల సేవాసమితి"కి ధర్మ కార్యాల నిమిత్తమై విల్లు వ్రాయించా డాయన. సత్యభామ ఆత్మ ఆ విదంగా చేస్తే శాంతిస్తుందనుకున్నా డాయన విల్లు రిజిస్టర్ అయింది

మరో మాసం గడిచింది హేమంత్, వాసు, రుక్మిణి యింటికి వచ్చాడు శ్రీవిద్య, జగదాంబ బజారువెళ్ళారు

'పరిస్థితుల ప్రభావం ఒక్కొక్కప్పుడు కొన్ని చేసుకున్న నిర్ణయాల్ని కూడా మార్చేస్తుంది శ్రీవిద్య మనస్తత్వంలో మార్పేమయినా వచ్చిందా? అన్నాడు హేమంత్

"లేదు అన్నది రుక్మిణి

"శ్రీవిద్య మీతో పెళ్ళివిషయం ఏమైనా మాట్లాడిందా?

"మీ పెద్దవాళ్ళతో మాట్లాడాలన్నది

"నా కోరికా అదే. మా అమ్మ, నాన్నగారూ పది రోజుల్లో వస్తారు అందరం కలిసి మాట్లాడుకుందాం' అన్నాడు.

శ్రీవిద్య, జగదాంబ వచ్చారు హేమంత్‌కు నమస్కరించింది శ్రీవిద్య

"మీతో చాలా విషయాలు మాట్లాడాలి' అన్నది

అతను నవ్వేడు. రుక్మిణి పక్కనే సోఫాలో కూర్చున్నది ముఖంలో ఏదో దిగులు కనిపించింది

సత్యబామ మరణం మా అందరి మనస్సుల్లో ప్రశ్నార్థకంగానే మిగిలిపోయింది మనస్సులో నిక్షిప్తమైన ప్రేమ మరణాన్నికూడా కోరగానే ప్రసాదిస్తుందా?" అన్నది శ్రీవిద్య

ప్రేమ చంచలత్వానికి లొంగిపోతే ఇష్టం అనేది ప్రశ్నోత్తరాల శీర్షికనుంచీ బయటపడదు సత్యబామ ప్రేమ నిస్వార్ధమైనదీ, పవిత్రమైనదీ, ప్రేమతత్వంలో దైవత్వపు బావాల్ని పుణికిపుచ్చుకున్నదీ కావటంచేతనే మరణాన్ని కూడా తన ఆదీనంలోనే వుంచుకోగలిగింది అంతటి అదృష్టం లక్షకు ఒక్కరికి కలుగుతుందేమో' అన్నాడు హేమంత్

హేమంత్‌ని భోజనానికి వుండమన్నాడు వాసు అతను యిష్టపడలేదు. శ్రీవిద్య, జగదాంబ లనుకూడా పిలిచింది రుక్మిణి హేమంత్ యిక తప్పించుకోటానికి వీల్లేకపోయింది

గుమ్మంలో కారు ఆగింది కారులోనుంచి విమల, తల్లి వస్తున్నారు విమల ముఖకవళికల్లో ఆనందం, సంతోషం వెల్లివిరుస్తున్నది మనిషి చాలా చూడముచ్చటగా వున్నది

"శ్రీవిద్యా, నా పెళ్ళి ఎల్లుండి రాత్రి ఎనిమిదిన్నరకు తప్పకుండా నువ్వూ, మీ అమ్మగారూ రావాలి రాకపోయావో ఈ జన్మలో నీతో మాట్లాడను రుక్మిణిగారూ, వాసుగారూ, హేమంత్‌గారూ, మీ రందరూ కూడా వచ్చి నన్ను ఆశీర్వదించాలి" అని పేర్లురాసి అందరికీ శుభలేఖలు యిచ్చిందీ హఠాత్తుగా ముందుకువచ్చి శ్రీవిద్య బుగ్గలు ముద్దుపెట్టుకుని చిరునవ్వుతో వెళ్ళిపోయింది. (ఇంకావుంది)





## డయానా షైర్ డ్రస్

ప్రిన్స్ చార్లెస్‌తో అపుడపుడు విహారానికి బయల్దేరినపుడు "లేడీ డయానా" ఫోటోలో కనిపించే విధంగా డ్రస్ చేసుకుంటుంది. ఈ రకమయిన తళుకు బెళుకుల వస్త్రరాజం వెల వెయ్యి పౌండ్లట. అంటే ఇరవై వేల రూపాయల పైమాటే నన్నమాట! (పి. వి. యల్)



# వారఫలం

**3-3-1989**
**శుక్రవారం మొదలు**
**9-3-1989**
**గురువారం వరకు**

★ **మేషం:** దూర ప్రాంతాలకు కొందరకు ప్రయాణం చెప్పవచ్చు. ఉద్యోగరీత్యా మేలున్నది. రాజకీయ రంగాన అనుకూలత గలదు. మీ యింట శుభం జరుగనున్నది. అమూల్య వస్తు సేకరణకు అస్కారమున్నది. స్త్రీలకు : ఆదాయ వృద్ధి, సభారంగానుకూలం, పత్రికాప్రశంసలకు అస్కారం.

★ **వృషభం:** క్రమంగా 'శని' భగవానుడు మేలు చేయనున్నాడు. 'అష్టమ శని బాధ' తగ్గనున్నది. సభారంగ ప్రసిద్ధి ఉన్నది. వ్యాపార నిమిత్తంగా దూర ప్రాంతాలకు ప్రయాణింప రావలసి రావచ్చు. 'కోర్టు' వ్యవహారాలు మీకు అనుకూలమవుతాయి. స్త్రీలకు : ఉద్యోగ వృద్ధి, సభా గౌరవం, ఆదాయ వృద్ధి.

★ **మిధునం:** కృషి లోపం లేకుంటే అన్ని రంగాల మేలున్నది. అభిమానించే వారున్నారు నూతన వ్యాపారం చేయాలని కొందరు యత్నిస్తారు. అప్రయత్నంగా ప్రయాణం చెప్పదగిన సమయం. అసాధ్యమైన ఒకానొక విషయం సాధ్యమవుతుంది. స్త్రీలకు : సుఖశాంతులు, ధనలబ్ధి, సభారంగ ప్రసిద్ధి.

★ **కర్కాటకం:** అయిన వారి సంబంధం నిశ్చయం కానున్నది. దూర ప్రాంతాల నుండి బంధుమిత్రులు ఇంటికి రానున్నారు. సభా మర్యాద యున్నది. వృత్తిరీత్యా మేలున్నది. పత్రికా రంగానుకూలత యున్నది. స్త్రీలకు : అభిమానించే వారున్నారు, ఆనందించే వారున్నారు, ధనలబ్ధి యున్నది.

★ **సింహం:** దూర ప్రాంతాల నుండి బంధు మిత్రులు రానున్నారు. రాజకీయంగా మేలున్నది. యత్నించండి. అధికార వృద్ధికి ఆకరం విద్యా రంగాన మీకు అనుకూలత యున్నది. కొందరు వుత్సవ కార్యక్రమాన నిమగ్నులు కానున్నారు. స్త్రీలకు : సభారంగ ప్రసిద్ధి, ఆరోగ్య వృద్ధి.

★ **కన్య:** అవసరాలకు డబ్బు అందుతుంది. సభా మర్యాద యున్నది ప్రజారంగాన మీకు ప్రసిద్ధి యున్నది ధనాగమవానికి లోపముండదు ధనమెంత వచ్చినా అంత వ్యయం తప్పదు వ్యాపార రంగాన అనుకూలత ఏర్పడుతుంది రాజకీయంగా ఏ విధంగా మేలు చేకూరని వారంగా గ్రహించాలి స్త్రీలకు : నూతన మిత్ర సమాగమం గ్రహించాలి.

★ **తుల:** అనుకూలం అనుకొన్న పదవి జారి పోతుంది. శుభదాయక వారం. వ్యాపారరీత్యా అభివృద్ధి యున్నది. 'శని' అనేక రీతుల యోగదాయకుడు. నల్లని వస్తు విక్రేతలకు మేలైన వారం స్త్రీలకు : మిత్ర సమాగమం, యత్న కార్యసిద్ధి.




★ **వృశ్చికం:** ఆదాయమున్నది. అనుకున్న పనులు సానుకూలమవుతాయి. ఆరోగ్య భాగ్యం, ఐశ్వర్యదాయకం నూతన మిత్ర సమాగమం దూర దేశాల నుండి బంధువులో, మిత్రులో యింటికి రానున్నారు. అయిన వారి సంబంధం నిశ్చయం కావడం వార విశేషం స్త్రీలకు : పత్రికాగౌరవం, ఉద్యోగ వృద్ధి

★ **ధనుస్సు:** రాజకీయ రంగాన మేలున్నది మాటకు అధిక గౌరవం కుల పెద్దలు రానున్నారు బాగా వయస్సు గలవారికి ఆరోగ్య రీత్యా జాగరూకత పడవలె. దూర ప్రాంతాలకు వెళ్ళవలసిన అగత్యం ఏర్పడుతుంది స్త్రీలకు. సభా గౌరవం, వృత్తియందు పెంపు, కొందరకు ఉద్యోగ వృద్ధి

★ **మకరం:** శుభదాయకం. వారమంతా అనుకూలదాయకం ఆప్త సమాగమం. అతిథి అభ్యాగతులను ఆదరించవలసిన సమయం కృషి లోపం లేకపోతే అన్ని విధాలా మేలే వృత్తియందు అనుకూలత యున్నది స్త్రీలకు బహు లాభప్రదాయకదినం ఉద్యోగవసతి ఉన్నది

★ **కుంభం:** సకల సౌకర్యాలు అమరుతాయి 'శని' అనుకూలుడు కావడంతో ఒక విధంగా 'గురుడు' అనుకూలుడు కావడంతో, ఇక కానిదేది? అని అనిపిస్తుంది పత్రికా గౌరవానికి ఆస్కారం. శుభదాయక దినాలే మాటకు అధిక గౌరవం స్త్రీలకు ధన, కనక, వస్తువాహనానుకూలం, మరేం కావాలి?

★ **మీనం:** ఏది సాధ్యం, ఏది అసాధ్యం, అంతా ఒకటేలాగు అనిపిస్తుంది తృతీయ స్థితి గురునకు గదా! అతడింకా అనుకూలుడు కాలేదనే బెంగ తప్పదు సుఖ శాంతులున్నా, ఏదో యిబ్బంది ఉన్నట్లుంటుంది సభా మర్యాదలకు లోటు లేదు. పెండ్లి కార్య యత్నాలుంటాయి స్త్రీలకు · శుభదాయక దినాలే. వారం మధ్యలో ఏదో మేలు జరుగనున్నది గ్రహించాలి

విద్వాన్-కోట సత్యరంగయ్యశాస్త్రి

# దూరదర్శనం
లత

## గాలిబ్

త్రాగినా– జూదమాడినా గొప్ప కవి అయిన గాలిబ్‌ని మూడు నెలలు నిర్బంధంలో ఉంచినట్టున్నారు గాలిబ్ చరిత్ర గుల్జార్ పరిశోధించారు గనక కరెక్టే కావచ్చును. పెళ్ళి కాలేదని ఒక కుర్రాడు బాధ పడుతుంటే– రక్షింప బడ్డావు. ఎందుకు విచారం అన్న వాక్యం చాలా పాప్యులర్

## రామాయణం

సీత హెయిర్ పిన్ ఛేంజ్స్ డైలాగులు చెప్పుతూ ఒక స్త్రీ కోసం రాజు విచారించ రాదని సెలవిచ్చింది రాముడు ఎంత సేపటికీ సీతని అడివికి పంపటానికి ఒప్పుకోడు. సీతే బలవంతం చేసి ఒప్పిస్తుంది ఏమిటో? ఎందుకు లెండి విసుగ్గా ఉంది– ఒదిలేద్దాం

## మర్యాద రామన్న

ఆదివారం ఉదయం మర్యాద రామన్న బాగుంది తరువాత "నేను గొప్ప కాదా, నా విద్దె గొప్పకాదా?' అంటూ పాముల వాడి నాట్యం చాలా హైలెట్ జానపద నృత్యాల్లో ఈ మధ్య అంత మంచి నృత్యం రాలేదు.

## మహా భారతం

భీమ దుర్యోధనుల కయ్యాలు సాగుతున్నాయి. కృష్ణ బలరాములు సాందీపని దగ్గర చదువు తున్నారు. ఈలోగా ద్రోణుడు రావటం భీష్ముడు అర్జునుని అప్ప చెప్పటం వరకూ అయింది. వ్యాస కృతమైన జయేతిహాసం యధాతధంగా చూపిస్తున్న చోప్రా అభినందనీయుడు.

## చార్లీ చాప్లిన్

కిందటి వారం నుంచీ చూపిస్తున్నారు– సంతోషం మూర్ఖత్వానికీ నియంతృత్వానికీ ఎదురు తిరిగి– కమ్యూనిష్టు అని అనుమానింపబడ్డ భయంలేని కరుణాకావర నటనా శిల్పి చాప్లిన్. ఆయన చిన్నవీ పెద్దవీ కలిపి పదహారు చిత్రాలు తీశాడు 1889 ఏప్రిల్ 16న అతి పేద కుటుంబంలో పుట్టి 1977లో స్వర్గస్థుడయినాడు. ఆయన ఆత్మకథ బాగుంటుంది. హిట్లర్ అంటే ఆయనకి తగని అసహ్యం.

ది కూర్ క్లబ్బుల్లో తాగి ఆ నాటి పెద్ద మనుష్యులు ఎలా ప్రవర్తిస్తారో చాలా హాస్యంగా చూపించారు. చాప్లిన్ శత జయంతి సందర్భంగా ఈ చిత్రాలు ఇస్తున్నారు. అతను కమ్యూనిస్టు అని అమెరికా బహిష్కరిస్తే స్విట్జర్లాండ్ వచ్చి చరమ జీవితం అక్కడ గడిపాడు చార్లీ చాప్లిన్. భూమి మీద పుట్టిన నటుల్లో అంతటి అందమైన వాడూ, నటుడూ లేడంటే అతిశయోక్తి లేదు. ఈ అవకతవక ప్రపంచాన్ని అలంకరించుకున్న ఇంగ్లీషు ముసలమ్మని చూసి నవ్వినట్టు నవ్వి 1977లో నవ్వుతూ వెళ్ళి పోయాడు. ●

## మీ జి. కె. ఎంత? (7) జవాబులు

(1) ఎడిత్ ఎలెన్ గ్రే (2) ఫిన్లాండ్ (3) స్కాట్లాండ్ (4) జమనాలాల్ బజాజ్ (5) నార్వేకి చెందిన ట్రిగ్వీలీ (6) ఇటలీకి చెందిన రీన్ హోల్డ్ మెస్నర్ (7) బురాన్ (8) హెరాల్డ్ హోల్ట్ (9) మంజూ వ్యాస్ (10) నెదర్లాండ్స్

త్వరలో...

క్షమ్నారి వేణుగోపాలరావు

సీరియల్!



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

–సంపాదకుడు.


Printed and Published for Nageswararao Estates Ltd, by S Nageswararao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Chief Editor S. Radhakrishna, Advisory Editor : Veeraji, Editor M Madhavarao, Phones Bussiness 61247, 61248, 75569 and Editorial 75667

# శ్రీ కృష్ణ కళ్యాణామృతం

ప్రయాగ రామకృష్ణ

గోకులం సొగసంతా, వెలుగంతా, బ్రతుకంతా తానే అయిన కృష్ణుడి మీద తన అన్నల కెందుకింత కోపం? అయినా కృష్ణుడు ఎవరు? తనకు మేనమామ కొడుకు.....

తన తల్లి రాజాధి దేవికి స్వయంగా అన్నగారైన వసుదేవుని కుమారుడు. మరి, మేనత్త మేనమామల పిల్లల మధ్య ఎందుకింత వైర మొచ్చిందో, తన అన్నలకు కృష్ణుడంటే ఎందుకు పడదో మిత్రవిందకు ఎంత ఆలోచించినా అర్థమయ్యేది కాదు.

వాళ్ళ కక్షలూ, కలతలూ ఎలా అయినా వుండనీ తను మాత్రం కృష్ణుడినే పెళ్ళి చేసుకోవాలి' ఆ





మురళీ మోహనుడ్ని తన వాడ్ని చేసుకోవాలి అతనిని తనలో కలిపేసుకోవాలి

కృష్ణుడి అల్లరి, చిలిపితనం గురించి విన్నప్పటి నుంచి అతని మీద మిత్రవిందకు మరీ మనసవుతోంది పొదరిళ్ళలో అతను చేసే పోకిరీ తనం అంతా ఇంతా కాదుట

కన్నె పిల్లల పైటల్లో చెయ్యి దూర్చి చక్కిలి గింతలు పెడతాడ్ట, ముద్దు లాడతాడ్ట, పైట చెరుగు లెత్తుకు పోయి పొన్న చెట్లకు వేలాడ దీస్తాడ్ట, ఒంటి మీద నూలుపోగైనా లేక వయసు పిల్లలు సిగ్గుతో చితికిపోయి జుట్టు విప్పుకుని రొమ్ములీ్న, ఊరువుల్నీ కప్పుకుంటూ చీరల కోసం బ్రతిమాలితే వాళ్ళ చేత గుంజీళ్ళు తీయిస్తాడ్ట మొత్తానికి రసిక చక్రవర్తి కృష్ణుడ్ని తలుచుకున్న కొద్దీ మిత్రవింద పరవశమవుతోంది

ఆమె మనసునిండా గోపాలకృష్ణుడే

ఆమె తనువంతా వేణు నాదమే

అవంతీ దేశాన్ని పాలించే జయత్సేన మహారాజుతో రాజాధి దేవికి పెళ్ళయింది వాళ్ళకు వింద, అనువింద అనే – ఇద్దరు కొడుకులూ మిత్రవింద అనే కూతురూ కలిగారు. విందాను విందులు అస్త్ర శస్త్ర విద్యల్లో ఆరితేరిన వారు. బహుముఖ ప్రజ్ఞాశాలులు వీళ్ళ శక్తి యుక్తుల్నీ, ధైర్య సాహసాలనీ పసిగట్టిన దుర్యోధనుడు వాళ్ళిద్దర్నీ తెలివిగా చేరదీశాడు కృష్ణుడి మీద కత్తి కట్టించాడు పాండవుల మీద లేనిపోనివి నూరిపోశాడు విందాను విందుల్ని అనవసరంగా వాళ్ళ మీదకు రెచ్చగొట్టాడు ఎక్కడ విందానువిందులు చెయ్యి జారిపోతారో, ఎప్పుడు పాండవుల పక్షాన చేరుతారో అని వాళ్ళని అనుక్షణం విందు విలాసాల్లో తెలుస్తుండేవాడు




చెప్పుడు మాటలు విని చెడి పోయిన వాళ్ళలో విందాను విందుల్ని ముందు చెప్పుకోవాలి

# మిత్రవింద పెళ్ళి

తల్లి చెప్పినా వినలేదు.

తండ్రి చెప్పినా వినలేదు.

చెల్లెలి మనసు గ్రహించుకోలేదు.

ఎంతో శక్తి వుండి కూడా దుర్యోధనుడు పన్నిన వలలో చిక్కుకు పోయారు. పాపం బ్రతికినంత కాలం ఆయనకు పకులై పోయారు.

ఎంత చిత్రం!

తెలివి వుండి, చతురత వుండి

బలగం వుండి, బలం వుండి

అన్నిటికీ మించి శ్రీకృష్ణుడు మేనమామ కొడుకై వుండి..... అవన్నీ బూడిదలో పోసిన పన్నీరై.....

మిత్ర విందకు తలుచుకున్న కొద్దీ కన్నీళ్ళాగటం లేదు.

ఒంటరిగా వెళ్ళి వుద్యానవనంలో ఎత్తయిన బండరాయి మీద కూర్చుంది. మిత్ర విందకు గుండె పగిలిపోతుందేమో అని పిస్తోంది. కళ్ళు మండి పోతున్నాయి. కన్నీరు వూరికే వుబికి వస్తోంది. అసలు తన అన్నల కెందుకింత మూర్ఖపు పట్టుదల. తను కృష్ణుణ్ణే పెళ్ళి చేసుకుంటుంది. వాళ్ళ కెందుకట బాధ.

నీకు శత్రువైన వాళ్ళను లోకమంతా కూడా విరోధించాలనుకోవటం అజ్ఞానం కదూ! అయినా శ్రీకృష్ణుణ్ణి గురించి వీళ్ళకేం తెలిసినట్టు లేదు. దేవుడై వుట్టి మనిషిలా నటిస్తూ ధర్మా ధర్మాలనూ, సత్యాసత్యాలనూ బోధిస్తూ ధర్మ సంస్థాపన కోసం అవతరించిన కర్మ ధర్మ చక్రవర్తి ఆయన.

ఆయన మీదేమిటో వీళ్ళ ప్రతాపం. మిత్రవిందకు నవ్వు వచ్చింది.

లేచి నిలబడి తులసి కోటచుట్టూ ప్రదక్షిణ చేసి 'తల్లీ! ఈ జన్మకే కాదు శతకోటి జన్మలకి కూడా కృష్ణుడే నాకు భర్త కావాలి. నన్ను అనుగ్రహించు. జన్మ జన్మలకీ మాధవుడే నాకు తోడూ నీడాకావాలని ఆశీర్వదించు ఇంకేమీ వద్దు' అని వేడుకుంది.

పై నుంచి పారిజాత పూలు జలజల క్రిందకు రాలాయి.

తలెత్తి పైకి చూసింది. ఆకాశంలో విశ్వమోహన రూపం గోచరించింది. నల్లనివాడు, పద్మ నయనమ్ములవాడు, కృపారసమ్ము పై జల్లెడి వాడు, రాసక్రీడలో పదహారు వేల గోపికలను ముద్దులతో ముంచెత్తిన వాడు క్షణకాలం కనిపించి అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగించి మాయ మయ్యాడు.

ఆమె మేను వేన వేల వీణలై శరీరం శతకోటి వేణువులై, హృద్యంగా పులకించింది. చేతులెత్తి ఆ పురుషోత్తముడికి నమస్కరించింది.

* * * * *

అవంతీ దేశపు రాజధానిలో విందాను విందులు మిత్ర వింద స్వయంవరానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నారు.

రథాల మీద, బళ్ళమీద పెళ్ళి సంభారాలు వచ్చి పడుతున్నాయి. దేశ దేశాల రాజులూ స్వయం వరానికి తరలి వస్తున్నారని తెలిసి, వాళ్ళందరికి బ్రహ్మాండమైన విడిది ఏర్పాట్లు చేశారు. పెళ్ళి పనులతో సేవకాజనం తల మునకలుగా వున్నారు

ఊరంతా శోభాయ మానంగా వెలిగిపోతోంది. నగర ముఖద్వారంలో స్వాగత తోరణాలు, మంగళ తోరణాలు కట్టారు.

రాచబాటలకు అటూ యిటూ పచ్చటి చెట్లు నిలబెట్టారు. మిత్రవిందను పెళ్ళికూతుర్ని చేశారు. ముత్తయిదువలు వచ్చి ఆమె నుదుట, పాపిట సింధూరం దిద్దుతున్నారు. బ్రాహ్మణులు ఆశీర్వదిస్తున్నారు. చెలికత్తెలు ఆమె అందానికి మెరుగులు దిద్దుతున్నారు. సాహస కత్తెలు ఆట పట్టిస్తున్నారు.

ఇంత జరుగుతున్నా మిత్ర వింద మనసు మనసులో లేదు. తన స్వయంవరం ఎప్పుడో జరిగి పోయింది. ఇప్పుడీ అనవసరపు ఆర్భాట మేమిటి? అయినా తనను సంప్రదించకుండా, తన ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా ఈ స్వయంవర సన్నాహాలేమిటి?

అన్నలూ, వదినలూ వచ్చారు. మిత్రవిందను పలకరించి పరిహాస మాడి వెళ్ళారు 'ఎవరో ఆ అదృష్ట వంతుడు' 'ఏ వీరకిశోరుడి అదృష్టం పండిందో' 'మిత్ర వింద మనసును దోచుకునే మహరాజెవరో' రకరకాలుగా ' వూహాగానాలు సాగుతున్నాయి.

సభామంటపంలో రాజులూ, రాకుమారులూ, చక్రవర్తులూ కొలువు తీరాక మిత్ర విందను వేదిక మీదకు తీసుకు వచ్చారు. మిత్రవింద ఎవరి మెడలో వరమాల వేస్తుందో! జనమంతా ఉత్కంఠతో చూస్తున్నారు. మిత్రవింద తలెత్తి ఒకసారి సభంతా కలయ చూసింది.

కృష్ణుడికి తన మనసు తెలీదూ.. తను చేసిన పూజలన్నీ ఏమయ్యాయి? స్వయం వరం కబురే అందలేదా? దొంగ దేవుడు. తెలిసే రాకుండా వూరుకున్నాడా ... దేవ దేవుడికి తనంటే ఇష్టం లేదా .. మిత్ర వింద మనసు పరిపరి విధాల పోయింది.

ఇంతలో సభలో కలకలం బయలుదేరింది జగదానంత కారకుడైన శ్రీ మహావిష్ణువు చతుర్భుజుడై శంఖ చక్రశార్ఙ్గ గదాధారియై సభామంటపంలోకి వచ్చాడు

అందరూ ఆయనను సంభ్రమానందాలతో ముగ్ధులై చూస్తూ వుండగా నల్లనివాడు, వెన్నదొంగ, లీలామానుష స్వరూపుడు సఖ్యంగా, సౌఖ్యంగా మిత్ర విందను పొదివి పట్టుకుని రథం మీద కూర్చోబెట్టుకుని గుర్రాలను పరుగు తీయించాడు.

రథం కదిలి వెళ్తుంటే నల్లనయ్య వొడిలో కన్నె వేణువు ఒళ్ళు పులకరిస్తోంది. మిత్రవింద బ్రతుకు పండింది

## గడుసు లోకం — బాబు






సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

# గళ్ళ నుడి కట్టు – 5

## ఆధారాలు

**నిలువు**

2. కోపము
3. కురుపాండవుల రెండు పక్షాల జన్మించిన దిక్పాలకుడు.
4. రాముడి దగ్గరవాడు- యుగం మారింది.
5. వేదంలో భాగం- ఒక కాయ.
7. మహాభారతంలో వాహనం.
9. మరువకండి మంచి వాసన.
10. మాధవుడికి దగ్గరగా వున్న శి వ.
13. అగస్త్యుడు జీర్ణించుకున్న మేక.
14. హాయ్యిలో పిల్లి లేకపోతే ఆ ఇంట్లో అంతా ఇదే.
16. వచనం లేని రామాయణం వ్రాశారు ముగ్గురు కవుల్లో రెండోవాడు.
17. రఘు వంశంలో దేముడి తల్లి.
18. ఖండనంలానే వుంటుంది యుద్ధం.

**అడ్డం**

1. ఈవ శోకంలో మంచి మొదటి శ్లోకం వచ్చింది.
3. సూర్యుని కుమార్తె పల్లగా వుంటుంది.
6. ఇంగ్లీషు పెరుగు అల.
8. అటు మంచి- ఇతరు నిర్మించిన సభలోనే దుర్యోధనుడి పరాభవం.
10. హిమాలయాలల్లో సరోవరం- మనస్సు
11. నాలుకకు సంబంధించినది.
12. బాధ
13. షారుకు ఒక అక్షరం కలిపితే గుర్రం.
15. పద్యాలల్లో యతికి మరో పేరు.
17. విష్ణువు కంఠంలోని మణి.
19. కోడి కూస్తే రాయుయింది.
20. ఈ వనంలోనే కల్ప వృక్షం వున్నది.

ఆధారాలున్నాయి. నుడి కట్టు గళ్ళు నింపండి! కూపన్ కత్తిరించి/మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు. 200/-లు బహుమతి లభిస్తుంది–ఒకరి కన్నాఎక్కువమంది కరెక్టుగా పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే! –సం

గడువు : 10-3-1989



ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపిన వారిపేరు : ..............................

పూర్తి చిరునామా : ..............................

..............................

..............................పిన్‌కోడ్ ..............

# సాహితీ పజిల్

## గళ్ళ నుడి కట్టు – 3

### బహుమతులు



అనేక వందల మంది అమితోత్సాహంతో పాల్గొన్నారు! అందరికీ అభివందనములు. ఆల్ కరెక్టు జవాబులు తొమ్మిది మంది మాత్రం పంపారు. బహుమతి మొత్తం రు. 200/-లన్నీ ఈ తొమ్మిది మందికి దగ్గరి రూపాయికి సవరించి సమానంగా పంచగా రు. 22/–లు! త్వరలో యీ తొమ్మిది మందికి బహుమతులు నగదు రూపంలో పంపే ఏర్పాట్లు చేస్తున్నాము. –సం.

**సరియైన జవాబు పంపినవారి పేర్లు**

యల్లా రంగస్వామి (గిద్దలూరు). డి. పద్మజ (అనంతపురం). ఆర్. కృష్ణ చైతన్య (మదనపల్లి). ఎన్. నారాయణమ్మ (అనంతపురం). ఎ శారద (గుంటూరు). ఏ ఉమాదేవి (హనుమకొండ). డి. రమేష్‌బాబు (అనంతపురం). ఎస్ చంద్రమౌళి (తర్లపాడు). వై రామకృష్ణశాస్త్రి (వారణాసి).

**సరియైన జవాబులు**

| (నిలువు) | (అడ్డం) |
| --- | --- |
| 2. తిమిరం | 1. సాత్వతి |
| 3 భవము | 3. భవాని |
| 4. మారుతి | 6. రంగము |
| 5. ఝరులు | 8. తిరము |
| 7. గవి | 10. మరులు |
| 9. ముదము | 11. దధి |
| 10. మనవి | 12. సాన |
| 13. కామము | 13. కాలము |
| 14. గురి | 15. విశ్రాంతి |
| 16. తిలలు | 17. విరివి |
| 17 విషము | 19. హలము |
| 18. విరభా | 20. భారతం |